

"నటనమాడవే మయూరి"

ఫొటో: వి. కుటుంబరావు.

జూలై విడుదల!

జగ్గయ్య
దేవిక
రామకృష్ణ
కృష్ణ కుమారి
రమణారెడ్డి
ఛాయాదేవి
హేమలత
K.V.S. శర్మ
బాలకృష్ణ
డా॥ శివరామకృష్ణయ్య
పేకేటి



కె.పి.ఆర్ట్స్ ప్రొడక్షన్స్ వారి

# కన్నకొడుకు

కథ
సదాశివబ్రహ్మం
సంగీతం
S.P. కోదండపాణి
కెమెరా
J. సత్యనారాయణ
దర్శకత్వం
కృష్ణారావు

పూర్ణా రిలీజ్



# ఆంధ్ర సచిత్ర వారపత్రికను చదవండి!

# ఉత్తరాలు

## కథల సంచిక.

కథల ప్రత్యేకసంచికపేరుతో వివిధరీతుల కథలను అందించినందులకు మీకు ధన్యవాదాలు. ఆ సంచికలో ప్రచురించిన 'చేదు నిజం', 'ఏక్‌దిన్‌కా', 'పునరావృతం' కథలు చాలా క్రొత్త పోకడలలో నడిచాయి.

యస్. వి. ప్రభాకరరావు (నిడదవోలు)

* * *

ఇటువంటి కథాసంపుటి ఇటీవల వెలువడలేదనడం నిస్సందేహము. ఈమధ్య పత్రికలో వచ్చే కొన్ని కథలు చాల చిరాకు కలిగిస్తూ వచ్చాయి. కాని ఈ కథల సంచికలో వెలువడిన కథలు ఒక్కొక్కటి ఒక్కొక్క మణిపూస. సింగరాజా వారి రచనకు వేరుగ వ్యాఖ్యాన మక్కరలేదు. మధురాంతకం రాజారాం కథ మొదట్లో సాధారణంగా కన్పించినా, ముగించిన రీతిని చూస్తే ప్రథమ స్థాయి రచయితల్లో వారి స్థానాన్ని సులభంగా గుర్తించవచ్చు. శ్రీ రంగధామ్‌గారి "దైవబలం" వింత సొయగాలతో, ఆధ్యాత్మిక చింతన కలిగిస్తున్నది. శ్రీ పెద్దిభొట్లవారి "పేరయ్య బావి" పత్రికకు వన్నె తెచ్చింది. కేవలం శృంగార వర్ణనే కాకుండా క్రొంగొత్తరీతులలో నడిచిందీ కథ.

కథారచయిత లందరికీ మా అభివందనలు.

గొల్లపూడి రాఘవయ్య (విజయనగరం)

ప్రత్యేక కథల సంచికగా ప్రచురించటంవలన ఎండి బీటలుదేరిన భూమి నెరియలయందు జడివాన కురిసినట్లుయింది. సుప్రసిద్ధ రచయితల కథలవేసి పాఠకుల సుల్లాస పరిచారు.

కె. పార్వతీశ్వరరావు (ఉర్లాం)

* * *

ప్రత్యేక కథలసంచికగా ఎందుకు వెలువడినట్లుట? ఈవిధంగా వెలువడుతుందని ముందుగానే ప్రచురిస్తే నాబోంట్లు నాలుగు కథలు పంపుదురు గదా! అయినా పత్రిక (నా కథ లేదుగదా అనే బాధ తప్ప—నే పంపలేదుగా ! పంపకపోవడం నా తప్పయినా !) చాలా బాగుంది.

కుమారి స్వర్ణలత (హైదరాబాద్)

* * *

నా యీ ఉపమానం కొంచెం వినండి.
పత్రిక నిజానికి మా 'హాస్టల్ మెస్సు'
దానిలోని 'కతలూ—యితలూ'
మా మెస్సులోని ప్రిపరేషన్స్
మీరంతా మా మెస్సును నడిపిస్తున్న సెక్రటరీస్!
ఉంటా, టా ! టా !

తుయా కాలేజి విద్యార్థి (బొంబాయి)

అనివార్యకారణాల వల్ల గత మూడు వారాలుగా "హరివంశం" ప్రచురించలేక పోతున్నాము.

## రిక్షావాలా

సచిత్రకొత్త వ్యాసం 'రిక్షావాలా'లాంటివి మరి కొన్ని ప్రచురించ ప్రార్థన.

ఎన్. నాగరాజరావు (కడప)

* * *

శ్రీ పి. వి. రాజగోపాలరావుగారు వ్రాసిన "కొప్పిసెట్టి వెంకటేశ్వర్లు" తో యింటర్వ్యూ లాంటి వ్యాసాలు ప్రచురించటం ఆంధ్ర సచిత్ర వారపత్రికకే అవమానం.

ఫ్రెండ్స్ ఎసోసియేషన్ (కంకిపాడు)

## ఉత్తరాలు

### గళ్లనుడికట్టు

21—6—61 గళ్లనుడికట్టు ఆధారాంలో 22 అర్థం కలగాపులగమైన "వారిధి" అని ఇచ్చారు. శబ్దరత్నాకరం చూశాము. 'వారిధి' అంటే వంతెన అనే అర్థం లేదు. మీరు 'వంతెన' అని జవాబిచ్చారు. 'వారిధి' అంటే 'వంతెన' అని అర్థమా ? మీది అచ్చు పొరబాటని భావిస్తున్నాము.

శ్రీమతి వే. శ్రీదుర్గ, కుమారి వే. సుశీల (బాపట్ల)

'వారధి' పడవలసినది. అచ్చు పొరబాటుకు చింతిస్తున్నాము.



5-7-61 సంచికలో 20వ పేజీలో పడవలసిన బ్లాకు 21వ పేజీలోను, 21వ పేజీలో పడవలసినది 20వ పేజీలోను పడినందుకు చింతిస్తున్నాము.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితము
1908

★

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

★

సంపుటము 53
సంచిక 44

12-7-61
బుధవారం

ప్లవ సం॥ నిజజ్యేష్ఠ అమా॥

★

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి,
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం: జమున


నెత్తిమీద కత్తి
గుల్జారీ సంఘం
వెధవాయ్! చదవవేం!
పుస్తకాలు లేవు నాన్నా!
మాత్రం అహింసాతత్వం లేదు!
అపర గాంధీజీ!
తారాసింగ్
నిరసన వ్రతం
హెచ్చరిక
అగ్నిని చేరనివ్వరాదు
కువైట్
ఇరాక్



నీలకంఠ శిఖరాధిరోహక బృంద సభ్యులతో ప్రధాని శ్రీ నెహ్రూ (ఇటీవల న్యూఢిల్లీలో) ఇష్టాగోష్ఠి.

న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ

# ప్రాంతీయభాషలకు హిందీ చేసినకీడు: సత్యాహింసలు పట్టని నేటి గాంధీ తత్త్వం!

మన ప్రధాన మంత్రి తమకు కావలసిన విశ్రాంతి తీసుకొని, రాజధానికి తిరిగి వచ్చేశారు. తమతో చల్లని గాలిని వెంటపెట్టుకు వచ్చారు. ఇప్పుడిప్పుడే ఢిల్లీలో వర్షపు జల్లులు ప్రారంభమయ్యాయి. ప్రస్తుతానికి మాత్రం అంతా ఆహ్లాదంగానే ఉంది.

అస్సాం గొడవ ఇంకా సమసిపోలేదు. గత వారంలో మళ్లీ అల్లరులు జరిగాయి. కాంగ్రెస్ పాలకులకు ఆత్మపరిశోధనంలో నమ్మకం లేదు. వారికి వాంట్లో ఏమాత్రం నమ్మకం ఉన్నా, గత 15 సంవత్సరాల పాలనలో ఈ దేశానికి తాము ఒరిగించిందేమిటో తెలుసుకోగలిగేవారు. ఇండియా, పాకిస్తాన్, భారత్‌గా విభక్తమైనా 1947 లో ఒకటిగానే ఉంది. పైకి అసంభవంగా కన్పించినా నిజానికి ఇంగ్లీషుభాష, బ్రిటిషు పాలనా విధానమే దేశాన్ని సమైక్య పరిచాయి.

బ్రిటిష్ వ్యతిరేకోద్యమంలో భాగంగా కాంగ్రెస్ సంఘాలను మహాత్మా గాంధీ భాషల ప్రాతిపదిక పైనే పునర్నిర్మించారు. ఆ సంఘాలు ఈ రోజు కూడా అలానే నడుస్తున్నాయ్. ఆ తర్వాతనే 'హిందీ' అనే మహాశక్తి వచ్చి, ఇంగ్లీషు భాషను తొలగించటమే కాక ప్రాంతీయభాష లన్నిటినీ వెలివేసింది. చివరకు పరిశీలనలో మనకు తేలేదేమంటే భాషోద్యమం ఒకపక్క పదవుల కోసం, ఇంకో పక్క కూడు గుడ్డల కోసం పోరాటంగా కన్పిస్తుంది. లోగడ నే చెప్పినుగా, హిందీ కారణంగా కేంద్ర ప్రభుత్వంలో ఎంతలేదన్నా పదివేల ఉద్యోగాలు కల్పించటం జరిగిందని ! పార్లమెంటుకు సంబంధించిన ప్రతి కాగితం ముక్కను కూడా హిందీలోకి తర్జుమా చేయాల్సిందే. ఇంకోవిధంగా చెప్పుకోవాలంటే హిందీ రాని సుమారు పదివేల మందికి ఉద్యోగావకాశాలు పోయాయన్నమాట. తమని ముంచివేయాలని చూస్తున్న ఈ హిందీ తత్వాన్ని వారు నిరసిస్తున్నారంటే ఆశ్చర్య పడవలసిందేమీ లేదు.

ఉత్తరభారతదేశంలోని ముసల్మానులస్థితే ఇందుకు నిదర్శనం. పాలకులుగా భారత ప్రజల పైన ముఖ్యంగా ఉత్తర భారతంపైన తమ భాషా సంస్కృతులను రుద్దిన వీరు బ్రిటిషువారి కాలంలో మనందరిసాటి స్థితికి వచ్చారు. ఈరోజున వారి సంస్కృతులను తుడిచివేయటం జరుగుతోంది.

ముస్లిం సమావేశం, గాలిబ్ దినోత్సవాలు జరిగినా ఉర్దూ అణగిపోతోంది. ఉర్దూ తెలిసిన ఈ తరం గనక పోతే, ఆ భాష అదృశ్య మవుతుంది. అవుతుందేమిటి ? కాకతప్పదు ఇంత కూడూ గుడ్డా కల్పించే శక్తి దానికి లేదు గనుక. ఈ విషయం ఇప్పుడు బెంగాలు, అస్సాం, దక్షిణ భారతాల్లో ప్రాంతీయ భాషల ప్రాముఖ్యం కోసం జరుగుతున్న ఆందోళన ఎందుకో బోధపరుస్తుంది. అంతేగాక ఇంగ్లీషును ముఖ్యంగా హిందీరాని ప్రాంతాల్లో పునరుద్ధరించాలని జరుగుతున్న వాదాన్ని కూడా ఇది బోధపరుస్తుంది.

సమైక్యతాసంఘం సమర్పించిన నివేదిక కాంగ్రెస్‌పై విమర్శ తప్పితే వేరే ఏం కాదు. భారతజాతిలోని వివిధ వర్గాల ప్రజలను సుసంఘటితం చేసే ప్రయత్నంలో కాంగ్రెస్ నాయకత్వం విఫలమైందని ఈ నివేదిక స్పష్టం చేస్తోంది. భారతదేశాన్ని సుసంఘటితం చేయటానికి బదులు ఖాదీ, మద్యనిషేధం, అంబర్‌చర్కా, గోసంరక్షణ లాంటి మహాదాశయాలపై అది తన శక్తిని దుబారా చేస్తోంది.

గోసంరక్షణ విషయం చూద్దాం! అశోక్ హోటల్లో గొడ్డుమాంసం వాడటాన్ని నిషేధిస్తూ ఉత్తర్వు చేశామని మన ప్రధాన మంత్రి ఒక కోటీశ్వరునికి ఉత్తరం వ్రాశారు. అశోక్ హోటలులో పందిమాంసం వినియోగం నిరోధించమని మహమ్మదీయులు ప్రధానిని అడగటం బహుశా రెండోమెట్టు కావచ్చు. ఆ తరువాత మాంసాహారాన్ని, దుంపకూరల వినియోగాన్ని అశోక్ హోటల్లో నిరోధించవలసిందిగా జైనులు ప్రధానికి విజ్ఞప్తి చేయవచ్చు. చిట్ట చివరకు గోపూజా ధురంధరులు పాలు, వెన్న వినియోగాన్ని ఆ హోటల్లో నిషేధించవలసిందని అడుగవచ్చు. గాంధి తత్వవాదులు అశోకా హోటల్లో పనివారి దుస్తులకు, బల్లమీద పరచడానికి ఖాదీనే వాడాలని కోర్తారు. అయినా అశోకా హోటలు స్వయంపాలక ప్రతిపత్తి గల్గిన సంస్థగా, భారతీయ కంపెనీల చట్టం క్రిందే చేరిన సంస్థగానే భావించవలసి ఉంటుంది. మద్యనిషేధం గూర్చి చెప్పాలంటే ఈనాటి గాంధితత్వానికి మద్యనిషేధం అవసరమైనంతగా సత్యాహింసలు కూడా కావనిస్తుంది. మద్యనిషేధంపుణ్యమంటూ మద్యపానం చిన్నగా గ్రామాల్లో కూడా ప్రాకుతోంది. కొండజాతుల వారు కాక మన పట్టణ జనాభాలో నూటికి పదిమందికంటే మద్యం సేవించరనీ అందులోను నూటికి ఇద్దరు మాత్రమే అలవాటు పడ్డవారనీ తెలుసుకోటం అవసరం. జనాభాలోని ఈ 10% మందినీ మద్యపానంనుంచి కాపాడుటకే కోట్ల

(62-వ పేజీ చూడండి)




**ఆకస్మికంగా ఆ ఊరికి వచ్చిన మృత్యుంజయు డెవరు? అతని పూర్వగాథ ఏమిటి ?**

ఆ వూళ్లో ఎవరి నోటివెంట చూసినా, ఎప్పు అవే పలుకులు, అవే మాటలు—"వింతమనిషి, వింతపశువు .... దేవుడు .... కాదు .... దయ్యం". ఈ మాటలు అనుకునేటపుడు వాళ్ళ పొందే ఆశ్చర్యం ఎవరికీ అంతుపట్టదు. అసలే అది పల్లె టూరు .... గోరంత వింతైనా కొండంత వింతై తర్లే .... అదే ఇక కొండంత వింతైతే ...."

*　　*　　*

"ఈ వూరుకు కీడే ప్రాప్తించిందో, మేలే ప్రాప్తించిందో గాని, మరీ మరీ విడ్డూరాలు విరుచుకు పడుతున్నాయి. ఉన్న విడ్డూరం చాలదూ ? యీ మరో విపరీతం కూడా కలిసిరావాలా? ఊసుపోని వాళ్ళందరికీ నోరు దురదతీరేదాకా మాట్లాడుకోడానికి మాలావు విషయాలు దొరికాయి" అన్నాడు మునసబు కరణంతో.

కరణం తాపీగా చుట్టముట్టిస్తూ, "లోక మండీ, నానాటికీ తెలుగుమీరుతోంది. 'రంపాలు' మొదలు 'రాకెట్ల' వరకూ కనిపెట్టారు. బుర్రలు తీసి బుర్రలు మారుస్తున్నారు. బుర్రలు లేకుండా కూడా మనిషి ఉండేలా రేపీపాటికి కనిపెడ్తారు ... సైన్సు .... సైన్సండీ" అన్నాడు తన విజ్ఞానాన్ని ప్రదర్శిస్తూ.

"బుర్ర లేకుండా మనిషిని కనిపెట్టడం ఎందుకు ? ఉన్నదంతా (బుర్రలు) లేనిసరుకేగా ?" అన్నాడు మునసబు చుట్టపొగ వదులుతూ.

ఇంతలో ఒక సరికొత్తకారు ఆ వైపునుంచి దూసుకుపోయింది. కరణం కారులోకి తొంగి చూశాడు. మునసబు 'హ్మ' అంటూ ఓ నిశ్వాసాన్ని బయట్కి 'తల' వంచుకున్నాడు.

"మీ రెన్నైనా అనండి, కానీ, నాకు అతన్ని చూస్తే జాలివేస్తోందిగాని, అసహ్యం పుట్టటం లేదండి."

మునసబు ఆ మాటలకు ఇబ్బందిగా ముఖం పెట్టాడు. "అవునవును...డబ్బున్న పిచ్చివాళ్ళని చూస్తే అలాగే అనిపిస్తుంది. అదే డబ్బులో మజా" అన్నాడు బొటనవ్రేలును 'టకటక' లాడిస్తూ.

"ఎబ్బే! అలా అనకండి. అతన్ని చూస్తే నామటుకు నాకు అతనో యుగపురుషుడేమో అనిపిస్తుంది. మనిషి ఎప్పుడూ ఏదో ఆలోచిస్తున్న వాడిలా ఉంటాడు. నా అన్నవాళ్ళ ఎవరూ లేరట! పాపం .... పలకరిస్తే ఎంత మర్యాదయిచ్చి మాట్లాడుతాడో తెలుసా ? మీ రెన్నడూ అతని బంగళాకు వెళ్ళలేదుకదూ .... " అన్నాడు కరణం. మునసబు 'లేదు' అన్నట్లు తల ఊపాడు. కరణం 'ఛకాల్' మని నవ్వుతూ 'అద్దీ! అల్లా చెప్పండి. రేపోసారి .... రేపటిదాకా ఎందుకు? ఈ రాత్రికి నేను వెళ్తున్నాను. నాతో రండి, మీకే తెలుస్తుంది." అన్నాడు.

"ఎబ్బే! ఇవాళ రాత్రి కుదరదు. వాడొకడు వచ్చాడుగా, వింతపశువు. మన ప్రాణంమీదికి రాత్రికి ఇక్కడకు వస్తాడుట. వింతలు కావాలట. రాసుకు పోతాడట. పిచ్చి వేషాలూ, వెర్రి వేధలూ" మునసబు విసుగ్గా ముఖంపెట్టాడు..

"మరేట! అదేం వెర్రండీ ? దస్తాలు దస్తాలు అలా అన్నివిషయాలూ రాసి ఏం చేస్తాడు ?"

"ఏం చేస్తాడు ? తలగడ దిళ్ళకు బదులు ఉపయోగిస్తాడు. మరీ ఎక్కువయితే వరుపులకు బదులుకూడా ఉపయోగిస్తాడు" అన్నం ఎక్కువైతే అజీర్తి, డబ్బెక్కువైతే వికారం" అని పెద్దలు ఉత్తినే అన్నారా ?"

"బాగా చెప్పారు" అంటూ కరణం లేచి నించున్నాడు.

"రాత్రికి రండి. వాడికేవో, చెప్పితే ఆ పని అయిపోతుంది" అన్నాడు మునసబు. కరణం 'అలాగే' అంటూ వెళ్లిపోయాడు.

*　　*　　*

కారు అనేక మలుపులు తిరిగి ఊరు చివరకు చేరుకుంది. మృత్యుంజయుడు కారు దిగి పొలాల కేసి నడక ప్రారంభించాడు. వెన్నెల నీటులో అతని పచ్చనిశరీరకాంతి ద్విగుణీకృతం అయింది. అతను పొలాల గట్లవెంట నడిచి చెరువుగట్టు మీద కూర్చున్నాడు. అతనిశరీరసౌందర్యానికీ, మానసికసౌందర్యానికీ పొత్తు లేదు. ఆ సమయంలో ఎవరైనా సరే అతని ముఖంలోకి నిశితంగా చూస్తే "మూర్తీభవించిన నిస్పృహ" అని అనితీరాలి.

మృత్యుంజయుడు వెల్లకిలా పడుకుని తల క్రింద రెండుచేతులూ పెట్టుకున్నాడు .... అతని కళ్ళు ఆకాశం వంక చూడసాగాయి .... "ఆకాశం అనంతం, సాగరం అనంతం .... వీటి రెంటికీ ఎంత పోలిక ? మేఘరహితమైన ఆకాశం నీలం, సముద్రం నీలం .... రెండూ అనంతాలే .... సముద్రంవంక చూస్తే—ఆకాశం సముద్రం కలిసినట్లు అనిపిస్తుంది. కానీ అవి కలవవు. ఎన్నడూ కలవవు. అవి కలవడం ఎంత అసంభవమో, నా జీవితం దాని అంతం అంత అసంభవాలేమో! ఎందు కీ వ్యర్థజీవితం ? ప్రాయశ్చిత్తం లేని పశ్చాత్తాపం ఎందుకూ కొరగాదు... అనవసరమని మథన పడేవాళ్ళకు జీవితం అనంతం .... పిసినారివాళ్ళకూ, ఆలాటివాళ్ళకూ, బ్రతుకుదామని ఆశపడేవారికి అది అసంభవం .... ఇది యింతే. 'పాపీ చిరాయువు' అన్నారు పెద్దలు. 'పాపీ చిరాయువు' అతను తనలో తను గొణుక్కుంటూ

(57-వ పేజీ చూడండి)



ఇటీవల భువనగిరిలో రాష్ట్ర కాంగ్రెసు రాజకీయ మహాసభ జరిగినప్పుడు ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య పతాకావిష్కరణం చేశారు.

మనమూ-మనరాష్ట్రం

# అన్యోన్య విమర్శలు ఐకమత్యానికి మార్గమా?

భువనగిరిలో రెండురోజులపాటు జరిగిన ప్రదేశ్ కాంగ్రెస్ రాజకీయ మహాసభ చివరకు సాధించిందేమిటి అన్న ప్రశ్న వేసుకుంటే ఏమీ లేదు అన్న జవాబు వెంటనే స్ఫురిస్తుంది ఎన్నికలకు ముందు జరుగుతున్న మహాసభ గనుక, దీనికి ప్రత్యేక ప్రాముఖ్యం ఉందని అందరూ అనుకున్నారు ఆఖరికి శ్రీ వల్లంరాజాగారుకూడా తమ అధ్యక్షోపన్యాసంలో ఈ మహాసభవల్ల ప్రజలలో నవ చైతన్యం కలుగుతుందని ఆశించారు ప్రతి సంగతి దేవునెరుగు కనీసం కాంగ్రెస్‌వారిలోనైనా అటువంటి చైతన్యం కలిగే ఆస్కారం కనిపించదు మహాసభలో గంభీరోపన్యాసాలు చేసిన నాయకులందరూ కాంగ్రెస్ గతప్రాభవాన్ని పొగుడుతూ నేటి స్థితిని తెగడటంతప్ప, ఇవాళటి ఈ దుస్థితిని తొలగించడానికి ఇదమిత్థమైన కార్యక్రమమేదీ సూచించలేదు పైగా కాంగ్రెస్‌లో కుళ్ళును బహిరంగంగా కడుక్కోవడంతోపాటు అన్యాపదేశంగా ఒకళ్ళనొకళ్ళు నిందించుకోడానికి ఈ మహాసభను వేదికగా ఉపయోగించుకున్నారు

నాయకుల ఉపన్యాసాలన్నింటిలోనూ ప్రధానాంశం కాంగ్రెస్ లక్ష్యాలు, సిద్ధాంతాలు, ప్రణాళికాభివృద్ధికృషి ఎవరికీ అర్థం కాలేదని, స్వార్థపరాయణులు, అవినీతిపరులు, అధికారవ్యామోహపీడితులు, అధికంగాచేరి కాంగ్రెస్‌ను ధ్వంసం చేస్తున్నారని నిజానికి ఈ విమర్శలేవీ కొత్తవికావు కాంగ్రెస్ లక్ష్యంగా పెట్టుకున్న సామ్యవాదసమాజం, సహకార, శ్రీ యోరాజ్యం అంటే నాయకులలోకూడా ఎంతమందికి తెలుసు వ్యక్తిబలమే సంఘబలం వ్యక్తిశ్రేయస్సే సంఘశ్రేయస్సు ఏ ఒక్కరికీ ఎలాంటి కష్టనష్టము లేకుండా "సర్వేజనా సుఖినోభవంతు" అన్నదే కాంగ్రెస్ లక్ష్యానికి అర్థం అని శ్రీ వల్లంరాజాగారు నిర్వచించగా, ధనవంతులైనవారిని కిందికిదించి కిందనున్నవారిని పైఅంతస్థు కెక్కించడమే కాంగ్రెస్ ఆశయమని, వ్యక్తిగతమైన అనుమానాలలోకి పోకుండా ఇది సాధించటం అర్థరహితమని ముఖ్యమంత్రి సెలవిచ్చారు సామ్యవాదసమాజం అని ఏదో స్థూలంగా చెప్పుకోడమేగాని ఈ లక్ష్యం పరమార్థమిది, ఎవరికీ హానికలుగని విధంగా దీన్ని సాధించేందుకు వేసుకున్న మార్గమిది అని ఖచ్చితంగా చెప్పిన నాథుడులేడు సామ్యవాద వ్యవస్థలో ప్రైవేటురంగానికి చోటుండదని ఒక సందర్భంలోను, ప్రైవేటురంగానికి అన్నివిధాలా ప్రోత్సాహమిస్తామని, మనది మిశ్రమ ఆర్థికవ్యవస్థ అని మరో సందర్భంలోనూ శ్రీ నెహ్రూ వంటివారే ఆత్మవ్యాఘాతంగా మాట్లాడుతున్నారు అటువంటప్పుడు సామాన్య కాంగ్రెస్‌వాదికి కాంగ్రెస్ లక్ష్యం ఏమిటో అర్థం కావటంలేదంటే ఆశ్చర్యమేమున్నది? సంస్థలో పైన జరిగే నిర్ణయాలకు కిందిస్థాయివారి ఆలోచనలకు ఎంతెరం చాలా కన్పిస్తోందని ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులే ఒప్పుకున్నారు అంటే కాంగ్రెస్ సభ్యుల అభిప్రాయంతో గాని, ప్రజాభీష్టంతోగాని నిమిత్తం లేకుండా నాయకులు నడుస్తున్నారనేగదా ఇందుకు సహకార సేద్యమే ప్రత్యక్ష తార్కాణం పరిస్థితులు పరిశీలించకుండా, ప్రజలతో నిమిత్తం లేకుండా నిర్ణయాలుచేస్తూ, కాంగ్రెస్ అభ్యుదయ ప్రస్థానం ఎవ్వరికీ అర్థంకావడంలేదని శ్రీ వల్లం[illegible] బాధపడి ప్రయోజనమేమి

పోతే అవినీతిపరులు, స్వార్థపరులు[illegible] వీళ్ళు కాంగ్రెస్‌లోకి కొత్తగా వచ్చినవాళ్ళుకాదు అనాదిగా కాంగ్రెస్‌లో ఉంటూ, అధికారం చవి తగిలేసరికి స్వార్థపరులు తయారైనారన్న సంగతి గ్రహించలేకాకుంటే స్వాతంత్ర్యం రోజుల్లో గొప్ప దేశభక్తులుగా గౌరవం పొందినవారు నేడు పర్మిట్‌రాయళ్ళుగా, అధికార పిపాసువులుగా ఎందుకు మారాలి స్వార్థమన్నది ప్రతిమనిషిలోను నిక్షిప్తంగా ఉంటుంది అవకాశం దొరికితే పైకి పొంగుతుంది అంతే ఈ నాడీ విమర్శలు చేస్తున్న నాయకులకు మంత్రిపదవులపైన మమకారంలేదని, నిస్వార్థ ప్రజాసేవే వారి జీవిత

రాష్ట్ర రాజకీయాలపైన వారం వారం వ్యాఖ్యలు ప్రచురించ దలచాము

# భువనగిరిసమావేశం

పరమార్థమని అంటే ఎవరైనా నమ్మగలరా? 'కాంగ్రెస్‌లో ఈ తగవులకు మూలం అధికారం పిచ్చి మంత్రిపదవులపై కాంక్షే"నని శ్రీ సంజీవరెడ్డి అన్నారు గదా. ఈ అధికార పిచ్చి ఉంటే స్వార్థం తప్పదు. స్వార్థాన్ని జయించిన నాయకులు కాంగ్రెస్‌లో ఎందరున్నారు? అవకాశవాదులు, అభివృద్ధి నిరోధకులు కాంగ్రెస్‌లో చేరారంటున్నారు. మాజీ సంస్థానాధీశులను, జమీందార్లను, కాంగ్రెస్‌లో చేర్చి, ఎం. ఎల్. ఏ లుగా గెల్పించి, వారిలో పదవుల ఆశ పెంచినదెవరు? పార్లమెంటు సభ్యులు, శాసన సభ్యులు, అవకాశవాదులను, స్వార్థపరులను దగ్గరకు చేరనివ్వరాదని కాంగ్రెస్ అధ్యక్షులు హెచ్చరించారు. కాని ఈ పార్లమెంటు, శాసనసభ్యులు అందరూ ఈ అవగుణాలకు అతీతులనా? కాదని శ్రీ సంజీవరెడ్డే అన్నారు. వారు తమ ఉపన్యాసంలో చెప్పిన ముక్కలివి. "దేశానికి సేవ చేస్తారని ఏ పార్లమెంటుకో, శాసనసభకో ఎన్నికచేసి పంపితే కొందరు మహనీయులు, పర్మిట్‌రాయుళ్ళను వెంట వేసుకొని తిరుగుతున్నారు. వీళ్ళవల్లనే కాంగ్రెస్ **కుంగిపోతోంది" కనుక ఇతర్లెవరినో నిందించే ముందు నాయకులైనవారు కూడా ఆత్మ పరిశోధన చేసుకోడం అవసరం.**

ఇంతకూ కాంగ్రెస్‌ను చక్కదిద్దడానికి, ముఠా తగవులను అంతమొందించడానికి వీరు సూచించిన మార్గమేమిటండీ. నిన్న మొన్నటిదాకా విధినబడ్డ నాయకులు నాలుగురోజులు కలసి తిరిగినంత మాత్రాన ఐకమత్యం కుదిరినట్లేనా? లేదువి ఆయా సభలలోవారు చేసిన ప్రసంగాలేచెబుతున్నవి.

అంతేగాదు, గత ఎన్నికల్లో కాంగ్రెసేతరులు గెల్చుకున్న నియోజకవర్గాలలో అభ్యర్థుల నిర్ణయానికి ఇప్పుడు పడుతున్న మథన, మల్లగుల్లాలు ఇందుకొక ఉదాహరణ ఇక్కడకూడా ఏకాభిప్రాయం కుదురుతుందని పైకి అంటున్నారు. అభ్యర్థుల నిర్ణయమైన తరువాతగాని, అది ఎటువంటి ఏకాభిప్రాయమో తెలియదు. పైపైకి కన్పిస్తున్న ఐకమత్యం భువనగిరి మహాసభలో బలపడుతుందని వివిధవర్గాల నాయకులు ఆశించారు. అయితే అసలిక్కడ ఆ ఊసే రాలేదు. పైగా వ్యక్తిగత విమర్శల డోసు ఎక్కువైంది. సాక్షాత్తు కాంగ్రెస్ అధ్యక్షులే ముఖ్యమంత్రి అంతటి వ్యక్తిని (పేరు చెప్పలేదనుకోండి) కులసభలకు వెళ్ళారని బహిరంగ సభలో నిందించారు. మతోన్మాదసమయంలో ముస్లిం మహాసభకు అనుమతించగా లేనిది, కేంద్రమంత్రులే, ఆ సభకు హాజరవగాలేనిది కుల సభలకు వెళ్ళడంలో మహాదోషమేమిటో తెలియదు.

కాంగ్రెసును నిజంగా బలపరచడమే నాయకుల ఆశయమైతే, అదేదో జాతీయోద్యమమని ధర్మపన్నాలు చెప్పడం, సంస్థ ప్రధానమా, వ్యక్తి ప్రధానమా అన్న శుష్కవాదాలు చేయడం మాని, పార్టీలో గల అవకతవకలు సరిదిద్దుకోడానికి చిత్తశుద్ధితో పనిచేయాలి. కాంగ్రెస్ ఒకప్పుడు జాతీయోద్యమమే **కాని నేడది పక్కుండీ రాజకీయపక్షంగానే నడవాలి. దేశంలో మరో బలమైన పార్టీ ఏదీ లేనందున్న, కాంగ్రెసుపార్టీకి సర్వజనసమాదరణ ఉందనుకొని తృప్తిపడటం కేవలం భ్రమ. —కౌండిన్య.**

# కథ కాని కథ

## అవమానపరిచే పద్ధతి

### (మొదటి బహుమతి రు. 10 లు)

మొన్న మా బంధువుల యింట్లో పెళ్లి అయింది. మేము మొగ పెళ్లి వారము. మొగ పెళ్లివార మంతా ఆడపెళ్లివారి వూరు తరలి వెళ్లేము. మా అందరితో మా పెద్దబావగారు కూడా పెళ్లికి వచ్చేరు. మొగ పెళ్లివారికి ఏమాత్రం ఆలస్యం అయినా అది వారిని ఆడ పెళ్లివారు అవమానించడం అనే ఆయన ఉద్దేశ్యం.

పెళ్లికూతురు అన్న కాబోలు అటు యిటూ హడావిడిగా తిరుగుతున్నాడు. మా పెద్ద బావ గారు 'అవి కావాలి, యివి కావాలి' అని ఆయనకి పురమా యిస్తున్నారు. "తెస్తా తెస్తా" అంటూ ఆయన ఆలస్యం చేస్తున్నాడు. మా బావగార్కి కోపం వచ్చి ఆయనతో "ఇలా మమ్మల్ని అవమానిస్తారా ?" అని రెండు మూడు సార్లు అన్నారు. ఇంకోసారి యిలా అనేటప్పటికి పెళ్లి కూతురు అన్నకు చిరాకెత్తి "ఇంకెలా అవమా నించాలి బాబూ ?" అన్నాడు ఎంతో మెల్లిగా.

జి. సుబ్బారావు (విజయపురి)

* * *

## జనాభాలెఖ్ఖల సేకరణ

### (రెండవ బహుమతి రు. 5 లు)

ఈ సంఘటన యీ మధ్యనే అంటే జనాభా లెక్కల సేకరణ జరిగేటప్పుడు జరిగింది. మా మిత్రబృందం అంతా కలిసి షికారుకు బయలు దేరాము. దారిలో స్మశానం గట్టుమీద మా మిత్రుడు కనబడ్డాడు. వాడ్ని చూచి మా మిత్ర బృందం అంతా ఆశ్చర్యపోయింది. వాడి దగ్గరకు వెళ్లి 'ఏరా ! యిక్కడ కూర్చున్నావు ?' అని అడిగినాము.

దానికి వాడు యిలా చెప్పాడు : 'నన్ను జనాభా లెక్కల సేకరణకు( ఎన్యూమరేటరు ) నియమించారు! జనాభా లెఖ్ఖల సేకరణ రేపటితో ఆఖరు. ఎవరయినా చనిపోతే వాళ్ల పేర్లు లిస్టులో నుండి తొలగించాలి. కనుక ఎవరి యింటికయినా వెళ్లి మీ యింట్లో ఎవరయినా చనిపోయారా ? అని అడిగితే వాళ్లు ముందు నన్ను చంపేస్తారు. కనుక యిక్కడ కూర్చున్నాను. ఎవరయినా చనిపోతే ఎలాగూ చచ్చినవాళ్ని యిక్కడకు తీసుకురాకుండా ఉండరు. అప్పుడు వాళ్ల పేర్లు లిస్టులో నుండి తొలగించవచ్చు' అని చెప్పాడు. వాడి సమాధానం విని మేమంతా పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వు కున్నాం.

ఎం. అజీజుద్దీన్ (భీమవరం)

* * *

## "పుస్తకం రాగానే...."

### (రెండవ బహుమతి రు. 5 లు)

మా అన్నయ్య బి. ఎస్ సి. పట్టా చేతపట్టి, ఉద్యోగాన్వేషణ చేస్తున్న రోజులవి. ఎంతకూ ఉద్యోగం చిక్కకపోయేసరికి, ఎలాగో తిప్పలుపడి నలుగు రైదుగురు పి. యు. సి. క్లాసు స్టూడెం ట్సుకు ట్యూటర్‌గా కుదిరాడు. కొంచెం శ్రద్ధగా చెప్పుతుండేవాడేమో, ప్రతిరోజూ ఎవరో ఒకరు మా అన్నయ్యతో మాట్లాడ్డానికో, లేక అన్నయ్య పి. యు. సి. నోట్సును తీసుక వెళ్లడానికో లేక తిరిగి యివ్వడానికో వస్తూ పోతూ ఉండేవాడు. అన్నయ్యలేని సమయంలో ఎంక్వయిరీ సెక్షన్‌ను, మా అమ్మో లేక తమ్ముడో నిర్వర్తిస్తుండేవారు. కనుక ఆ బాధ్యత యెప్పుడూ నాపై పడేదికాదు. కాని ఒక ఆదివారం ప్రొద్దుట ఏదో కారణంచేత, ఆ బాధ్యత కాస్తా నాపై పడింది. ఎవరో కాలింగ్ బెల్ నొక్కేసరికి తలుపు తెరచాను. చేతిలో పుస్తకంతో ఒక అబ్బాయి ప్రత్యక్షమయ్యాడు. నన్ను చూస్తూనే ఆ అబ్బాయి దడ వణుకుతో, (నా ఆకారాన్ని చూసి కాదనుకోండి. బహుశా పి. యు. సి. క్లాసులో విద్యార్థినులు లేకనుకుంటాను.)

"మాష్టరుగారు లేరాండి ?" అన్నాడు. 'లే' రన్న సమాధానంతో "పుస్తకం రాగానే మాష్టరుగార్కివ్వండి" అంటూ ఆ పుస్తకాన్నిస్తుంటే నాకు నవ్వాగిందికాదు. ఇక ఆ అబ్బాయి సంగతంటారా ! తిరిగి చూడకుండా వెళ్లిపోయాడు.

ఇప్పటికీ ఎవరైనా పుస్తకాలను ఎవరికైనా అందజేయమని నన్ను కోరినప్పుడు ఈ సంఘటన జ్ఞాపకంవచ్చి పొట్ట చెక్కలవుతూంటుంది.

కె. సీత (మద్రాసు)

* * *

## "గాడిద అరుపు"

### (రెండవ బహుమతి రు. 5 లు)

అవి మేము మూడవఫారము చదువుకునే రోజులు. మాకు తెలుగుమేష్టరు శర్మగా రుండే వారు. ఒకరోజు పాఠము చెప్తు సందర్భానుసారముగా 'గాడిద ఏవిధముగా అరుస్తుంది' చెప్పమని అందరిని అడిగారు. ఎవ్వరు చెప్పలేకపోయారు. నేను చెప్తాను వినమని మేష్టరు ఈవిధముగా చెప్ప సాగారు. 'మొదట గాడిద రహీ మని అరుస్తుంది తర్వాత హైకి, నైకి( ఉన్నాడో లేదో )యని సందేహంతో అరుస్తుంది. తర్వాత హై హై (ఉన్నాడు న్నాడు) యని నిర్ధారణ చేసుకుంటుంది.' ఒకనాడు మాష్టరు పాఠం చెప్తున్నారు. బయట గాడిద ఒకరుపు అరిచింది. చంద్రం చెవులు నిక్కబెట్టి విని ఇప్పుడది రహిం అని అరచింది అనుకున్నాడు. తర్వాత అది అరవలేదు. తక్కుమని లేచి 'సార్ ! బయట గాడిద రహీమ్ అని మాత్రం అరచింది. హైకి నైకి( సందేహము ) హై హై ( నిర్ధారణగా ) అరవలేదన్నాడు మా మేష్టారు ఇప్పుడు నీవు అరచావుగా "గాడిద" కూర్చోమన్నారు. క్లాసంతా నవ్వుతో నిండిపోయింది.

ఎం. గౌస్‌ఖాన్ ( కడప )

* * *

## ఏప్రెల్ ఫూల్

### (రెండవ బహుమతి రు. 5 లు)

మా స్నేహితుడు రాము సర్వీస్ కమీషన్ పరీక్షకు కూర్చున్నాడు మొన్న ఏప్రిల్ 1 వ తారీఖున అతన్ని ఎల్ డి. సి. గా నియమిస్తూ ఆర్డరు వచ్చింది. దానికి వాళ్లింట్లో అందరు సంతోషించారు. ఆ మర్నాడు మధ్యాహ్నం మా స్నేహితులందరికి రాము, డిన్నరు ఏర్పాటు చేశాడు. డిన్నరు అయింది. అందరం కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నాము. ఇంతలో మా స్నేహితుల్లో ఒకడయిన సత్యం పెద్దగా నవ్వసాగాడు. ఎందుకు నవ్వుతున్నావని మేము అడిగితే "రామాన్ని ఏప్రిల్ ఫూల్ చేయుటానికి, ఆ ఆర్డరు తాను పంపించిందే" నని చెప్పాడు. మేము ఆశ్చర్యపోయి తేరుకునేలోపల "పోస్టుసార్ !" అని పోస్టుజవాను ఒక కవరు ఇచ్చి వెళ్లాడు మేము అది విప్పిచూడగానే సత్యం తెల్లబోయాడు.అందులో సత్యం పంపిన ఆర్డరు ఉంది. అది ఒకరోజు ఆలస్య మయిందన్నమాట. మొదట వచ్చింది నిజంగా ఆర్డరు.

కె. రామచంద్రరావు ( ఆళ్ళగడ్డ)



# మనమూ మనదేహస్థితీ

డా॥ గాలి బాలసుందరరావు

## నత్తి పారంపర్యమా?

నత్తి పరంపరాగతమైన వాగ్లోపమా?

ఏవి లక్షణములు, లోపములు పారంపర్యంగా సంక్రమించుతవో నిశ్చయంగా చెప్పగలిగిన స్థితికి విజ్ఞానం యింకా రాలేదు. వంటి రంగు, కంటి రంగు, దేహం పరిమాణం, దేహం ఆకృతి వంటి వరసల తీరు, ఇటువంటి వెన్నో పరంపరగా సంక్రమిస్తవని కొంతమంది భావిస్తారు. అల్లాగే నత్తి కూడా వంశపారంపర్యంగా యేర్పడుతుందని భావించేవారు లేకపోలేదు. దైహిక విషయములలోనే పరంపర ఎంతవరకు సంక్రమించిందో తెలియనప్పుడు ఇక ప్రవర్తన, స్వభావం యిటువంటి మానసిక విషయాలలో ఎంతగా అది ప్రాముఖ్యత వహిస్తుందో నిర్ణయించడం కష్టం. పిరికితనం, ప్రతి చిన్న విషయానికి ఆందోళనపడే స్వభావం, పదిమందిలో నోరు విప్పడానికి భయపడే గుణం, నత్తి యేర్పడడానికి చాలవరకు కారణములు. ఈ లక్షణములు పరంపరగా ఎంతవరకు సంక్రమిస్తవి అన్నది కేవలం వివాదాంశము.

ఏవి లక్షణములిటి సంక్రమించినవో, సంక్రమిస్తవో చెప్పలేముగాని మన శరీరం మాత్రం మాతాపితరులనుంచి సంక్రమించినదేనని నిశ్చయంగా చెప్పగలము. ఈమధ్య పరంపరా విజ్ఞానం విపరీతంగా పెరిగింది. ఆ వివరములు సమగ్రంగా చర్చించడానికి యిది తరుణంకాదు. కాని శుక్ల శోణితములలోవున్న సూక్ష్మాతిసూక్ష్మములయిన కొన్ని కణముల సంఖ్యనుబట్టి, లింగభేదము, శిశులక్షణములు యేర్పడతవని శాస్త్రజ్ఞులు నిర్ణయించారు. అయితే ఆ సూక్ష్మ కణముల సంఖ్యాభేదం యెందువల్ల ఏర్పడుతుందో, ఏ పరిస్థితుల మీద ఆధారపడుతుందో వారు యింకా నిర్ణయించలేదు. శిశువు కొన్ని విశిష్టములయిన అవయవ లోపములతో పుడితే తరవాత నత్తి యేర్పడుతుందని తెలిస్తే, ఎవరికి నత్తి వస్తుందో, ఎవరికి రాదో నిర్ణయించవచ్చు. పరంపరగా ఆలోపములు నివారించడానికి ప్రయత్నించవచ్చు. కాని, యీనాడు శాస్త్రజ్ఞులకు తెలిసిన ఏ పరీక్షా విధానములవల్ల, యీ లోపములవల్ల 'నత్తి వస్తుంద'ని నిర్ణయించడానికి వీలులేదు.

అవయవ లోపములవల్ల నత్తి వస్తుందా?

పరిశోధనవల్ల యీ క్రింది విషయాలు నిర్ణయింపబడ్డవి. నాలుక నిర్మితిలో లోపాలవల్ల ఉచ్చారణలోపములు రావచ్చును. కాని నత్తి రావడానికి వీలులేదు. బుద్ధి కుశలత సరిగ్గా ప్రవృద్ధి చెందకపోతే మాటల పొందిక, భావ నిర్మాణం లోపించవచ్చు, కాని నత్తి యేర్పడదు.

నత్తివారు ఉపయోగించే మాటలలో నూటికి 10 మాటలమీదనే నత్తి వస్తుంది. మిగతా మాటలు వారు బాగానే మాట్లాడతారు. నత్తితో మాట్లాడే మాటలు ఉచ్చరించడానికిముందు వారు ఒకటి రెండు క్షణములు బాధపడి తరవాత అంటారు. నత్తి అందరిలోనూ ఒకే మాదిరిగా వుండదు. ఈ యీ శబ్దములు ఉత్పత్తి చేసేటప్పుడు మాత్రమే నత్తి వస్తుందని చెప్పడానికి వీలులేదు. నత్తి సాధారణంగా చిన్న పిల్లలలో రెండు సంవత్సరములనుంచి నాలుగు సంవత్సరముల మధ్య మొదలు పెడుతుంది. కొందరిలో యింతకు ముందు రావచ్చు. తరవాతనూ రావచ్చును. అనేక మందిలో జీవితంలో ఏదో సందర్భంలో మాటల తడబాటు ఏర్పడి, ఏ చికిత్సా లేకుండానే ఆ లోపం నివారించబడింది. అనేక మందిలో నత్తి ఏ అవయవములకూ ప్రత్యేక చికిత్స లేకుండానే యితర సాధనములవల్ల నివారించబడింది. నత్తి, అచ్చులు ఉచ్చరించేటప్పుడుకంటె హల్లులు ఉచ్చరించేటప్పుడు, నామ వాచకములు ఉచ్చరించేటప్పటికంటె వాక్యారంభంలోవచ్చే క్రియలు, ఉపక్రియలు, విశేషణములు. మామూలు పదములకంటె దీర్ఘము లైనప్పుడు ఎక్కువగా కనుపిస్తుంది.

> డా॥ బాలసుందరరావు గారిని ప్రశ్నలడగదలచేవారు తమ చిరునామా గల కవరుతో C/o ఆంధ్ర సచిత్ర వారపత్రిక 7, తంబుచెట్టి వీధి మద్రాసు - 1 వ్రాయగోరుతాము.

మాటలాడడానికి అత్యవసరములయిన పెదవులు, నాలుక, దవడలు ఉచ్ఛ్వాస నిశ్వాసములకు సంబంధించిన కండరములు నత్తి వారిలోనూ, నత్తిలేని వారిలోనూ, సమానంగానే పరిశ్రమ చేస్తవి. హృదయ స్పందన వేగము స్వభావము, నెత్తురుపోటు, శరీర కార్యక్రమఫలితము(Basal Metabolic rate), నత్తి వారిలోనూ, నత్తిలేని వారిలోను ఒక మాదిరిగానే ఉంటవి. కేవలం నత్తివల్ల, వీటిలో భేదములు ఏవరూ గమనించలేదు. ఒకప్పుడు ఎడమచేయి ఉపయోగించడానికీ, కుడిచేయి ఉపయోగించడానికీ, నత్తికీ ఏమయినా సంబంధం వున్నదా అని పరిశోధన చేశారు. కాని నత్తికీ, ఏదో ఒక చేయి ఉపయోగించడానికీ యేమీ సంబంధం లేదని తేలింది.

ఈ పై అంశములు గమనిస్తే దేహంలో అవయవముల లోపంవల్ల నత్తి రాదనీ, అథవా ఆటువంటి లోపంవల్ల నత్తివచ్చివుంటే అది అతితాత్కాలికమూ, పరీక్షలకు అందనిదీఅయి వుండాలని తెలుస్తుంది. దేహ లోపములనే గడ్డివామిలో నత్తికి కారణమయినది ఎక్కడుందో ఎవరికీ తెలియలేదు. కాని అసంఖ్యాకులు నత్తికీ దేహ లోపాలకూ ఏమీ సంబంధం లేదనే నిర్ణయానికి వచ్చేరు.

నత్తి కొన్ని కుటుంబాల్లో మాత్రమే కనిపిస్తుందా?

నత్తి, విధిగా తల్లి దండ్రులనుంచి పిల్లలకు సంక్రమించే వ్యాధికాదు. నత్తివున్న అనేకమంది తల్లిదండ్రులకు చక్కగా, నత్తి లేకుండా మాట్లాడే పిల్లలు పుట్టేరు. వారి జీవిత కాలంలో నత్తి యేర్పడలేదు. కాని పిల్లలు, కొంటె తనానికో, వెక్కిరించడానికో తల్లి దండ్రులను, మాటలు వచ్చే సమయాల్లో అనుకరించినందున, నత్తి వచ్చినట్లు తేలింది. ఇది అభ్యాస దోషమో, లేక సాంక్రామిక దోషమో సరిగా నిర్ణయించడం కష్టం. కాని కొన్ని కుటుంబాలలో నత్తి యేర్పడుతుందనే భావన చాలా మందికి వున్నది తల్లి దండ్రుల లక్షణముల పిల్లలకు రావడానికి కారణములు రెండు. (1) జీవ శాస్త్రీయ సూత్రముల ననుసరించి యేర్పడే సాంక్రామిక స్వభావము (2) సాంఘిక కారణములవల్ల యేర్పడే అభ్యాసములు. ఆచారములు, వెంట్రుకల రంగు, కంటి గుడ్లరంగు, చర్మం రంగు మొదట

(56-వ పేజీ చూడండి.)

శారద తన కోడలైతే బాగుండుననిపించింది కృష్ణారావుగారికి. అయితే, పిచ్చివచ్చి కుదిరిన మూర్తిని ఆమె చేసుకుంటుందా? ఇదే ఆ అమాయకుని అనుమానం.

# అందమైన కామెడీ

* * *

ఆనంద కృష్ణ



"శారదా......"

"ఊఁ......"

ఎంతో మాట్లాడదామనుకున్నాడు. ఆమెతో ఎన్నో విషయాలు చెబుదామనుకున్నాడు... ఆ సముద్రతీరంలో ఎంతోమంది జనం కూర్చుని వున్నా ఒకరి గొడవ మరొకరికి అక్కర్లేదు. ఎవరి గొడవ వాళ్ళది.....అది ఏకాంతం అనే చెప్పుకో వచ్చు. శారదని పలుకరించిన మూర్తి మళ్ళీ మాట్లాడలేదు.

"ఏం......మాట్లాడరేమిటి మూర్తీ.....?"

"అబ్బే ఏంలేదు......" నీరు కారిపోయాడు మూర్తి.

ఎక్కడో మైక్‌లోంచి

"సాయంకాలం—సముద్ర మొడ్డున పరదాగా

చిరుచల్లగాలిలో....

చేతు చేతుగా మీరెదురుగుంటే....

కాలు నడుపుతూ ఊలంజిల్లాడే కన్నెపిల్ల

తన కన్నుగీటితే మీరేం చేస్తారూ—మీరేం చేస్తారు" గట్టిగా వినిపిస్తోంది పాట.

ఫక్కున నవ్వింది శారద.

మూర్తికి అర్థం అయ్యింది ఆమె ఎందుకు నవ్విందో.

"ఏంలేదు—శారదా—మా నాన్నగారు ఉత్తరం వ్రాశారు. ఈ ఊళ్ళోనే ఏదో సంబంధం వుందిట. నన్ను వెళ్ళి అమ్మాయిని చూసి రమ్మని."

"పోనీ—వెళ్ళి చూసిరండి.....నచ్చితే ఆ అమ్మాయినే చేసుకుందురుగాని" ముప్పై రెండు పళ్ళూ కన్పించేలా కిలకిలా నవ్వింది శారద.

"అబద్ధం అనుకునేవ్.....నిజంగానే. ఇదుగో మా నాన్నగారు వ్రాసిన ఉత్తరం....." అంటూ ఉత్తరాన్ని శారదకి ఇచ్చాడు మూర్తి.

"అయితే మీ నాన్నగారికి మన విషయం తెలిదా..

"ఇప్పుడు చెబితే మొదటికే మోసం.....మా నాన్నగారికీ, మా అన్నయ్యకూ మధ్య ఓ అగాధం వుంది. మా నాన్నగారికి కావలసింది కనీసం ఓ పది వేలు. అది ఇస్తే చాలు, అసలు అడ్డుపెట్టరు మన వివాహానికి. మా అన్నయ్య న్యాయంగా తనకు

వచ్చిన జీతంతో కాలం గడిపే డాక్టరు ఆ పది వేలు ఇచ్చే పరిస్థితిలో లేకపోవచ్చు. మా నాన్నగారు మన పెళ్ళికి ఒప్పుకోకపోవచ్చు. ఒప్పుకోక పోవచ్చే మిటి? ఒప్పుకోరు కూడానూ....."

శారద కాస్సేపటివరకు ఏమీ మాట్లాడలేదు. కాస్సేపటికి "మా అన్నయ్యను గురించీ.....వదినగురించీ మీకు పూర్తిగా తెలును. మా అన్నయ్యకు నేనూ— నాకు మా అన్నయ్యా.....మీమీద ఓ ఉన్నతమయిన భావం ఉంది, అన్నయ్యకు— మీకు కావలసిందీ ఆ పదివేలే అయితే మేము మాత్రం ఏం చెయ్యగలం?"

"ఛా! డబ్బుకోసం నిన్ను కాదంటాననుకున్నావా శారదా? పెద్దలతో దెబ్బలాడి విడిపోవడం నాకు



ఇష్టంలేదు. మా నాన్న నేను మెల్లిగా చెబుతే 'వెధవాయి' నేను వేలకు వేలుపోసి నీకు చదువు చెప్పిస్తే ఇదా నువ్వు చేసే నిర్వాహకం' అని ఎగిరి పడతాడు. అందుకని ఏం చేద్దామా అని ఆలోచిస్తున్నాను. ముందర శాంతి మార్గం అనుసరిస్తాను. ఓడిపోతే అప్పుడు చూడొచ్చు. అయినా ఒకటి మట్టుకు నిజం శారదా.....నేను నిన్ను తప్పితే మరొకర్ని చేసుకోను......మరొక్క విషయం శారదా......నువ్వు మీ అన్నయ్యా నాతో సహకరిస్తారా.....?"

"ఇంతకాలం నాతోటే మా అన్నయ్యతోటే పరిచయంవున్నా ఇదన్నమాట మీకు మా గురించి తెలుసుకున్నది.? మీకోసం.......మనకోసం........ ఏ సహాయం చేయడానికైనా నేనూ, అన్నయ్యా సిద్ధమే...... ఇంతకూ మీకు మేం చెయ్యవలసిన సహాయం......?"

"ప్రస్తుతానికి ఏమీ లేదు.....కావలసినప్పుడు చెబుతాను... ."

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడచిపోయాయి. శారద నిశ్శబ్దంగాలేచి నిల్చుంది. మూర్తి తన రూమ్‌కి దారి తీశాడు శారదను ఇంటిదాకా సాగనంపి.

* * *

రూమ్‌కి చేరేటప్పటికి రూమ్‌మేటు శాస్త్రి రూమ్‌లోనే ఉన్నాడు.....

"ఎక్కడనుంచీ.....బీచి నించేనా..... ?

"ఊఁ......" అంటూ కోటు తీసేసి కూర్చున్నాడు మూర్తి.

"శాస్త్రీ.....ఓ చిన్న సహాయం చెయ్యాలిరా..

"ఏమిటి......?"

ముందర ఈ ఉత్తరం చదువు. తర్వాత నువ్వేం చెయ్యవలసిందీ నేను చెబుతాను" అంటూ తండ్రి వ్రాసిన ఉత్తరం శాస్త్రికి ఇచ్చాడు మూర్తి.

ఉత్తరం చదివిన శాస్త్రి

"నిన్ను వెళ్ళి అమ్మాయిని చూసి అభిప్రాయం వ్రాయమని వ్రాస్తే.....నా సహాయం ఎందుకూ... నిక్షేపంలా వెళ్ళి అమ్మాయిని చూసిరా.....తర్వాత నచ్చిందనో నచ్చలేదనో వ్రాసెయ్యి......"

"అదికాదురా....నన్ను ఒక్కడినీ వెళ్ళొద్దని వ్రాశారు మా నాన్నగారు.....పూర్తిగా వెళ్ళటం మానేద్దాం అంటే మా నాన్నగారు వాళ్ళకి కూడా ఉత్తరం వ్రాశారుట—నేను రేపు సాయంత్రంవచ్చి అమ్మాయిని చూస్తానని......"

"ఏడిసినట్టుంది.....నువ్వు పెళ్ళిచూపులకు వెడుతుంటే కూడా నేనెందుకూ......?

"నాకు ఒక్కడినీ వెళ్ళడానికి సిగ్గుగా వుంటుందిరా. మరో విషయం, ఏదో మా నాన్నగారు వెళ్ళి ఆ అమ్మాయిని చూసి రమ్మన్నారని వెళ్ళటంకాని.. ఆ అమ్మాయి మనకి ఎలాగా నచ్చదు....."

"ఏం! ఆ అమ్మాయిని నువ్వు ఎప్పుడైనా ఎక్కడైనా చూశావా?"

"లేదు"'

అయితే ఏమ్మైనా జోస్యం చెప్పగలవా! ఆ అమ్మాయి బావుండదని...."

"నీకు లూనటిక్ ఎస్సైలమ్"లో డాక్టరు..... శేఖర్.....చెల్లెల్ని పరిచయం చేశాను...జ్ఞాపకం వుందా?"

"ఎవరూ? శారదకదూ?"

"ఊఁ.....ఆ అమ్మాయి—నేమా ప్రేమించుకున్నాంరా. ఆ అమ్మాయిని తప్పితే మరొకర్ని ఎవర్నీ చేసుకోను......"

'ఎంతవాడివయ్యావురా—మాట వరసకైనా నాతో చెప్పావుకాదే' అనేశాడు శాస్త్రి.

'అయితే ఇకనేం మీ నాన్నగారితో చెప్పెయ్య... ఈగొడవలన్నీ ఎందుకూ'అనిసలహా యిచ్చాడుశాస్త్రి.

# అందమైన కామెడీ

తండ్రితో చెబితే మొదటికే మోసం వస్తుందనీ, అందుకోసం ఉపాయం ఆలోచిస్తున్నాననీ చెప్పాడు మూర్తి.

"శాస్త్రీ.....నువ్వు సహాయంచేస్తే ఏదో నీ పేరు చెప్పుకుని నేనూ—శారదా పెళ్ళి చేసుకుంటాము.

"అంతకంటేనా.....నీకే సహాయం కావాలన్నా చేస్తాను.

*　　*　　*

మూర్తి ఆట్టే అంత అట్టహాసం చెయ్యకుండా మామూలుగా బట్టలు వేసికొని శాస్త్రితో సహా ఆ అమ్మాయిని చూడటానికి బయులుదేరాడు.

అమ్మాయి తండ్రి బయటకివచ్చి వాళ్ళని లోపలకు తీసుకు వెళ్ళాడు. చాలా చక్కగా ఓ చిన్న పార్టీలా ఏర్పాటుచేసి....ఆ పార్టీలోనే పరిచయం చేశారు ఆ అమ్మాయిని మూర్తికి. ఆ అమ్మాయి కాస్సేపు కూర్చుని లోపలికి వెళ్ళిపోయింది.

మూర్తి టిఫెన్ ప్లేట్లు ఖాళీచేసి ఓమాటు అందరివైపూ తేరపారచూసి చేతిలోవున్న కాఫీగ్లాసు 'ఖంగ్' మనేలా గోడకు విసరికొట్టాడు వెంటనే ఓ వెర్రి నవ్వు నవ్వి మొహానికి చేతులు అడ్డం పెట్టేసుకున్నాడు.

ఆ ద రి వ డ్డా రు ఇంట్లోవాళ్ళందరూనూ. శాస్త్రికి ఏమీ అర్థంకాక నిల్చుని మూర్తి దగ్గరకి వెళ్ళి మూర్తిని తట్టుతూ "మూర్తీ—మూర్తీ" అంటూ పలకరించాడు.

"ఏమిటండీ.....ఏమిటయ్యింది?'...కంగారుగా శాస్త్రిని ప్రశ్నించాడు, పెళ్ళికూతురి తండ్రి రమణారావుగారు.

"ఏమోనండీ....నాకూ ఏమీ అర్థం కావడం లేదు. రెండు సంవత్సరాలనుంచి నాకు రూమ్ మేట్. ఇంతవరకూ ఎప్పుడూ ఇటువంటిది జరుగలేదు" శాస్త్రి నసిగాడు.

మూర్తి అలాగే చేతులు మొహానికి అడ్డం పెట్టుకుని మాట్లాడకుండా కూర్చున్నాడు. కొంచెంసేపు కూర్చుని శాస్త్రి "వస్తామండీ" అంటూ లేచాడు. మూర్తి ఏమీ మాట్లాడకుండానే రిక్షాలో ఎక్కికూర్చున్నాడు.

శాస్త్రికి, రిక్షా బయులుదేరుతుంటే "అంతా దైవికం. ఇంతకీ అమ్మాయి అదృష్టవంతురాలు..." అన్న రమణరావుగారి మాటలు స్పష్టంగా విన్పించాయి.

ఆరోజు ఆదివారం. మూర్తి లోపల రూమ్‌లో నిద్ర పోతున్నాడు. శాస్త్రి ముందరరూమ్‌లో కూర్చుని ఏదో చదువుకుంటున్నాడు...

ఇంతలో తలుపు తెరుచుకొని మూర్తి తండ్రి కృష్ణారావుగారు లోపలికి వచ్చారు.

"మీరా...ఉత్తరమైనా వ్రాయకుండా వచ్చారే—ఉత్తరం వ్రాస్తే స్టేషన్‌కి వచ్చేవాణ్ణి కదండీ..."

"పరవాలేదోయ్. నీ ఉత్తరం...రమణారావుగారి ఉత్తరం అందిన తర్వాత నా మనస్సు మనస్సులో లేదనుకో. నువ్వేమో మూర్తికి కొంచెం వంట్లో బాగుండలేదని వ్రాస్తావు.....రమణరావుగారు మీ అబ్బాయికి మతి చలించిందని వ్రాస్తాడు. ఇంతకీ మూర్తి ఏడి?"

మూర్తి లోపల గదిలో నిద్రపోతున్నాడనీ, అతనికి నిద్ర విశ్రాంతి చాలా అవసరం అని డాక్టరుగారు చెప్పారనీ చెప్పాడు శాస్త్రి.

"అదేమిటోయ్. నిక్షేపంలాంటి మూర్తికి పిచ్చి అంటాడేమిటి రమణారావుగారు?.....అహా! నువ్వే చెప్పు రెండు సంవత్సరాలనుంచీ నువ్వూ మావాడు ఒకటే ఇంట్లో వుంటున్నారుకదా....?"

"అబ్బే అది పిచ్చికాదనుకోండి. ఓవారం రోజుల నుంచీ మూర్తి అదోవిధంగా వుంటున్నాడు. సరిగా మాట్లాడడు... .ఇప్పుడు కొంచెం నయమేననుకోండి. డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళి చూపించాను. ఏదో మందిచ్చి మళ్ళీ ఓవారం రోజుల తర్వాత తీసుకు రమ్మన్నాడు. ఏమీ కంగారు పడక్కర్లేదన్నాడు. అయినా ఎందుకైనా మంచిదని మీకు వ్రాసాను...

ఇంతలో మూర్తి లేచి బయట గదిలోకి వచ్చాడు తండ్రివైపు ఓ వెర్రిచూపు చూశాడు.

"ఏరా నాయనా.....ఏమిటి అలా చూస్తావ్?

'ఉం!' అనేసి లోపలికి వెళ్ళిపోయాడు మూర్తి.

"ఇప్పుడు ఆట్టే మాట్లాడించకండి. సాయంత్రం డాక్టరు దగ్గరకు వెడదాం" అన్నాడు శాస్త్రి.

*　　*　　*

"ఈయన మూర్తి తండ్రిగారు కృష్ణారావుగారు ....ఈయన డాక్టర్ శేఖర్. 'లూనటిక్ ఎస్సైలమ్'లో పని చేస్తున్నారు" ఒకరిని ఒకరికి పరిచయం చేశాడు శాస్త్రి. మూర్తి ఏమీ మాట్లాడకుండా కుర్చీలో కూర్చున్నాడు. "కూర్చోండి" అనేసి డాక్టర్ శేఖర్‌కూడా ఓ కుర్చీలో కూర్చున్నాడు.

"డాక్టరుగారూ . .మావాడి విషయం "

"మీరు నాతో ఓమాటు పక్క గదిలోకి రండని కృష్ణారావుగారిని తీసుకు వెళ్ళిపోయాడు డాక్టర్ శేఖర్

"ఇప్పుడు చెప్పండి మీరు చెప్పదలచుకున్నది..."

"మావాడి విషయం ఏమిటండీ డాక్టరుగారూ? పెద్ద పిచ్చి కళలు కూడా కన్పించవు. ఏమి మాటాడినా విన్పించనట్టుగా వుంటాడు. ఎప్పుడైనా మాట్లాడుతాడుట. మాట్లాడినప్పుడు సరిగానే మాట్లాడుతాడట......"

"మీరు మరేం బెంగపెట్టుకోవలసిన అవసరం లేదండి.......ఓవారం రోజులపాటు మందులూ, ఇంజెక్షన్లూ ఇవ్వాలి. రెండు మూడు రోజులలోనే మార్పు కనిపిస్తుందిలెండి. ఈవారం రోజులపాటు అతనికి పూర్తిగా విశ్రాంతి కావాలి. తెలిసిన వాళ్ళెవ్వరూ ఎక్కువగా కలవడం మంచిదికాదు.....అతనిని ఆస్పత్రిలో జేర్పించడం అనవసరం. ఆస్పత్రి వాతావరణం అతనికి అసలు మంచిదికాదు....ఈవారం రోజులపాటు నేను అతని ప్రతి కదలికా కూడా పరీక్షించాలి. అందుకని వీలయినంత దగ్గరలో వుంటే మంచిది.....మీకు అభ్యంతరం లేకపోతే మా యింట్లో ఓ గదిలో వుంచండి. మీరు మాత్రం అతనిని మళ్ళీ నేను చెప్పేవరకు కలుసుకోవద్దు.

(38-వ పేజీ చూడండి)

సుందరపులలిత

# గు లా బీ

'గులాబీలతోట బుల్‌బుల్‌పాట, పూలరంభలా ఆట, సంబరాలవేట' అన్నాడో సినీ రచయిత. నిజానికి బుల్‌బుల్‌పాట ఎంత శ్రావ్యంగా వుంటుందో గులాబీ అంత దివ్యంగా మనస్సును దోచుకుంటుంది. ప్రకృతిలో ఎన్ని పూలు లేవు? అయినా గులాబీముందు అవన్నీ గులాములే. అందుకే గులాబీని పూలరాణి అన్నారు.

జీవిత సారాంశాన్ని గులాబీ తన గుప్పిటలో దాచుకుంది. చూడ ముచ్చటైన గులాబీకి కాడ నిండా ముళ్ళు! జీవితంలో ముళ్ళు ఎన్నో వుంటాయని, సుఖం అనేది వంటరిగా రాదని గులాబీ గోటుగా చాటుతుంది. జీవితం గులాబీ శయ్య కాదని ఇంగ్లీష్‌లో ఒక సామెత

అందానికి తోడు మృదుత్వానికి, సున్నితానికి గులాబీ పెట్టింది పేరు, గులాబీలో లాలిత్యం ఒలుకుతుంటుంది. గులాబీరేకులు గట్టిగా ముట్టుకుంటే రాలిపోతాయి. మోటుగా పట్టుకుంటే సుకుమారమైన గులాబీ వసివాడి తల వాలుస్తుంది.

గులాబీ ఎంత అందమైన రంగు! అందమైన గులాబీ పుష్పం పరిమళం లేనిదికాదు. దాని సువాసన మనసును హరిస్తుంది. అందుకే గులాబీలతో అత్తర్లు, తలనూనెలు తయారు చేస్తారు. మిఠాయిల్లో రోజావాటర్ వేస్తేనేగాని చక్కని రంగు రాదు.

ఐస్‌క్రీములు, ఐస్‌ఫ్రూటులు, పీచు మిఠాయి ఇవన్నీ గులాబీ రంగులోనే వుంటాయి. తినేముందు కంటి కింపుగా వుండాలికదా!

గులాబీ రంగులో ఏ వస్తువైనా ఎంతో చక్కగా శోభిస్తుంది. 'గులాబీలాగు' తిరగేసినా, మరగేసినా ఒకేలావుండే అయిదక్షరాల మాట. గులాబీకి ఇలాంటి గమ్మత్తులు కూడా వచ్చునన్నమాట!

సిగ్గుతో కపోలాలు కందితే, గులాబీని గుర్తు తెచ్చుకుంటాం. అవి గులాబీవర్ణం దాల్చాయని పోల్చుకుంటాం. అసలు చెక్కిళ్ళు గులాబీ రంగులో వుండటం అందం. ఆ కారణంవల్లే, పాశ్చాత్య సోదరీమణులు చెక్కిళ్ళకు గులాబీ రంగు అద్దుకుంటారు. ఇప్పుడు అందరికీ రోజా పౌడరు అందుబాటులోనే వుంది.

గులాబీల్లో ముద్ద రేకులవి కొన్ని, పల్చని రేకులవి కొన్ని, వుంటాయి ఈ పువ్వులు ఒక్క గులాబీ రంగులోనేకాక, తెల్లని ఎరుపు, ఆకుపచ్చ, పసుపు పచ్చ రంగులో కూడా వుంటాయి.

గులాబీలు పెంచుకోవటానికి పెరడు లేకపోయినా పర్వాలేదు. గోలాల్లో గులాబీ అంటు వేసుకుంటే ఎన్నో రోజులు తిరక్కుండానే మొగ్గ తొడుగుతుంది. మంచి ఎరువువేసి, తగు శ్రద్ధ తీసుకుంటే చెట్టునిండా లెక్కలేనన్ని పూలు పూస్తాయి.

సభల్లో ఉపన్యాసకుల మెళ్ళో గులాబీల దండ వేసి గౌరవించవచ్చు. పెళ్ళిళ్ళలో, దేవుడి పటాలకు గులాబీ దండలను వాడుక చేస్తూనే వుంటారు.

గులాబీ రేకులు తినటం కొందరికి అలవాటు. అవి రుచిగా వుండేమాట వాస్తవమే. మెత్తగా పట్టులా చూడ ముచ్చటగా వుంటాయి గులాబీ రేకులు. చల్లదనం కూడా వుంది వాటిలో

గులాబీ అందానికి ముగ్ధురాలైన పాశ్చాత్య మహిళ, 'రోజా' అని పేరు పెట్టుకుంది గులాబీలాంటి సుమకోమలులకు ఆ పేరు తగిందే

గులాబీ ఎంత చక్కనిదైన త్రుటిలో సెలరాలిపోతుంది. దాని జీవితం బహు స్వల్పకాలం మానవ జీవిత సత్యాన్ని గులాబీ మరణిస్తూ కూడా మనకు చెప్పిపోతుంది: మానవ జీవితం కూడా త్రుటి కాలమే కదా! ★

ఎప్పుడూ ఇంతే 90

శంకర్



## బంగారం - సింగారం - 'శాఖి' చిత్రకథ -



























# బంగారం - సింగారం - 'శాఖా' చిత్రకథ -




































## ఆంధ్ర సచిత్ర వారపత్రికను చదవండి!

బోయిన కనకదుర్గ

# అభిమానం

"అసలు ఆడవాళ్ళకు అభిమాన మెక్కువ" అనే నానుడి మనం ఎప్పుడూ వింటూనే వుంటాము. మానవజీవితంలో అడుగడుగునా ఎదురయ్యే ప్రతిబంధకాలను ఛేదించుకుని, జీవితంలో ముందుకు దూసుకుపోగలగాలంటే ప్రతి వ్యక్తికి కొంత మనస్థైర్యం, గుండెనిబ్బరం, దాంతోపాటే మన శక్తిసామర్థ్యాలమీద కొంత ఆత్మాభిమానం ఎంతైనా అవసరం. అందులోనూ, ఈ ఆత్మాభిమానమే, మనిషిని ప్రగతిదారులంట పయనింప చేసినా, లేక చీకటిదారులంట కూలద్రోసినా, సమర్థవంతమైనదంటే, అతిశయోక్తికాదేమో. ఎందుకంటే అనుక్షణం ఆందోళనలతో సతమతమవుతూ, జీవితంలోని ఎదురు దెబ్బలకు వంగిపోక, ధైర్యంగా నిలదొక్కుకోగలగాలంటే అందుకు ఆత్మాభిమానం, ఆదర్శవంతమైన ఉత్తమమార్గం. కాని మన సంస్కృతంలో "అతి సర్వత్ర వర్జయేత్" అనే శ్లోకాలలోవుంది. మనంచేసే ప్రతి పనికి, కొన్ని నియమితమైన హద్దులున్నట్లే, మనలోని ఆత్మాభిమానం కూడా పరిమితమైన సూత్రాలకు ఆవృత్తం చెయ్యబడినప్పుడే, ఆదర్శవంతము, అభినందనీయము అవుతుంది. లేక అభిమానం, అన్న పదానికి, అన్యాపదేశాలు కల్పించి, విజ్ఞత లేకుండ ప్రవర్తిస్తే అది మనకే చేటుగా మారుతుంది.

మా'పిన్ని'గా ఒకావిడ ఉంది. ఆమె కాస్త సంపన్న కుటుంబంలో పుట్టిన మనిషి. వాళ్ళ నాన్నగారు మంచి కీర్తిప్రతిష్టలు గలవారు. ఈమెగారు ఎప్పుడూ, సమయము చిక్కినప్పుడల్లా, మా బాబాయిగారిని డబాయిస్తూనే వుంటుంది. "మా నాన్నగారెటువంటివారో తెలుసా? మా వంశము వన్నెగల వంశము. అభిమానం మా సాంప్రదాయం. మీరు నన్ను ఏదో ఒకటి సాధిస్తూ వున్నారంటే ఇక్కడ పడేందుకు ఎవరూలేరు. మా పుట్టింటికి వెళ్ళిపోతా. మళ్ళా మీ మొఖం చూడను" (ఎందుకంటే ఒకసారి పోట్లాడి వెళ్ళిం తర్వాత మళ్ళా తిరిగి రావడం, ఆవిడ అభిమానానికి భంగకరం) అని. పాపం. మంచితనానికి మారుపేరులాంటి మా బాబాయి ఆవిడతో అలానే సర్దుకుపోతుంటారు. ఆరుగురి బిడ్డల తల్లయినా, ఇప్పటికి, ఆవిడ అలానే అంటుంటుంది. కాని అలా వెళ్ళిపోతే ఎవరకు నష్టమో ఆవిడకు ఇంతవరకు అర్థం కాలా. పైపెచ్చు వాళ్ళ పిల్లలు, పలకా పుస్తకం చేత పుచ్చుకున్నప్పటినుంచి వాళ్ళకు, "ఒరేయ్! మీతాతగారు రాచఠీవిగలవారురా. అభిమాన సంపద, మా తరతరాలనుంచి సంక్రమిస్తున్నది. మిమ్మల్ని ఎవరైనా, ఏమైనా అంటే పడివూరుకోవద్దు. వాళ్ళను తిరిగి ఎదిరించి చిత్తుగా ఓడించటం అభిమానవంతుల లక్షణం" అని తెగ నూరి పోస్తుంటుంది. ఇంక ఆవిడగారి పిల్లలు, ఈ బోధనలతో పూర్తిగా కైపెక్కి ప్రతివారితోనూ గిల్లికజ్జాలు పెట్టుకోవటం, వాళ్ళు వచ్చి వీళ్ళ యింటిమీద విరుచుకుపడటంతో, వాళ్ళను ఎలాగోలా సర్దిపంపేటప్పటికి, మా బాబాయి తలప్రాణం తోకకు వచ్చి "అమ్మయ్య" అని అనుకోవడం వాళ్ళింట్లో సహజమయిపోయింది. చివరకు ఆమెగారికి చుట్టుపక్కల అమ్మలక్కలంతా కలిసి, ఓ శుభ మహూర్తాన "అభిమానమ్మ" అని నూతన నామకరణం చెయ్యటం జరిగింది. మా బంధువుల్లో చాలా మందికి ఆవిడ పేరు చెప్తే తెలియదుకాని "అభిమానం పిన్ని" అంటే ఇట్టే తెలిసిపోతుంది

మా పక్కింటి వాళ్ళమ్మాయి బి. ఎ. పరీక్షలు వ్రాసింది. వాళ్ళింట్లో వాళ్ళకు ఈ వేసవి సెలవల్లో ఎలా కాలక్షేపం చెయ్యటమా అన్న ప్రశ్నేలేదు. ఎందుకనంటే. ఈ అమ్మాయితోపాటు వాళ్ళ తమ్ముడు కూడా బి. ఎ. పరీక్షలు వ్రాశాడు. ఆ అమ్మాయి, తను మహా అభిమానధనురాలనని, తనకు తానే స్వోత్కర్ష పడుతుంది. అంతే కాకుండా



ఆ మాట పైకి గర్వంగా చెప్పుకుంటుంది. యింటో వాళ్లెవరైనాసరే, చివరకు వాళ్ళనాన్నా, అమ్మగారు కూడా ఆ అమ్మాయిని పల్లెత్తు మాట అనటానికి వీల్లేదు. ఒకవేళ నోటిమాటకు "ఎందుకే అలా చేశావ్?" అంటే చాలు ఆరు రోజులకు తక్కువ కాకుండా అలక పాన్పు నలంకరిస్తుంది. ఆ అమ్మాయి అంత అభిమానధనురాలుగదా, ఇంకొకరిని ఏమన్నా అంటే, వాళ్ళకు మాత్రం ఆ అభిమానమేదో వుంటుందని అనుకోఅక్కర్లా. వాళ్ళ బి. ఎ. తమ్ముడ్ని పట్టుకుని, పెద్ద నోరుతో చుట్టుపక్కల అర డజను యిళ్ళకు వినిపించేటట్టు "కుక్కా! గాడిదా!" అని నోటికి వచ్చిన తిట్లల్లా ప్రతి చిన్న విషయానికి తిడ్తుంటుంది. అతను ఈ అమ్మాయి విషయం తెలిసిన వాడవటంవల్ల చాలావరకు పాపం సహించి వూరుకున్నా, చివరకు ఆ అమ్మాయి తెగేంతవరకు తాడులాగుతుంటే భరించలేక ఆ అమ్మాయితో గొడవ పెట్టుకుంటాడు. వాళ్ళిద్దరూ కనీసం ఏ రెండు రోజుల కొకసారయినా కొట్లాడుకోవటం, ఆ రోజున యింట్లో రెండు మూడు కుర్చీలు, నాలుగైదు పీటలు విరిగిపోవటం జరుగుతుంటుంది. వాళ్ళ చిన్న చెల్లి, అచ్చం వాళ్ళ పోట్లాట, సినిమాలో హీరో విలన్ల మధ్య ఎలా వుంటుందో అలా బ్రహ్మాండంగా పెద్ద పెద్ద చప్పుళ్ళతో భయంకరంగా వుంటుందని వర్ణిస్తుంటే నవ్వొస్తుంది. ఆ అమ్మాయికి పెళ్ళి చేసి, అత్తవారింటికి పంపితే ఎలా జరుగుతుందా అని వాళ్ల అమ్మగారికి పెద్ద దిగులు.

కేవలం ఆ అభిమానమనేది, మనస్సుల్లోనే వుండిపోతే బాగుండును. లేనిపోని గొప్పలకుపోయి, అదేదో విశిష్ట లక్షణమన్న భ్రమలో పండంటి కాపురాలను, చేజేతులా సర్వనాశనం చేసుకున్న గృహిణులు కూడా ఎందరో వున్నారు. మాకు తెలిసిన ఒకామె, భర్త ఏదో విషయంలో మాటా మాటా వచ్చి చెయ్యి చేసుకున్నాడని, ఆ కాపరాన్ని గాలిలో వదిలిపెట్టి పుట్టింటికి వచ్చేసింది. ఆమె వచ్చి ఇరవై ఏళ్ళయినా, ఇంతవరకు "ఆయన కంత ధీమా అయితే నేనేనా బ్రతకలేంది. నాకు మాత్రం అభిమానం లేదా? ఆయన ఇష్టాయిష్టాలకు దాసురాలిగా బ్రతకడంకంటే, ఏనాలుగు ట్యూషన్లు చెప్పుకున్నా గడచిపోతుంది" అన్న పట్టుదల పోలేదు. కాపురమున్న తర్వాత, ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక విషయంలో అభిప్రాయభేదాలంటూ రాక తప్పదు. అంతమాత్రంచేత ఏదో సర్దుకుపోవాలిగాని, దాన్ని పెంచి పెద్ద గొడవచేసుకుని చిలికి చిలికి గాలివానలా సంసారాలను కూలదోసుకోవటంకంటే, అవివేకం ఇంకొకటి వుండబోదు. ఓర్పుకు, సహనానికి ప్రాతినిధ్యం వహించవలసిన స్త్రీ జాతి, తమకు తామే, తమ కంట్లో వేలుపెట్టి పొడుచుకున్నట్లు, అభిమానమనే ముసుగుతో, విషయాలను, విషయవలయంలోనికి లాగటం, సమంజసంకాదు

చాలామంది స్త్రీలు ప్రస్తుతం, తమలోవున్న స్వాతిశయపు చిహ్నాలనే, అభిమాన లక్షణాలనుకుని, అపార్థం చేసుకోవటం జరుగుతున్నది. జీవితంలో అసలు పట్టుదల, దీక్ష, ఆత్మాభిమానం ఇవి అక్కర లేదని ఎవ్వరూ అనరు. కాని, ఆ అభిమానమన్నది కేవలం దురభిమానం, మాత్రం కాకూడదు. "మన మేదో గొప్ప అంశగల వాళ్ళం, పొరపాటున ఈ జన్మలో ఇటువంటి తక్కువ స్థితిలో వున్నాం" అనుకునే ఘనస్తత్వంగల వ్యక్తులు "మేము ఆత్మాభిమానం కలవారం" అన్న ఆలంబనానికి మరుగున, తమ స్వాతిశయాన్ని, దురహంకారాన్ని కప్పిపుచ్చుకోవాలని ఎంత ప్రయత్నించినా, అది కనపడిపోతూనే వుంటుంది. తెలుగులో ఒక సామెత వున్నది. "అరటాకు వెళ్ళి ముల్లుమీద పడినా, ముల్లు వెళ్ళి అరటాకుమీదపడినా, కలిగే నష్టం అరటాకుకే"నని. స్త్రీ జీవితం కూడా అలాంటిదే. గృహిణిగా, తల్లిగా సంఘంలో కుటుంబ బాధ్యత అధికంగా గల వ్యక్తిగా పవిత్ర ప్రేమమూర్తిగా, స్త్రీ, ఆప్యాయత, ఆత్మీయత, అనురాగాన్నే ప్రదర్శించి, ఆదరపాత్రురాలు కాగలగాలికాని, అభిమానమనే స్వాతిశయంతో నిర్లక్ష్యంగా ప్రవర్తించి భవిష్యత్తును నాశనం చేసుకోరాదు. 



బ్రహ్మానందశర్మగారు గుంటూరుకు బదలీ అయివచ్చి రెండు నెలలన్నా కాకమునుపే అందరి ఆదరాభిమానాలు చూరగొన్నారంటే ఆశ్చర్యమేముంది. వారు సామాన్యులా మరి !

బ్రహ్మానందశర్మగారు ఆరోజునే హెడ్‌క్లార్కుగా ప్రమోషనుమీద గుంటూరు పి. డబ్ల్యు. డి. ఆఫీసులోవచ్చి చేరారు. గడియారం అప్పుడే పది గంటలు కొట్టుతున్నది. అప్పటికే పాతకాలపు గుమాస్తాలు నలుగురైదుగురు వచ్చి పరామర్శ చేశారు. కుర్రకారు గుమాస్తాలు ఒక్కరొక్కరు రావటం ప్రారంభించారు. వస్తూ వస్తూ హెడ్‌క్లార్కు కుర్చీలో కూర్చున్న శర్మగారిని ఆపాదమస్తకం చూచి "ఓహో! ఈయనే కాబోలు యికమీదట మన ప్రాణాలు తీయబోయే యముడు" అని మనస్సులో అనుకుంటూ తమ తమ కుర్చీలలో కెళ్ళి కూర్చుంటున్నారు.

గడియారం పదిన్నర గంట కొట్టింది. అప్పటివరకూ మిగిలినవారితో తనకేమీ సంబంధము లేనట్లు కూర్చునివున్న బ్రహ్మానందంగారు అందరూ రావటం పూర్తి అయిందా అన్నట్లు ఆఫీసు హాలంతా కలియచూసి దగ్గరగాఉన్న ఒక పాతికేళ్ళ గుమాస్తానుచూచి

"అబ్బాయ్! నీ పేరేమిటి నాయనా!" అని అడిగారు.

"నాపేరు గోపాలరావండీ" అని పైకి నమ్రతగా చెప్పినా మనస్సులో మాత్రం "ఈయన వచ్చి రావటంతోటే "నువ్వు" అని ఏకవచన ప్రయోగం మొదలుపెట్టాడు. సాయంకాలమయ్యేలోపల "ఏరా" అని పిలవడు గదా" అని అనుకోసాగాడు.

"మన ఆఫీసు ప్యూనుపేరు "సుబ్బయ్య" అని చెప్పినట్లు జ్ఞాపకం. ఎక్కడా కనుపించడేం!"

"అవును. సుబ్బయ్యేనండి! ఏదైనా పనున్నదా! పిలవమంటారా!"

"ఆ! ఏమీ అనుకోకపోతే ఒకసారి పిలుస్తావ్ బాబూ, ఏంలేదూ! ఈ పూటనే యిక్కడికి క్రొత్తగా వచ్చాను గాబట్టి ఇంజనీరుగారు వచ్చేలోపల అందరం కాఫీలుత్రాగి ఒకర్నొకరం పరిచయంచేసికొందాం" అని చిరునవ్వు నవ్వుతూ సుబ్బయ్యను పిలువబోతున్న గోపాలరావును ఉద్దేశించి అన్నాడు.




ఫైల్సులో మునిగివున్న గుమాస్తాల తలలన్నీ ఒక్కసారే శర్మగారివైపు క్షణ మాత్రం తిరిగినయ్. గోపాలరావు సుబ్బయ్యను పిలిచివచ్చి తన కుర్చీలో కూర్చున్నాడు. ప్యూన్ సుబ్బయ్య రావడంచూసి బ్రహ్మనందంగారు అడిగారు.

"చూడు సుబ్బయ్యా! నువ్వువెళ్ళి దగ్గర్లో వున్న హోటళ్ళలో ఎక్కడ కాఫీ బాగుంటుందో అక్కడ—ఆ! మన ఆఫీసులో ఎంతమంది వున్నారు"

"పన్నాలుగు మంది గుమాస్తా లున్నారండి"

"ప్యూన్స్‌తో సహా ఎంతమంది"

"పద్దెనిమిదిమందండి"

"అయితే ఫస్టుక్లాసయిన కాఫీలు పద్దెనిమిది తీసికొని రమ్మనమని చెప్పు. ఇదిగో యీ పది రూపాయలనోటు తీసికెళ్ళు.

ఎన్నడూ అడిగినా అణా అయినా పుట్టనివ్వని వాళ్ళ గుమాస్తాల సమూహంలో యిరవై సంవత్సరములు గడిపిన సుబ్బయ్యకు బ్రహ్మనందంగారు వింతగా కన్పించారు. ఇది నిజమా! వేళాకోళమా అన్న సందేహంతో పదిరూపాయల నోటు తీసుకునేందుకు సుబ్బయ్య చెయ్యి అయినా జాపలేదు.

(౪౮ వ పేజీ చూడండి)




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

12-7-1961 బుధవారము మొదలు
18-7-1961 మంగళవారము వరకు

## మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

సంఘంలో మీ విలువ బాగా పెరుగుతుంది. ముఖ్యమైన మనుష్యులు మీతో కలసి మెలసి పని చేయుటంవల్ల మీకు శ్రమ తగ్గుతుంది. శుభ కార్య సంబంధమైన ఆలోచనలు సులభంగా నెరవేరుతవి. ధన విషయంలోను, కుటుంబంలోను సంతృప్తి, సుఖము పొందగలుగుతారు. వృత్తికి సంబంధించిన పనులలో అధికారుల ఆదరాభిమానాలు లభిస్తవి. అనుకున్న ప్రయాణాలు వాయిదా పడవచ్చు. కాని, అందువల్ల ముందు మేలు పొందగలుగుతారు. మీకు సంబంధించిన ఒకానొకరితో అభిప్రాయ భేదాలువచ్చి చికాకు కలుగుతుంది. ముందుగా వాగ్దానాలు ఇచ్చి పిమ్మట బాధపడవలసి వస్తుంది. వారాంతంలో అపవాదులువచ్చే అవకాశాలున్నవి. 13, 14 తేదులలో మిత్రలాభం, వినోద కార్యాలలో పాల్గొంటారు. కార్యసిద్ధి.

*  *  *

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)

మీతో మంచిగా మాట్లాడుతూ ఏ విధంగా మోసం చేయవచ్చునని ఎదురు చూచేవారు ఉంటారు. క్రొత్త మనుష్యులతో పరిచయం లభిస్తుంది. ఎంత ఆదాయం వచ్చినా ముందుగా ఖర్చులు ఎదురు చూస్తూ ఉంటవి. కుటుంబంలోని వారితో సాధారణంగా స్పర్థలువచ్చి వెంటనే సమసిపోగలవు. ఆస్తివృద్ధి మొదలయిన ప్రయత్నాలలో కొంచెం ఆలస్యం తప్పదు. ఈవారం దేహ సౌఖ్యము, మనశ్శాంతి లభిస్తవి. దక్షిణదిక్కు నుంచి వచ్చే వార్తలు అసంతృప్తికరంగా తోచగలవు. ప్రతి విషయంలోను అరమరికలు లేకుండా ధైర్యంతో ప్రవేశించగలుగుతారు. కుటుంబంలో శుభ సంబంధమైన ఖర్చులు పెరుగుతవి. బాధ్యతలను ఇతరుల మీద విడిచి అశ్రద్ధగా ఉండవద్దు. 17, 18 తేదులలో శుభ సూచనలు, విలువగల వస్తువులు కొంటారు. అక్కరలేని పనులలో జోక్యం.

*  *  *

## మిథునం :

(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ప్రతి సాధారణ విషయంలోను ఏదో ఒక విధంగా మాట పెరుగుతూ ఉండటంవల్ల ఆందోళన, విసుగుదల ఉంటవి. ప్రత్యక్షంగా చిక్కులు ఏమీ ఉండవు. శక్తికొలది సాటివారికి సహాయం చేయగలుగుతారు. బంధుమిత్రులవద్దనుంచి సంతోషవార్తలు తెలుస్తవి. మొత్తంమీద గత వారంకన్నా ఆదాయం బాగుంటుంది. వృత్తికి సంబంధించిన కార్యకలాపాలలో శ్రమ అధికంగా ఉంటుంది. కాని, నిబ్బరంతో జరుపుకొనగలుగుతారు. పెద్ద మొత్తాలుగా డబ్బు అవసరం అవుతుంది. వ్యవహార రంగంలో చిక్కులు తొలగి అనుకూల సూచనలు కనుపిస్తవి. అధికారులతో సంప్రదించటానికి అనుకూలమైన సమయం. 13, 14 తేదులలో ప్రయాణాలు, ఇతరులవల్ల మోసం, పిల్లలకు అనారోగ్యం.

*  *  *

### గ్రహస్థితి

వృషభంలో శుక్రుడు, మిథునంలో బుధుడు, మిథున, కటకాలలో సూర్యుడు, సింహంలో కుజ, రాహువులు, మకరంలో గురు శనులు, కుంభంలో కేతువు మిథున, కటక, సింహ, కన్యలలో చంద్రుడు.

## కర్కాటకం :

(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)

ఏ ఎండకు ఆ గొడుగుపట్టి పది మంది మీ మాటను అనుసరించేటట్లు చేసుకొనగలుగుతారు. వారం ఆరంభంలో సౌఖ్యం అంతగా ఉండదు. కాని, క్రమంగా శక్తి సామర్థ్యాలు పెరుగుతవి. మామూలు మాటలు వివాద రూపంలోకి దిగుతవి. లోగడ మీ మాటయందు అనాదరణ చూపిన వారే ఈ సమయంలో మీతో కలుస్తారు. ఇతరుల వద్దనుంచి రావలసిన డబ్బుకు తొందరపడతగిన సమయంకాదు. పండితులతో పరిచయం కలుగజేసుకొని ప్రసంగించే అవకాశం లభిస్తుంది. సులభంగా ఫలితం పొందతగిన సమయం. కుటుంబ విషయాలలో బాధ్యతలను తగ్గించుకొని నడచుకొనటంవల్ల చిక్కులు రాకుండా తప్పించుకోగలుగుతారు. ఎదురు చూస్తున్న వార్తలు నిదానంగా వస్తవి. 16, 17 తేదులలో నిరుపయోగమైన పనులు, విరుద్ధ ప్రసంగాలు.

*  *  *

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

మంచితనంతో ఏపనీ చేయలేకపోతారు. ఎప్పటికప్పుడు ఖర్చులు కనిపిస్తున్నా, పట్టుదలతో విజయం సాధించగలుగుతారు. సకాలంలో కొంత వరకు ధనసహాయం లభిస్తుంది. ఆప్తులతో మాట్లాడే సమయంలో మీరు ఏటు మాట్లాడటానికి అవకాశం లేని పరిస్థితిలో బాధ పడతారు. భూములు, వాహనాలు మొదలయిన వాటిమీద పెట్టుబడి పెట్టవలసిన అవసరం కలుగవచ్చు. బాహ్య విషయాలలో ఆడంబరము, పేరు ప్రతిష్ఠలు విశేషంగా పెరుగుతవి. ఒకానొక మిత్రుని నిమిత్తం శ్రమపడి పనిచేయవలసి వస్తుంది. విలువ స్వల్పమైనా ముఖ్యమైన వస్తువులు సమయంలో లభించకపోవటంవల్ల చిక్కు పడతారు శుభకార్యాలు కూడివస్తవి. 17, 18 తేదులలో పడమర, ఉత్తర దిక్కులనుంచి శుభవార్తలు, బంధువులవల్ల ఖర్చులు పెరుగుతవి.

*  *  *

## కన్య :

(ఉత్తర 2,3,4 పా., హస్త, చిత్త 1, 2 పా.)

ఈ సమయంలో ఇతరులవల్ల మీ మాటకు, అభివృద్ధి ప్రయత్నాలకు భంగం కనిపిస్తుంది. త్రిప్పట అధికంగా ఉంటుంది. దేహ సౌఖ్యం సాధారణం. చేసిన పనినే తిరిగి చేయవలసిరావటంవల్ల ఖర్చులు పెరుగుతవి. గౌరవం నిమిత్తం పెత్తనంపైన వేసుకొనటమేకాని చివరదాకా నిర్వహించటానికి కష్టపడవలసి వస్తుంది. డబ్బును గురించిన ఆందోళన క్రమంగా తగ్గుతుంది. స్వశక్తితో అపవాదులను తొలగించుకొనగలుగుతారు. అధికారుల వద్దనుంచి వచ్చే వార్తలు అనుకూల ధోరణిలో ఉంటవి. వారాంతంలో తప్పు తమమీదనేఉన్నా, మిమ్ములను బెదిరించటానికి చూచేవారు ఉంటారు. ధైర్యంతో ఉండండి. 12, 13 తేదులలో గౌరవం, స్వల్ప ధనలాభం, అనుకున్న పనులలో ఆటంకాలు.

*  *  *

**తుల :**

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

చాలాకాలంగా మిమ్ములను ఆందోళన పెడుతున్న సమస్యలు ఈవారంతో తొలగిపోయి పదిమంది యొక్క ఆదరాభిమానాలనూ పొందగలుగుతారు. పుష్కలంగా ధనం లభిస్తుంది. క్రమంగా మాట తీరులో హుందా తనం పెరుగుతుంది. ప్రయాణాలు ఫలిస్తవి. ఇతరుల కలహాలు మీదాకా వస్తూ ఉంటవి. వినీ విననట్లు ఊరుకొనవలసిన సమయం. కుటుంబంలో సౌఖ్యంగా ఉంటుంది. వృత్తిలో మిమ్ములను గౌరవించి సహాయం చేసేవారు లభిస్తారు. వస్త్రాలు మొదలయిన విలువగల వస్తువులు కొంటారు. వారాంతంలో విశ్వాసంలేని మనుష్యులతో పేచీలు వస్తవి. 15, 16 తేదులలో కార్యవిఘ్నం, స్వల్ప ఆదాయం.

* * *

**వృశ్చికం :**

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

వృత్తికి సంబంధించిన పనులలో నిరాటంకంగా ముందుకు పోగలుగుతారు. అనారోగ్య బాధలు తొలగుతవి. అనేక రకాలుగా సుఖ సంతోషాలతో కాలక్షేపం చేస్తూ ఉంటారు. ధన వ్యయం ఉంటుంది. కాని, అందుకు తగినట్లు వెంటనే ప్రయోజనం కనుపిస్తూ ఉంటుంది. వారం రెండవభాగంలో శుభ ప్రయోజనాలు కలసి వస్తవి. ఇతరుల నిమిత్తం మీరు చేసిన శ్రమ పూర్తిగా ఫలిస్తుంది. చట్టావ్యాపారంవంటి పనులలో శ్రమకొద్దీ ఫలితం పొందగలుగుతారు. ఇబ్బంది పడవలసి వస్తుందని అనుకుంటున్న వ్యవహారాలలో దైవికంగా జయంపొందగలుగుతారు. మీరు స్నేహితులకు చెప్పిన మాటను సమయంలో నిలబెట్టుకోగలుగుతారు. అయితే శ్రమకి 14, 15 తేదులలో బంధువులవల్ల అనుకూలత, వృత్తిలో సాధారణంగా పేచీలు, ధనలాభము.

* * *

**ధనుస్సు :**

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)**

మొదట్లో ఎవరు ఎన్ని రకాలుగా పేచీ పెట్టినా చివరకు మీ మార్గానికి రాక తప్పదు. మీరు తొందరపడతగిన సమయంకాదు. కొత్తపనులలో డబ్బు పెట్టుబడి పెట్టవలసిరావచ్చు. పిల్లల మూలంగా ఖర్చులు పెరుగుతవి. మీ వ్యాపార వ్యవహార కార్యక్రమాలు పట్టుదలతో సాగించగలుగుతారు. అనుకున్న ప్రకారం తోటివారి ఆదరణ, సహాయము లభించకపోవచ్చు. తూర్పు దిక్కునుంచి అనుకూల వార్తలు తెలుస్తవి. అధికారులవల్ల సహాయం లభిస్తుంది. ప్రయాణాలు సుఖంగా జరుగుతవి. కాని ప్రయోజనం అంతగా ఉండదు. 17, 18 తేదులలో స్త్రీమూలంతో కలహాలు, సంచారము.

* * *

**మకరం :**

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

రావలసిన డబ్బు ఒకసారిగా రాదు. కార్యభారం కొంతవరకు తగ్గుతుంది. ఇతరుల దృష్టిలో మీరు ఉన్నతస్థితిలో ఉన్నట్లు కనుపిస్తారు. ఇతరుల కష్టసుఖాలలో జోక్యం కలుగజేసుకొని సహాయం చేయవలసి వస్తుంది. ఆదాయం మందంగా కనుపించినా సంఘంలో విలువ పెరుగుతుంది. ఉత్తర దిశనుంచి ఉపయోగకరమైన వార్తలు వస్తవి. మీరు తెలుసుకున్న విషయాలు సాధ్యమైనంత రహస్యంగా ఉంచటం అవసరం. వ్యవహార రంగంలో మీ మాటను నెగ్గించుకోగలుగుతారు. ఇతరుల వత్తిడికి లొంగి కార్యభారం పెంచుకోవద్దు. జ్ఞాపకశక్తి తగ్గే అవకాశాలున్నవి. 16, 17 తేదులలో నిర్ణయంలేని ఆలోచనలు, బంధువులవల్ల సహాయము, వృత్తిలో గౌరవము.

* * *

**కుంభం :**

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

జాగ్రత్తగా పలుకుబడిని వినియోగించుకొనవలసిన సమయం. మాటలలో తొందరపడవద్దు. వార్తలు భయంకరంగా కనుపించినా క్రియలో సులభంగా నెగ్గుకు రాగలుగుతారు. పిల్లల ఆరోగ్యం సరిగా ఉండదు. బంధు మిత్రులకు మీరు సహాయం చేదామనుకున్నా అవతలివారే అందుకు వీలుకాకుండా చేసుకుంటారు. ఒకానొక సమయంలో డబ్బుకు వత్తిడి రావచ్చు. గౌరవంతో బాటు బాధ్యత కూడా పెరగటంవల్ల విశ్రాంతి తగ్గుతుంది. ఇంతకుముందు ఆందోళనకరంగా ఉన్న వ్యవహారాలలో పరిష్కారమార్గం తెలుసుకోగలుగుతారు. వారం రెండవ భాగంలో దేహసౌఖ్యం లోపిస్తుంది. ఆహారవిహారాలలో జాగ్రత్త అవసరం. 16, 17, 18 తేదులలో ప్రతిబంధకాలు, కష్టవార్తలు.

* * *

## ఈవారము ధరలు

బంగారుధర ఈ వారం మొత్తంమీద మందీలో ఉంటుంది. చలామణీ తక్కువ. వెండి ధర కొద్దిగా పెరిగి మరల తగ్గు సూచనలున్నవి. పసుపు ధర తేజీ అవుతుంది. నూలు ధర ఆరంభంలో మందీఉన్నా క్రమంగా పెరుగుతుంది. ప్రత్తిధరలో నిలకడ తక్కువ. నూవుల నూనె ధర ముందు పెరిగి తగ్గుదలవచ్చి నిలుస్తుంది. వేరుసెనగపప్పు ధర తేజీలో ఉంటుంది. నూనె ధరలో మార్పుఉండదు. కందులకు గిరాకీ వస్తుంది. మినుముల ధర తగ్గే సూచనలున్నవి. మిర్చికి గిరాకీ ఆరంభం అవుతుంది.

**మీనం :**

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

మీ అంచనా ప్రకారం ప్రతిపనీ అనుకూలిస్తుంది. మీతో బెట్టుసరిగా మాట్లాడి కార్యం సాధించుకొనటానికి ప్రయత్నించేవారు ఉంటారు. మీ శక్తి సామర్థ్యాలవల్ల బాధ్యతలనుంచి తప్పుకోగలుగుతారు. ఆదాయం గతవారంకన్నా మందంగా ఉంటుంది. మీరు ఎవరితో కలసి మాట్లాడవలయునని అనుకుంటారో వారే మిమ్ములను వెతుక్కుంటూ వస్తారు. ప్రయాణాలు చేయవలసి వస్తుంది. ధర్మ కార్యాలలో పాల్గొంటారు. యంత్రాలు, ఆయుధాలు మొదలయిన వాటికి సంబంధించిన పనులలో జాగ్రత్తగా ఉండవలసిన సమయం. వారాంతంలో మీ సలహా అవతలి వారికి వెగటుగా తోచే అవకాశాలున్నవి. 13, 14 తేదులలో ఇష్టవస్తుప్రాప్తి, అధిక వ్యయం. ★




చిత్రకారుడు : ఆర్. సత్యనారాయణ (కడప)



జూల్స్ వెర్న్ నవల

# 80 రోజులలో భూప్రదక్షిణం

ఎస్. పార్థసారథి

### జరిగిన కథ

80 రోజులలో భూప్రదక్షిణం సాధ్యమని 20 వేల పౌన్లు పందెంవేసి, సేవకుడు పాస్పార్టుతో బయలుదేరుతాడు ఫిలియాస్ ఫాగ్. బాంకు దొంగ దొరికాడని, బొంబాయికి అరెస్టు వారంటు పంపమని లండన్‌కు టెలిగ్రామ్ పంపి, ఫాగ్‌వెంట బొంబాయి వస్తాడు డిటెక్టివ్ ఫిక్స్. కాని వారంటు చేరదు. ఫాగ్ బొంబాయినుంచి కలకత్తా వెడుతూ దారిలో అయుదాను రక్షిస్తాడు. అక్కడ వారిని ఆపటానికి ఫిక్స్ ప్రయత్నం వ్యర్థమవుతుంది. ఫాగ్ ప్రభృతులు "రంగూన్" ఓడలో ఎక్కి హాంకాంగ్ వెడతారు. ఫిక్స్ కూడా ఆ ఓడలోనే ఉంటాడు.

హాంకాంగ్‌నుంచి యోకహామాకు వెళ్ళదలచిన ఫాగ్‌కు ఓడ తప్పిపోతుంది. ఒక పడవమీద షాంగ్‌హై చేరి అక్కడనుంచి యోకహామా వెడతారు. పాస్పార్టు అంతకుమునుపే అక్కడకు చేరుతాడు. ముగ్గురూ శాన్‌ఫ్రాన్సిస్కో వచ్చి, న్యూయార్కు వెడుతూ ఆగ్డెన్ దర్శిస్తారు. రెడ్ ఇండియన్లు రైలును ముట్టడిస్తారు. ఫాగ్ పాస్పార్టూను రక్షిస్తాడు.

రైలు తప్పిపోవటంవల్ల ఫాగ్ మడ్జ్ సహాయంతో 'స్లెడ్జి'లో ఒమహా వరకూ వెళ్ళి అక్కడ నుంచి న్యూయార్కు రైలులో వస్తాడు. కాని న్యూయార్కులో ఓడ వెళ్ళిపోతుంది! విధిలేక 'బోర్డో'కి వెడుతున్న 'హెన్రియెట్టా'ని కొనివేసి 'క్వీన్స్‌టవున్'కి మళ్ళిస్తాడు. ఫాగ్. ఆ తర్వాత లివర్‌పూర్ చేరుకుంటాడు. ఫిక్స్ అక్కడ అతనిని 'అరెస్టు' చేసి, తప్పుతెలుసుకొని వదిలేస్తాడు. ఫాగ్ 5 నిమిషాలు ఆలస్యంగా లండన్‌చేరి పందెం ఓడిపోతాడు.

బాంక్ ఆఫ్ ఇంగ్లండ్‌లో దొంగతనం చేసినవాడు దొరికాడన్న సంగతి తెలియగానే, యునైటెడ్ కింగ్‌డమ్ అంతా అట్టుడికినట్టుడికింది. ఫిలియస్ ఫాగ్‌మీద ప్రజాభిప్రాయం కూడా— అట్టు తిరగేసినట్టే — ఇట్టే తిరగబడి మారిపోయింది. అసలు దొంగ — జేమ్స్ స్ట్రాండ్ అనేవాడు డిసెంబరు 17వ పట్టుబడ్డాడు. అంటే ఊళ్ళో దిగడానికి మూడు రోజుల క్రితం వరకూ, ఫిలియస్ ఫాగ్ లోకం దృష్టిలో గజదొంగ. అతన్ని అరెస్టు చేయడానికి పోలీసు శాయశక్తులా కృషిచేస్తున్నారు. ఇప్పుడు కథ వేరు. ఫాగ్ పెద్దమనిషి. సజ్జనుడు. పందెం కట్టి లెక్కప్రకారం ప్రయాణంచేసి భూప్రదక్షిణం సాగిస్తున్న విచిత్ర వ్యక్తి.

ఒక్కమారుగా సంచలనం రేగింది. ఫాగ్ పేరు, ఫాగ్ కథ దుమారంలా విహరించాయి దేశమంతా. పత్రికలన్నిటా తిరిగి అతని యాత్రగురించి చర్చలు ఊహాపోహా గానాలూ ఆరంభమై పుంజుకున్నాయి. మాజిక్ చేసినట్టుగా మారిపోయింది, వాతావరణం. హఠాత్తుగా స్టాక్ మార్కెట్‌లో ఫిలియస్ ఫాగ్‌కు గిరాకీ తగిలింది. చకచక పెరిగింది. పందాలు భారీఎత్తున పడుతున్నాయి.

ఈ మూడు రోజులూ, రిఫారం క్లబ్బులో ఫాగ్ మిత్రపంచకం, పడిన ఆందోళన యింతా అంతా కాదు. దేశంలో నలుగురితోపాటు ఈ ఐదుగురు కూడా ఫాగ్ పేరే మర్చిపోయారీ మధ్య. ఇపుడు హఠాత్తుగా, పరగడుపైన పేరు తిరగబడింది. ఫాగ్ ఒకవేళ, అన్నవేళకు వచ్చేస్తాడా ? ఇపుడు ఎక్కడున్నాడు ? ఉన్నాడా ?—డిసెంబరు 17వ జేమ్సు అరెస్టయేవరకూ, ఫాగ్ బతికున్నాడని ఉండి ఉండవచ్చునని వారూహించలేదు. బయల్దేరి 76 రోజు లయినా అతని భోగట్టా బొత్తిగా తెలియరాలేదు. చనిపోయాడేమో అనుకున్నారు. లేకపోతే మధ్యలోనే ఆ ఉద్యమం విరమించుకున్నాడేమో. లేదా, అన్న ప్రకారం, లెక్క ప్రకారం ప్రయాణంచేసి హుటాహుటిన వచ్చేస్తున్నాడేమో. అలా అయితే, డిసెంబరు 21 రాత్రి ఎనిమిది ముప్పావుకు కాలమే మూర్తీభవించినట్టు క్లబ్బులో అడుగు పెడతాడా ?

ఆ మూడు రోజులూ జనం—ముఖ్యంగా లండన్ పౌరులు పడిన కలవరం వర్ణనాతీతం. ఫిలియస్ ఫాగ్ ఆచూకీ తెలుసుకుందికి అమెరికాకు, ఆసియా దేశాలకూ కబురు లంపారు. ఉదయం సాయంత్రం శావిక్‌రోలో ఫాగ్ ఇంటికి మనుషుల్ని పంపి వచ్చాడేమో చూడమన్నారు. జాడలు గాని, జాడల జాడలు గానీ దొరకలేదు. పొరబాటుపడి ఫాగ్‌ని వెంటాడబోయిన డిటెక్టివ్ ఫిక్స్ ఆచూకీ కూడా తెలియలేదు. పోలీసులకే తెలియలేదు.

భోగట్టా తెలియకపోయినా ఫాగ్ దొంగకాడని తేలడంతో పందాలు మాత్రం పుంజుకొన్నాయి. శనివారంనాడు పల్‌మల్‌లోను, చుట్టుపక్కల వీధులలోను జనం గుమిగూడి పందా లొడ్డసాగారు. రిఫారం క్లబ్బు దగ్గర సంరంభం చెప్పనక్కరలేదు. స్టాకు బ్రోకర్లే ఒక పెద్ద గుంపు కూడారు. వాద ప్రతివాదాలలో, సవాళ్లలో, ఊరూ వాడా మారుమోగిపోసాగాయి. క్లబ్బుమీదికి విరుచుకుపడుతున్న జనసందోహాన్ని అదుపు చెయ్యడం పోలీసులవల్ల కావటంలేదు. ఫాగ్ రావలసినవేళ దగ్గిర పడుతున్నకొద్దీ సంరంభం, ఉద్వేగం కట్టలు తెంచుకున్నాయి.

ఆ సాయంకాలం ఫాగ్ మిత్రులు రిఫారం క్లబ్బు హాలులో సమావేశ మయ్యారు. బాంకర్లు

జాన్‌సలివాన్, శామ్యూల్ ఫాలెనటిన్, ఇంజనీరు ఆండ్రూస్టువార్ట్, బాంక్ ఆఫ్ ఇంగ్లండ్ డైరెక్టరు గౌతియర్ రాల్ఫ్, మద్య వ్యాపారి థామస్ ఫ్లానగన్‌లు ఐదుగురూ ఎనిమిది ముప్పావుని, ఫిలియస్‌ఫాగ్ రాకని, రాకపోవడాన్నీ క్షణానికో విధంగా ఎదురు చూడసాగారు.

హాలులో పెద్ద గడియారంలో ఎనిమిదీ ఇరవై అయిదు నిమిషాలు కాగానే, ఆండ్రూస్టువర్ట్ సాహసించి, గొంతు సరిచేసుకుని, ఇంకో ఇరవై నిముషాలలో గడువు పూర్తి అవుతుంది'' అన్నాడు.

''లివర్‌పూల్‌నుంచి ఇంతకుముందొచ్చిందన్న రైలు, ఎన్ని గంటలకి స్టేషనులో కొచ్చిందన్నారు ?'' అన్నాడు ఫ్లానగన్.

''ఏడూ ఇరవై మూడు. దీని తరువాతి బండి రాత్రి పన్నెండూ పదినిముషాలకి గాని రాదు.'' అన్నాడు గౌతియర్ రాల్ఫ్.

''అయితే అంతే. ఫాగ్ ఏడున్నర బండిలో దిగి ఉంటే ఈపాటికి యిక్కడికి వచ్చిఉండేవాడు .... అంచేత మనం పందెం నెగ్గినట్టే ''

''తొందరపడకండి'' అన్నాడు ఫాలెంటిన్ కంగారుగా. ''మన మిత్రుడు చిత్రమైనవాడని మీకు తెలుసు. అంతా ఖచ్చితంగా ఉండాలనే రకం. వేళ ప్రకారమే పనులుచేసే రకం. ఒక నిముషం ముందరా రాడు, వెనకా రాడు. ఏడున్నరకే ఊళ్ళోకి వచ్చినా, ఎనిమిది ముప్పావు అయేదాకా ఆగిటంచనుగా ఆఖరు క్షణంలో ప్రత్యక్షం కాగల ఘటికుడు. అతనలా రాకపోతేనే మనం ఆశ్చర్య పోవాలి ''

''అతను నిజంగా అలా వచ్చి ఎదట నిలబడ్డా నేను నమ్మను. నమ్మలేను. కళ్ళారా చూసినా సరే. ఆ'' అన్నాడు ఆండ్రూస్టువర్ట్.

''అసలు అతను ఈ పందెం వెయ్యడం చాలా తెలివితక్కువ పని. తను ఎంత ఖచ్చితంగా నడిస్తే మటుకు మరీ ఇంత ధీమానా ? ఏ రైలో ఏ ఓడో ఎక్కడో ఆలస్యం అవుతుంది ఇతనివల్ల కాని పరిస్థితుల్లో చిక్కడుతోంది ? ఏం చేస్తాడు ? ఎంతో అక్కరలేదు. ఏ రెండు మూడు రోజులో ఆలస్యం అయితే చాలు—యాత్ర దెబ్బతిన్నట్టే గద !'' అన్నాడు థామస్ ఫ్లానగన్ విసుగ్గా.

''ఇంకొకటి చూశారుగాదు. ఈ 80 రోజుల్లోను ఒక్కసారి కూడా మనకి అతగాడి దగ్గర నుంచి జాబు రాలేదు. పోనీ టెలిగ్రాం ఇవ్వచ్చు గదా. వాటికేం కొరవలేదుగా దారి పొడుగునా ఉన్నాయిగా'' అన్నాడు సలివాన్—ఫ్లానగన్ చిరాకుకు శ్రుతి కలుపుతూ.

''హయ్యా. ఇహ లాభంలేదండీ. పోయాడు చిత్తుగా ఓడిపోయాడు.'' అన్నాడు. స్టువర్ట్ విట్టూర్చి. ఆయనకు ఇంకో కారణం కనపడింది. ''వీరు ఇది గమనించారో లేదో. అతను న్యూయార్కునించి లివర్‌పూల్ రావడానికి ఎక్కాల్సిన ఆఖరు ఓడ 'చైనా' నిన్న ఉదయమే లివర్‌పూల్ చేరింది. అందులో వచ్చిన ప్రయాణికుల జాబితా ఇదిగో. చూడండి. ఫాగ్ పేరు ఎక్కడా లేదు. అంటే అసలు తను ఇంకా లివర్‌పూలే వచ్చివుండడు. అంతేనండి. మహా అయితే ఈపాటికి అమెరికా చేరివుంటాడు. అదే గొప్ప. ఎంత ఉజ్జాయింపుగా లెక్కవేసినా హీనపక్షం ఇంకో ఇరవై రోజులకి గాని ఈ గడ్డమీద కాలు పెట్టలేడు. అంతే లెక్క. పాపం ముసిలాయన లార్ ఆల్బ్‌మార్ల్ పందెం వేశాట్ట ఐదువేలు అదంతా సముద్రంపాలే.''

''అంతేలెండి. ఇంకెక్కడ వస్తాడు. రేప్పొద్దుటే మనం బారింగ్ బ్రదర్స్‌కి చెక్కు పంపడం ఒక్కటే తరువాయి'' అన్నాడు గౌతియర్ రాల్ఫ్.

అప్రయత్నంగా అంతా గడియారం వంక చూశారు. ఎనిమిదీ నలభై అయింది.

''ఇంక అయిదు నిమిషాలు'' అన్నాడు ఆండ్రూస్టూవర్, అనవసరంగా.

మిత్రులైదుగురూ మళ్లీ గడియారం చూశారు.

---

కొత్తగా కాపరానికివచ్చిన

భార్య:- సాయంత్రం వచ్చేటప్పుడు ఎలుకలబోనొకటి పట్టండేం.

భర్త:-అదేమిటి? మొన్ననే కదా ఒకటి కొన్నాం!

భార్య:- కాని అందులో అప్పుడే ఓ ఎలుక పడింది.

కె. యస్. రాజు (బొంబాయి)

---

మొహమొహాలు చూసుకున్నారు. ఎంతటి ఆటగాళ్లయినా ఇరవై వేలు ఇరవై వేలే. గుండెలు కొంచెం ధాటీగా కొట్టుకున్నాయి. గడియారంలో సెకండ్లు గుండెల్లోనే మోగసాగాయి. అయినా అంతా ధైర్యం నటించబోయారు. ఒక ఆట వేదాం అన్నాడు ఫాలెన్‌టిన్. తను నిశ్చింతగా ఉన్నా డన్నట్టు ప్రకటించడానికి దావికేం. ఆడదాం. అని కూర్చున్నారు మిగతా నలుగురు.

రక్తం ఉధృతంగా ప్రవహిస్తోంది. ఉండుండి నరాలు బిగదంతున్నాయి.

''ఎవరే మనుకున్నా సరే. నా వాటా నాలుగు వేలూ ఖచ్చితంగా ఒడేసి పుచ్చుకుంటాను. 3999 పౌండ్లు ఇస్తానన్నా సరే, ఆ ఒక్కటీ కూడా వదలను'' అన్నాడు స్టువర్ట్ బాధని కసిగా పరిమార్చి.

ఎవరూ మాట్లాడలేదు. చూపులు గడియారం మీద వాలాయి. అందులో పెద్ద ముళ్ళు నలభై రెండో నిముషంమీద వాలింది.

ఆటగాళ్ళు పేకముక్కలు చేత పట్టుకున్నారు, గాని చూపులు పెద్ద ముల్లుకి గుచ్చుకు పోయాయి. గెలుపు ఖరారని ధీమా ఉన్నా, ఆ మూడు నిమిషాలు కూడా దొర్లిపోతేగాని మనసు స్థిమితపడదు. క్షణమొక యుగం, నిమిష మొక యుగం వగైరా వాక్యాలు అతిశయోక్తులు కావేమో. ఆ అయిదుగురు అంతంత పొడుగుపాటి నిముషాలను ఎన్నడూ చూసి ఎరుగరు.

రాల్ఫ్, యాంత్రికంగా పేక కలిపి పెట్టాడు. ఫ్లానగన్ అంతకన్న యాంత్రికంగా కోస్తూ, ''ఎనిమిదీ నలభై మూడు'' అన్నాడు.

ఆమాట సముద్రమంత నిశ్శబ్దంలో పడి మునిగిపోయింది. ఎవరూ మాటాడలేదు. విశాలమైన హాలు నిశ్శబ్దంలో నిండి ఇరుకై పోయింది. క్లబ్బు బయట సందడి మట్టుకు సనసన్నగా లోపలికి వచ్చి వినిపిస్తోంది. ఉండుండి. గావుకేకలాటివి తేలి లోపలికి వస్తున్నాయి.

గడియారంలో లోలకం, బద్ధకానికి తప్పటడుగులకు ఇది వేళ కాదన్నట్టు, లెక్కప్రకారం నిర్విరామంగా అటూ యిటూ ఊగుతూ సెకండ్లను జమ కడుతోంది. ఆటగాళ్ళు ముక్కలు చూస్తున్నా, గడియారం మోగించే సెకండ్లను అప్రయత్నంగానే ఒక్కొక్కటిగా లెక్కపెట్టుకుంటున్నారు.

''ఎందీ నలభై నాలుగూ!'' అని కేక పెట్టాడు జాన్‌సలివాన్—ఉద్వేగం పట్టలేక.

ఇంకొక్క నిముషం. ఇంకొక్క నిముషం తిరిగి పోతే, జరిగిపోతే, కాలగర్భంలో కరిగిపోతే .... పందెం గెలిచినట్టే. విజయం ఇరవై వేలూ తమవే .... తమవే .... తమకు తెలియకుండానే మిత్రులు ఆట మానేశారు. వారి అనుమతి లేకుండానే చేతులు పేకముక్కలను బల్లమీద పడేశాయి. వారి చెవులే కాక ప్రత్యంగం, ప్రత్యణువూ ఆఖరి అరవై సెకండ్లనూ లెక్కపెట్టసాగింది. ఐదుగురూ ఐదు కోట్ల గడియారాలై పోయారు. భూనభాలు ఏకమై సెకండ్లను మోగిస్తున్నాయి.

నలభై సెకండ్లు అయిపోయాయి నిశ్శబ్దం మౌనంగా ఉంది. యాభై సెకండు అయిపోయాయి. నిశ్శబ్దం మవునంగా ఉంది.

యాభై అయిదవ సెకండు మోగేసరికి నిశ్శబ్దం గర్జించింది. ఫెళ్ళున మోగింది పిడుగులా హాలును అదరగొట్టింది. బయటనుంచి కేకలు, జయధ్వానాలు, హర్షధ్వానాలు, తిట్లు, శాపనార్థాలూ సముద్ర తరంగాలై విజృంభించి క్లబ్బు హాలులోకి విరుచుకపడి హాలును ముంచెత్తేశాయి

ఆటగాళ్ళు అయిదుగురూ అప్రయత్నంగా, యాంత్రికంగా లేచి

యాభై ఏడవ ఆయేసరికి హాలు తలుపు తెరుచుకుంది. అరవయ్యో సెకండు పడేలోపల జయధ్వానాలూ వాటిమధ్య ఫిలియస్ ఫాగ్, అతని వెనుక కట్టలు తెంచుకు విరుచుకు పడిన జనసందోహం లోపలికి అవతరించడం జరిగి పోయింది.

''వచ్చాను'' అన్నాడు ఫిలియస్‌ఫాగ్

* *

నిజమే. అతను ఫిలియస్‌ఫాగ్ అయిన మాట నిజమే. వేళకి వచ్చి నిలబడ్డ మాటా నిజమే.

ఆరోజు రాత్రి ఎనిమిదీ ఐదు నిమిషాలకు ఫాగ్ నమ్మినబంటు పాస్పార్టూ, యజమాని పనుపున చర్చికి వెళ్లి రెవరెండ్ శామ్యూల్ విల్సన్‌ను కలుసుకుని ఆ మర్నాడు ఉదయం జరుగవలసి ఉన్న ఒకానొక వివాహానికి ఏర్పాట్లు చేయబోయిన విషయం

విదితమే. పాస్పార్టూ చాలా ఉత్సాహంగా పరుగెత్తాడు తీరా వెళ్ళేసరికి రె. విల్సన్ ఇంకా తమ బసకు రాలేదని తెలిసింది. పాస్పార్టూ ఆయన కోసం కూర్చున్నాడు. కనీసం ఇరవై నిముషాలైనా కూర్చుని ఉంటాడు. అక్కడనుంచి కదిలి ఇంటికి బయల్దేరేసరికి ఎనిమిది గంటల ముప్పై

## 80 రోజులలో భూప్రదక్షిణం

అయిదు నిముషాలయింది. తిరుగు ప్రయాణం మరీ చురుగ్గా సాగించాడు పాస్పార్టూ. ఈ వేగం, అతని ఆ వేగం ఇంతా అంతా అని చెప్పరానిది. నర మానవుడు కనీ వినీ ఎరుగనిది. టోపీ ఎగిరిపోయింది. జుట్టు రేగిపోయింది. ఊపిరి చాలొచ్చింది. అయినా అతను లేడిలా దూకుతూ, పాములా జనం మధ్య దారి చేసుకుపోతూ, ఎద్దులా తోసుకుపోతూ పరుగెత్తాడు. కొండవాలులో సెలయేరులా

ప్రవహించాడు ఇంటికి. మూడు నిముషాలలో ఇల్లు చేరాడు. చేరి ఫిలియస్‌ఫాగ్ గదిలో వెళ్లి పడ్డాడు. ఆయాసంవల్ల మాట రాలేదు. ఊపిరి అందలేదు.

"ఏమిటిది. ఏమైంది ?" అన్నాడు ఫాగ్.

"హయ్యో .... పెళ్లి .... పెళ్లి జరగదు. వీల్లేదు."

"వీల్లేదా ? .... అంటే ?"

"వీల్లేదు .... రేపు వీల్లేదు."

"ఏం ? ఎంచేత ?"

"రేపు రేపు—ఆదివారం. అంచేత."

"సోమవారం."

"కాదు. ఇవాళ శనివారం."

"శనివారమా ! ఛ. అసంభవం" అన్నాడు ఫాగ్ ఆశ్చర్యంతో.

"అవును, ఇవాళ శనివారమే. మీరు తప్పారు. ఒక్కరోజు లెక్క తప్పారు. మనం గడువుకన్న ఇరవైనాలుగ్గంటలు ముందరే వచ్చేశాం. కాని ఇంకా సరిగ్గా పది నిముషాలుంది గడువు" అన్నాడు పాస్పొర్టూ. అంటూనే ముందుకు దూకి యజమాని చొక్కాకాలరు పట్టుకుని మాట వినకుండా బలవంతాన ఈడ్చుకు వెళ్లిపోయాడు వీధిలోకి.

ఫిలియస్‌ఫాగ్‌కు ఇక ఆలోచించేందుకు, వాదించేందుకు కూడా వీలులేదు, వేళే లేదు. గుమ్మం దిగుతూనే ఎదురైన బగ్గీ ఎక్కి వందపౌండ్లు కిరాయి యిస్తానని కేకవేసి ఉరికించమన్నాడు. రెండు కుక్కల్ని లాక్కి, ఐదు బళ్లని ఢీకొని మరీ క్లబ్బుకి చేరింది బగ్గీ.

ఫిలియస్‌ఫాగ్ బగ్గీ ఉరికి క్లబ్బు తాలుకు గ్రాండ్ సెలూన్ హాలులో కాలు మోపేసరికి సరిగ్గా ఎనిమిదీ నలభై అయిదు అయింది.

ఫిలియస్‌ఫాగ్ 80 రోజులలో భూప్రదక్షిణం సాధించగలిగాడు ?

ఫిలియస్‌ఫాగ్ ఇరవైవేల పౌండ్ల పందెంలో విజయం సాధించగలిగాడు.

ఇంతకీ ఫిలియస్‌ఫాగ్ వంటివాడు—అంత ఖచ్చితమైన మనిషి 80 రోజులు లెక్కపెట్టడంలో ఒక్కరోజు ఎలా పొరబడ్డాడు ? లండన్‌లో దిగిన రోజు 79 వ రోజు—డిసెంబరు 20 వ తేదీ శుక్రవారం కాగా ఇతను మాత్రం అది 21 వ తేదీ శనివారం అని ఎలా భ్రమపడ్డట్టు ?

ఫిలియస్‌ఫాగ్ తనకు తెలిసి చేస్తున్నవన్నీ జాగ్రత్తగానే చూసుకున్నాడు గాని, తెలియకుండా చూసుకోకుండా చేసిన పని ఒకటి ఉంది. ఈ ప్రయాణం ముగిసేసరికి ఒకరోజు లాభం చేసుకోడం. ప్రయాణం అంతా తూర్పువేపుగా సాగడంవల్ల ఇలా ఒకరోజు కలిసివచ్చింది. అదే పడమటివేపుకి అయివుంటే ఒకరోజు నష్టపోయేవాడు. దానిప్రకారం ఇది. ఫిలియస్‌ఫాగ్ తూర్పుకి అనగా సూర్యుడికి అభిముఖంగా వెళ్లాడు కాబట్టి పోను పోను ఒకొక్కరోజు కురచబారసాగింది. అతను ఒక్కొక్క డిగ్రీ దాటినప్పుడల్లా నాలుగు నిమిషాలు కురచబారింది. ఇలా ఎన్ని డిగ్రీలు దాటితే అన్ని నాలుగుల చొప్పున నిమిషాలు కలిసివస్తాయి భూగోళం పరిధిన మొత్తం 360 డిగ్రీలు, న్నాయి. 360 ని నాలుగు నాలుగు నిమిషాలపెట్టి హెచ్చు వేస్తే (డిగ్రీకి నాలుగు నిముషాలు) సరిగ్గా ఇరవైనాలు గ్గంటలు వస్తుంది. అంటే, తూర్పుదిక్కుగా పోతున్న ఫిలియస్ ఫాగ్, ప్రయాణం మొత్తంమీద సూర్యుడు మెరిడియన్ దాటడం ఎనభైసార్లు చూస్తే—(ఎనభై సూర్యోదయాలన్నమాట) లండన్‌లో కూర్చున్న అతని మిత్రులు 79 సార్లే చూశారన్నమాట. అందువల్ల ఫాగ్ డైరీలో లెక్కల ప్రకారం ఆనాడు ఆదివారం కావలసి ఉన్నా, నిజాని కది లండన్‌లో శనివారమే. అందువల్లనే క్లబ్బులో మిత్రులు ఎదురుచూస్తూ కూర్చున్నారు, ఫాగ్ ఆశ వదులుకు ఇంట్లో ఉన్నాడని తెలియక.

పాపం, లండన్ వదలివెళ్లింది లగాయతూ నానాదేశాలా నవ్వులపాలైన పాస్పొర్టూ గడియారం యధాప్రకారం లండన్ టైమునే చూపిస్తోంది. అందులో తారీకుల ముల్లు కూడా ఉండిఉంటే ఆరోజు శనివారమేనని ఘంటాపథంగా చెప్పేదే.

మొత్తంమీద ఫిలియస్‌ఫాగ్ గెలుపు సాధించి 20 వేల పౌండ్లు సంపాదించాడు. కాని ప్రయాణ భత్యాలకు దాదాపు పందొమ్మిదివేలు ఖర్చు అయిపోయినందువల్ల, ఈ పందెంవల్ల అతనికి ఆర్థికంగా లాభించినదేమీ లేదు. ఆర్థికలాభం అతను ఆశించనూ లేదు. అతనిక్కావలసిందల్లా పంతం నెగ్గి మాట నిలబెట్టుకోవడమే. అందువల్ల, పందెం డబ్బులో మిగిలిన వెయ్యి పౌండ్లూ పాస్పొర్టూకు,



డిటెక్టివ్ ఫిక్సుకూ పంచి యిచ్చేశాడు ఫిక్సుమీద అతని కోపం అప్పుడే పోయింది. పోతే, పాస్పొర్టూ పొరబాటువల్ల అతని గదిలో 1920 గంటలసేపు కాలిన గాస్ బర్నరు రుసుమును మాత్రం—కమశిక్షణ పేరిట శాస్త్రోక్తంగా పాస్పొర్టూ ఖాతాలో అతని డబ్బునుండి మినహాయించుకొన్నాడు.

ఆరాత్రి పందెం గెలిచి ఇంటికి వచ్చేసరికి ఫాగ్ యథాప్రకారం ఉన్నాడు. షికారు వెళ్ళివచ్చినట్లే మామూలుగా ఉన్నాడు. ఆనందోద్వేగాలు లోపల లేవన్నా ఉన్నా దుర్భేద్యమైన అతని ముఖవైఖరివల్ల కనబడవు.

"ఈ పెళ్లి మీ కిష్టమేగా" అన్నాడు అయూదాతో.

అయూదా నవ్వింది. "ఇప్పుడు ఆ ప్రశ్న అడగాల్సింది మీరు కాదు, నేను. ఇంతకుముందు మీ సర్వస్వం పోయిం దనుకున్నారు. ఇప్పుడు మీరు భాగ్యవంతులు—"

"మన్నించండి. ఒక్కముక్క స్పష్టంగా చెప్పాలి. ఈ క్షణంనుండీ నా ఆస్తి అంతా మీదే. మీరు గనక వివాహం ప్రసక్తి తెచ్చిఉండకపోతే పాస్పొర్టూ రెవరెండ్ విల్సన్ ఇంటికి వెళ్ళేవాడు కాదు. వెళ్లకపోతే నా పొరబాటు నాకు తెలిసేది కాదు—"

"డియర్ మిస్టర్ ఫాగ్—" అంది అయూదా.

"డియర్ అయూదా" అన్నాడు ఫిలియస్‌ఫాగ్.

నలభై ఎనిమిది గంటల తరువాత వివాహం యథావిధిగా జరిగిపోయింది. పెళ్లికొడుకును వరించి తలు మించి ముస్తాబై ధగద్ధగాయమానంగా, భాజభజంత్రీల్తో, వందమంది పెళ్లివారి పెట్టుగా తిరిగాడు పాస్పొర్టూ. ఇదంతా అతని చలవే. అతనే పెళ్లిపెద్ద. అయూదాని కాపాడింది తనే. అంచేత పెద్దరికం హక్కులు, అధికారాలూ తనకి కాక మరెవరి కుంటా యున్నట్లు తిరిగాడు పాస్పొర్టూ.

మర్నాడు ఉదయం తెలతెలవారుతూఉండగా దబదబ తలుపు కొట్టాడు పాస్పొర్టూ.

తలుపు తెరుచుకుంది ఫిలియస్‌ఫాగ్ తొంగి చూశాడు.

"ఏమిటి పాస్పొర్టూ !"

పాస్పొర్టూ హడావుడిగా చిందులు తొక్కుతున్నాడు. "ఏమిటంటా రేమిటి ? ఇవుడే తట్టింది నాకు—"

"ఏమిటి ?"

"ఏమి టేమిటి. మనం అసలు ఈ భూప్రదక్షిణం 78 రోజుల్లోనే చేసెయ్యొచ్చు."

"నిజమే. ఇండియా మీదుగా వెళ్ళకపోతే నువ్వన్నట్టే కలిసొచ్చేది. కాని, ఇండియా వెళ్ళి ఉండకపోతే మనం అయూదాను కాపాడి ఉండేవాళ్లం కాము. అది జరక్కపోతే ఆమెను పెళ్లి చేసుకోవడం పడేదికాదు. అప్పైన—"

అప్పైన చెప్పేందు కేం లేదు. ఫాగ్ తలుపు మూసివేశాడు.

ఫిలియస్‌ఫాగ్ భూప్రదక్షిణప్రకారం ఇది. 80 రోజులలో భూమిని చుట్టి రాగలిగాడు. ఇది సాధించడానికి అతను అడ్డమైన వాహనాలూ ఎక్కాడు— ఓడలు, రైళ్లు, బళ్లు, స్టీమర్లు, సరకు ఓడలు, స్లెడ్జిబళ్లు, ఏనుగులు—అన్ని రకాలు ఎక్కి ప్రయాణం చేశాడు. ఇన్నివేల మైళ్ల పొడుగునా ఎన్ని అవాంతరాలు వచ్చినా ఎలాటి ఉపద్రవాలు వచ్చిపడినా అతను స్తిమితంగా ఉన్నాడు. ఎన్నడూ ఉద్రేకపడలేదు. కంగారు పడలేదు. జోరుగా పరిగెత్తినా ఆ పని నిదానంగా చేసేవాడు.

అయితే ఫలితం ఏమిటి? ఈ యాత్రచేసి పందెం గెలిచి అతను సాధించిం దేమిటి ? సంపాదించిం దేమిటి ?

ఏవుంది. ఏమీలేదు, అంటారా ?

నిజమే ఏమీలేదు. కాని ఒక చక్కని చుక్కను తెచ్చుకున్నాడు. ఇంకో ఫలితం లభించినా ఏపాటి ఆనందపడేవాడో తెలీదు గాని, ఈ సౌందర్యరాశి అతనికి లభించి అతని జీవితాన్ని ఆనందమయం చేసింది. లోకం మొత్తంమీద అంత సంతోషం, తృప్తి ఉన్నవాడు అతనే అనిపించేటంతగా అతని జీవితాన్ని వెలుగుతో ఆనందంతో నింపివేసింది.

అందులో సగం ఆనందం లభిస్తుందని ఆశపెట్టినా, మీమటుకు మీరు దానికోసం భూప్రదక్షిణయాత్రకి బయల్దేరతారు. అంతేనా ?

(అయిపోయింది)




'మీకసలు బుద్ధుల్లేవు' అని విరుచుకుపడింది అరుంధతి తన చుట్టూ చేరి ప్రశ్నలతో వేధిస్తున్న మిత్రబృందం మీద. ఎందుకో ఆమెకంత చికాకు...

'నిలువవే వాలుకనులదానా — వయ్యారి హంస నడకదానా—నీనడకలో హొయలున్నదె చానా!—' దూరాన్నుంచి పాతరికార్డు చెవుల్లో రింగుమని వినిపిస్తోంది. కాలేజి టైమయిందని హడావిడిగా నడుస్తూన్న అరుంధతికి ఈ పాట బొత్తిగా నచ్చలేదు. వెనక్కు తిరిగి చూసింది!— అతనింకా తనని అనుసరిస్తూనే వున్నాడు. బుద్ధి లేకపోతేసరి. దీనికి తగ్గట్టుగా ఈ వెధవరికార్డొకటి. అరుంధతికి వళ్ళు మండిపోయింది. రెండుజడల్లో ఒకజడ విసురుగా కోపంగా ముందుకి దుమికింది. ఈ అలజడికి జంకిపోయి జడలోని గులాబి బిక్క మొగం వేసింది. భయమేసి కింద పడిపోయింది.

నాలుగైదు రోజుల్నుంచి ఇదే వరస! అరుంధతి బయల్దేరినవేళకే ఈ కళ్ళజోడబ్బాయి బయల్దేరతాడు. క్లాసులో కన్నార్పకుండా ఆమెవైపే చూస్తాడు. మళ్ళీ ఆమె ఇంటికెళ్ళే వేళకి తనూ తయారవుతాడు. ఏమిటతని ఉద్దేశ్యం?

అరుంధతికి కోపం యీరోజు వర్ధన్నకొద్దీ ఎక్కువైపోతోంది. సమయానికి యీ రికార్డొకటి. సంగీతంపై వెంత మోజున్నా—ఆమెకిప్పుడు ఈ రికార్డు నచ్చలేదు. కోపం వచ్చేటంత సిగ్గుతోపాటు రోషంకూడా పుట్టుకొస్తోంది.

మళ్ళీ వెనక్కు తిరిగి చూసింది. అతను అలాగే వెంబడిస్తున్నాడు. ఏమీ తెలియనివాడిలా పుస్తకం చదువుతున్నట్టు నటిస్తున్నాడు. ఇదంతా నటన కాకపోతే ఎవరైనా నడుస్తూ చదువుతారా?

ఈ అబ్బాయికి తగిన బుద్ధి చెప్పాలి.— అరుంధతిమనసు ఆర్డరేసింది. అసలా అబ్బాయి విషయం నీకెందుకూ? అతనే వేషాలేస్తే నీకేమంది అదే మనసు. అవును మరి ఆ అబ్బాయివిషయం తనకెందుకూ? మరి అతనెందుకు తనని వెంబడిస్తే? క్షణ క్షణానికి ఆ అబ్బాయి ప్రవర్తనే గుర్తుకొస్తోంది.

అరుంధతి వేగం పెంచింది. కొంతదూరం వెళ్ళింతర్వాత వెనక్కు తిరిగి చూసింది. అతను కనుపించలేదు. గాలి పీల్చుకుంది. ఇంతలోనే ఏమయ్యాడు? ఏమవుతే తనకేం—అహ...ఇంతలోనే ఎలా మాయమయ్యాడూ అని— అంతే. సర్దిచెప్పు/కుంది.

అర్జెంటుగా సైకిల్ బెల్లు వినిపించేసరికి త్రుళ్ళిపడి తప్పుకుంది. కళ్ళజోడబ్బాయి ముందు కూర్చున్నాడు బుద్ధిమంతునిలా. అతని నేస్తం కాబోలు సైకిలు తొక్కుతున్నాడు సరిగ్గా తనపక్కనుంచే సైకిలు పోనిచ్చాడు కొంటెగా! అది చాలదన్నట్టు బెల్లు కూడా వాయిస్తున్నాడు. తనని దాటింతర్వాత పనిమాలా వెనక్కి తిరిగి వళ్ళికిలించి, కళ్ళు మిటకరించి చూశాడు కళ్ళజోడబ్బాయి నేస్తం. ఎదురుగా వచ్చే రిక్షానైనా చూడకుండా ఇంకా అదే పోజులో వున్నాడు. ఆవశంగా రిక్షాకి గుద్దుకోకూడదూ పీడ విరగడైపోతుంది— అరుంధతి మనసారా కోరుకుంది. కాని—అంత చాతకానివాళ్ళా వాళ్ళు—కన్నుమూసి కన్ను తెరిచేంతలో రిక్షాని అవలీలగా తప్పించుకుపోయారు.

చదువుకుని బాగుపడదామనే కోవకి చెందని వాళ్ళకి ఇలా అమ్మాయిల్ని వెంబడించటం మినహా మరేమీ చాతగాదు. ఇంట్లోవాళ్ళు డబ్బు పంపుతారు. వీళ్ళేమో కులాసాకోసం . చదువుతారు. ఇలాంటి మనస్తత్వాలు మారిపోవాలి త్వరగా.

ఎక్కడా దొరకనట్టు—సరిగ్గా అరుంధతి ఇంటిదగ్గర్లోనే గది తీసుకున్నాడు కళ్ళజో



...ం. కాలేజికి రామా సోమా అరుంధతిని ...ంబడించేసింతర్వాత సాయంత్రం టిప్‌టాప్‌గా ...యార్లై ఆమె ఇంటిముందు ఖాళీ స్థలంలో ...ాయిస్తాడు. గాలికోసం డాబామీద సాయం ...హారం చేద్దామంటే తనిఘటంలా అల్లంత ...ారంలో అరుంధతికి అతను ప్రత్యక్షమౌతాడు. ...క్కోసారి ఆమెకి అతనిమీద చెప్పలేనంత, చంపే ...మన్నంత కోపం వస్తుంది. ఆడపిల్ల తనేం చెయ్య ...దవేగా అతని కంత ధీమా!

అన్నయ్యకి అతనిగురించి చెప్పేద్దామను ...ంది చాలాసార్లు. అసలే అన్నయ్య కనరత్తా ...కి చేసిన వస్తాడు. ఫలానావాడు నన్ను అల్లరి ...స్తున్నాడని చెప్పిందా—ఇంకేముంది—కళ్ళజో ...బ్బాయి ఖాస్టడు క్లోజ్! అంతవరకు ఎందుకులే ...ని వాయిదా వేస్తూ వచ్చింది.

వెంబడిస్తే వెంబడించేడూ—మరీ అంత ...బ్లిగ్గా—అందరికీ అలుసైపోయేలా వెంబడిస్తే ...ల్లా! మొన్నమొట్టుకి మొన్న విమల 'ఏమో! మీ ...ుకింకా రాలేదా' అని పదిమందిలో పట్టుకు ...డిగేసింది. అరుంధతికి కళ్ళనీళ్ళపర్యంతమయింది.

వీళ్ళ కసలు బుద్ధులుండవు కాబోలు. వాళ్ళకేం ...వరేమన్నా సరదాగానే తిరుగుతారు. తనలాటి ...డపిల్లల విషయం వాళ్ళ కనవసరం.

ఆలోచిస్తూ నడుస్తున్న అరుంధతికి "థర్ ...ల్"కూడా వినిపించలేదు. క్లాసు గుమ్మంలో

అడుగుపెట్టేసరికి లెక్చరర్ మాంచి మూడ్‌లో పాఠం చెపుతూన్నారు.

అరుంధతి ఆయన అనుమతికోసం గుమ్మం దగ్గర బొమ్మలా నిలబడింది. చేతులు తిప్పు కుంటూ పాఠం చెపుతూన్న కుఱ్ఱమాష్టారు అరుంధతిని గమనించలేదు కాబోలు — క్లాసు పైకప్పు ఎగిరిపోయేలా పాఠం చెబుతున్నారు. అందునా కీట్సుగారి "ఇజబెల్లా"అంటే మాష్టారికి మరో ప్రాణం.

చివర్ని కూర్చున్న కళ్ళజోడబ్బాయి అరుంధతిని చూచాడు. చూస్తూన్నాడని అరుంధతికళ్ళు చెప్పాయి. ఇంత లేటాన్నట్టు జాలిగా చూశాడు. ద్వారపాలకురాలిలా నిలబడ్డ అరుంధతికి అతనిమీద కోపమెంతైనా ముంచుకొచ్చింది. తన విషయం అతని కెందుకసలు. ఖర్మంకొద్దీ లెక్చరర్ పాఠంలో తలనిండుగా మునిగిపోయారు.

తిరిగి వెళ్ళిపోదామని వెనక్కు తిరగబోయింది. రాగయుక్తంగా పొయిట్రీ చదువుతున్న కుఱ్ఱ మాష్టారి చూపు( దయతలచి )గుమ్మందగ్గర అరుంధతిమీద నిలిచింది. రెండుక్షణాలు పాఠమాపి తీక్షణంగా చూచాడు పాఠానికి అంతరాయం కలిగి నందుకు—అదే అబ్బాయి అయితే ఏమనేవాడో తెలియదుగాని—అరుంధతి ఆడపిల్లైపోవటంమూలంగా 'కమిన్' అన్నారు. అరుంధతి క్లాసులోకొచ్చి కూర్చుంది.

మాష్టారు ఆగిపోయిన పాఠాన్ని తిరిగి ప్రారంభించారు. మళ్ళీ సరైన 'మూడ్'లోకి రావటానికి ఎలా లేదన్నా పదినిమిషాలు పట్టింది. పాఠం సాగుతోంది అరుంధతి హృదయంలో అవమానాగ్ని రగులుతోంది పక్కన కూర్చున్న విమల మాటల్లోకి దింపింది.

'ఏమే!.....ఇంత లేటయిందే—'

'... ... ... ...'

'ఆలిస్యంగా లేచావా? సినిమా కెళ్ళావా? రాత్రి బాగా చదివావా?' వుండుండి ఒక్కో ప్రశ్న వేస్తూంది విమల

'అబ్బ! నన్నాట్టే విసిగించకు'

'కారణం లేందే—'

'ఏమీ లేదనటంలే—'

లెక్చరర్‌కి మళ్ళీ అంతరాయం కలిగింది. మాటాడుకొంటూన్న ఇద్దరమ్మాయిలవైపు కోపంగా చూశారు. అంతే—మాటలు బందయ్యాయి. కాని మామూలు 'మూడ్' మళ్ళీ తెచ్చుకోవాలంటే లెక్చరర్‌కి సాధ్యం కాలేదు. అందుచేత వినుక్కుంటూనే, చప్పచప్పగా పాఠం చెప్పుకుపోయారు. అవరుకాస్తా ఇట్టే అయిపోయింది.

—లేడీస్ వెయిటింగ్ రూంలో అంతా సమావేశమయ్యారు. అందరికీ అరుంధతి ఆరోజు కొత్తగానే కనిపిస్తూంది. ఏనాడూ లేటుగారాని అరుంధతి లేటుగా రావటమేమిటి—వచ్చిందిపో—సిగ్గైనా లేకుండా గుమ్మందగ్గర రాతిబొమ్మలా నిలబడటమేమిటి ? ఈ విషయాన్నే అందరూ తరచితరచి అడిగారు. అందరిమీదా ఫైరయిపోతోంది అసలు నా విషయం మీ కెందుకంది.

"పోనీలే వెధవగొడవ ! లైబ్రరీకి వెడదాం వస్తావా?" ప్రభావతి టాపిక్ మార్చి అడిగింది.

"నే రాను—"

"మా తల్లివికదూ! రా...." బ్రతిమాలింది.

"నే రానని చెప్పటల్లా" అరుంధతికి కోపం వచ్చింది.

"ఎందుకే నీ కింత అలుక. ఓ రామచిలుకా!" రాగం తీసింది కుసుమ.

"మీ కసలు బుద్ధుల్లేవు" అరుంధతి అరిచేసింది.



ఒకడు తప్పతాగి తెలివి లేకుండా దారికి అడ్డంగా పడి వున్నాడు. అదను చూచుకొని దారినపోయే ఓ దొంగ, తాగుబోతు కాళ్ళకున్న కొత్త బూట్లను తాను వేసుకొని తన చిరిగిన పాత బూట్లను తాగుబోతు కాళ్ళకు తొడిగి చక్కాపోయాడు.

తర్వాత కాసేపటికి ఓ బండివాడు ఆ దారినవస్తూ, దారినుండి కాళ్ళను జరుపుకోమని కేకేశాడు. తాగుబోతు, తలెత్తి తన కాళ్ళ వైపు ఓ మారు చూచుకొని యీ విధంగా జబాబిచ్చాడు.

"అబ్బాయి! ఆ కాళ్ళు నావి కావు. కాబట్టి నువ్వు నిరాటంకంగా బండితోలుకుపోవచ్చు."

ఎస్. ఎ. రషీద్ (మద్రాసు)



"అవును" ప్రభావతి అందుకుంది.

"ఎవర్ని గేలిచేద్దామాని ఎదురు చూస్తూంటారు!"

"నిజం—"

"ఏమిటి నిజం! మీ బొంద నిజం! ఒక మనిషి చీకుతో చచ్చిపోతూంటే నవ్వుతూ కూర్చోటం మీకు సరదానా—" ఉడుకుబోత్తనంతో అంది అరుంధతి

"అసలేం జరిగిందే అరూ—" విమల అడిగింది.

"ఏదైనా మనకి జరిగితేనేగాని అనుభవానికి రావు"

"చంపక అసలువిషయం చెపుదూ"

".... .... .... .. . ....

'నీదగ్గరున్న బుద్ధే ఇది. సస్పెన్స్‌లోపెట్టి చావగొడతావ్. త్వరగా చెప్పు ఏం జరిగిందో—"

"ఆ కళ్ళ జోడబ్బాయి—" అరుంధతి చెప్ప లేకపోయింది. అతను గుర్తుకొస్తేనేచాలు, అరికాలు మంట నెత్తికి పాకుతుంది.

"ఆఁ ..... అహ ...‚ ఏంచేశాడేమిటి?" అందరూ ఒక్కసారిగా అడిగారు.

"ఏదైనా చెయ్యటానికి నేనంత అలుసుగా వున్నానా?"

"మరేమయ్యిందే?" విమల రెట్టించి అడిగింది

"రోజూ చేసే పనే—వెంబడించటం"

"ఓసంతేగదా! — ఇంకేవిటో అనుకున్నాం. తీరగనీ !—ఎవడొద్దన్నాడూ ? జీతం బత్తెంలేని బాడీగార్డుగా వుంటానంటె మధ్య మన సొమ్మేంపోయిందిగనక" కుసుమ అన్న మాటలికి అరుంధతి కోపం మిన్నంటింది.

"నీకే. . .నువ్వెన్నైనా చెపుతావ్. అతనలా వెంబడిస్తూంటె నా కెంత సిగ్గుగావుందో తెలుసా ?"

"నన్నడిగితే నీయంత అదృష్టవంతులు మరెవ్వరూలేరు. మేమూ వున్నాం దండక్కి. ఒహళ్ళా మమ్మల్ని ఇంటివరకూ సాగనంపటానికి రారాయె. మా ఖర్మంకాపోతే మాకంత అదృష్టం గూడానా ? హయ్యోరామ — పాపమతను, హాయిగా ఎంచక్కా నిన్ను ఇంటివరకూ వచ్చి దిగబెడుతూంటె యింకా దిగులెందుకే అరూ" ప్రభావతి వున్నమాట అనేసింది.

"చాల్లే ఊరుకో" అరుంధతి కళ్ళు రెండూ ఎఱ్ఱపడ్డాయి.

"అయితే యిప్పుడేం చేద్దామంటావే" విమల అడిగింది.

"బుద్ధిచెప్పాలి. తగిన శాస్తి జరగాలి" అరుంధతి అగ్గిబరాటైపోయింది.

"అయితే మనం రెడీ" కుసుమ అందుకుంది.

"అంత తేలిక్కాదు. నిదానంగా చంపాలి" విమల సలహా యిచ్చింది.

"ఇవ్వాళే నాంది జరగాలి" అరుంధతి ఆర్డరేసింది.

అంతా ఏకగ్రీవంగా వప్పేసుకున్నారు. ఇప్పుడు అరుంధతి మనసు ఆనందంతో నిండిపోయింది. అందరూ లైబ్రరీకి బయల్దేరారు.

లైబ్రరీలో అడుగు పెట్టారో లేదో—ఒక మూలగా వంటరిగా ఏదో పుస్తకం చదువుకుంటూన్న కళ్ళజోడబ్బాయి కనుపించాడు. ఎవ రెవరు ఎలా మాటాడాలో నిర్ణయించుకుని కార్యారంభానికి పూనుకున్నారు చేతుల్లో పుస్తకాలుంచుకుని.

"ఏమె అరూ—మీ బాడీగార్డుకి జీతమెంత?" కుసుమ తనపోర్షను ప్రారంభించింది.

"వేరే జీతమెందుకే—అందమైన అమ్మాయిని వెంబడించటమే మహాభాగ్యమనుకుంటూంటే"

(44-వ పేజీ చూడండి)

# బ్రహ్మానందశర్మ

(28 వ పేజీ తరువాయి)

ఈ సంభాషణ వింటున్న గుమాస్తాలందరికీ "ఈ క్రొత్త హెడ్‌క్లార్కుగారికి పిచ్చిపట్టినట్లున్నది అనితోచింది. అందరి ముఖాలలో ఆశ్చర్యం స్పష్టంగా కన్పిస్తున్నది. వీరిలో గోపాలరావు త్వరగా తేరుకొని "సుబ్బయ్యా! వారి దగ్గర డబ్బు తీసికోవద్దు. క్రొత్తగా వచ్చిన వాళ్ళకు మనం కాఫీ యిప్పించాలిగాని, ఆయన మన కిప్పించటం ఏమిటి. ఇదిగో! దీన్ని పట్టుకెళ్ళి కాఫీలు తీసికొనిరా!" అంటూ గోపాలరావు పర్సుతీసి అయిదు రూపాయల నోటును సుబ్బయ్యకు అందివ్వబోయినాడు.

"గోపాలరావు! నువ్వు కుర్రవాడివి. యింకా ఫస్టు తారీఖు పది హేనురోజులుంది. ఎన్నెన్ని మంచి సినిమాలు వస్తయ్యో! ఈ డబ్బు ఒక సినిమాకు పెట్టుకెళ్తుందిగాని దాచిపెట్టు" అని గోపాలరావుతోచెప్పి సుబ్బయ్యనుచూసి "సుబ్బయ్యా! త్వరగా పోయిరా! మళ్ళీ యింజనీరుగారు వస్తే వీలు పడదా" అని పది రూపాయల నోటును సుబ్బయ్య చేతిలో కుక్కాడు.

* * *

లంచ్ బ్రేక్‌లో గుమాస్తాల చెట్టుక్రింద సమావేశము ఆఫీసు దైనందిన కార్యక్రమాలలో ఒకటి. ఆనాటి సమావేశంలో జరిగిన చర్చ క్రొత్త హెడ్ గుమాస్తా గారిని గురించే. ఆయన ఎంత మర్యాదగా, ఆప్యాయతగా మాట్లాడేది, ఆయన తన సబార్డినేట్సుంటే ఎంత ప్రేమగా ఉంటారు—లేకపోతే కాఫీలు తీసికొచ్చిన హోటలు కుర్రవాడికి 4 అణాలు ఎవరిస్తారు—అంటూ అందరూ ఆయననుగురించి పొగడ్తతో మాట్లాడారు.

సాయంకాలం అయిదు గంటలయింది కాని ఏ గుమాస్తా కూడా ఆఫీసు వదిలివెళ్ళే ప్రయత్నంలోలేడు. అప్పుడే ఆఫీసు ప్రారంభం అయిందన్నట్లుగా అందరూ జాగ్రత్తగా పని చేస్తున్నారు. శర్మగారు మాత్రం తన బల్లపైవున్న ఫైళ్ళనన్నింటిని సర్దుకొని వెళ్ళటానికి సిద్ధంగా వున్నారు. యితరులదృష్టి తన వైపు త్రిప్పుకొనేందుకు ప్రయత్నిస్తూ, ఒక పర్యాయము దగ్గారు. అప్పటికీ ఏ తలా ఫైల్సులోనుంచి బయట పడలేదు యింక తప్పదు అనుకొని "అబ్బాయ్! గోపాలరావు! నీకు పెళ్ళి అయిందా" అందరికీ వినపడేలాగున అడిగారు బ్రహ్మానందంగారు

అనుకోకుండా అకస్మాత్తుగా వచ్చిన ఆ ప్రశ్నకు గోపాలరావు కొంత తడబడపడ్డాడు. కాని వెంటనే సిగ్గుపడుతూ "యింకా లేదండీ" అన్నాడు.

"అయితే ఖర్మంజాలక ఈ ఆఫీసునే పెళ్ళాంవుగదా! అయిదుగంటలయినా మీలో ఏ ఒక్కరూ కదలరేం! ఆఫీసులోనే ఉండిపోదామని అనుకొంటున్నారా ఏం!" హెచ్చరించారు బ్రహ్మానందం గారు ఈయన ప్రవర్తన మిగిలినవా రందరికీ రాను రాను మరీ అగమ్యగోచరంగావుంది. గోపాలరావే కొంచెం సాహసించి "యిప్పటివరకు మాలో ఎవ్వరమూ ఏడు గంటలకు ముందుగా ఏ పరిస్థితులలోను ఆఫీసు విడచిన పాపానపోలేదు. ఏడు గంటలకు బయలుదేరుతే ఆరోజు పెందలకడనే బయలుదేరినట్లు" అన్నాడు.

"ఎంచేత!"

"యింజనీరుగారు క్యాంపులోవున్న మూడు, నాలుగు రోజులు చూచి సంతకాలు పెట్టేటప్పటికి ఏడు గంటలవుతుంది. ఇంజినీరుగారు యింటికి వెళ్ళేటప్పటికి ఏడున్నర అవుతుంది. ఆయన వెళ్ళందే హెడ్‌క్లార్కుగారు బయలుదేరరు. వీళ్ళిద్దరూ వెళ్ళనిదే మేమెవ్వరం బయలుదేరినా పాత హెడ్‌క్లార్కుగారు ఊరుకోలేదు. ఏ సమయంలో ఏ గుమాస్తాతో పనుంటుందోనని, లేకపోతే యిబ్బంది అవుతుందని అందరిని ఉండమనేవారు"

---

ముగ్గురు ప్రొఫెసర్లు రైల్వే స్టేషనులో ప్లాట్‌ఫారం మీద దీర్ఘసంభాషణలో ఉన్నారు. విజిల్ వినిపించేవఱకూ రైలు వచ్చినట్లే తెలియలేదు వాళ్ళకు. గార్డు పచ్చజెండా ఊపేసు, ముగ్గురూ గబగబా రైలు ఎక్కటానికి పరిగెత్తేరు. ఇద్దరు ఎక్కగలిగేరు. మూడవ ప్రొఫెసరు ఎక్కలేకపోయాడు. ఇది చూచిన ఒక పెద్దమనిషి "మొత్తంమీద వాళ్లిద్దరైనా ఎక్కగలిగేరులెండి" అన్నాడు. అప్పుడు ప్రొఫెసరు ఆ పెద్దమనిషితో ... "అవును. కాని వాళ్లు నాకు వీడ్కోలు యివ్వడానికి మాత్రమే స్టేషనుకు వచ్చారు!

ఎమ్. ఎస్. రావు (మద్రాసు)

---

"అబ్బాయిలూ! నాదగ్గ రవేమీ పనికిరావు. అయిదుగంటలవరకూ జీతం కరెక్టుగా యిస్తున్నారుగాబట్టి ఒళ్ళు వంచుకుని శ్రద్ధగా పనిచేయండి. అయిదు అయినతరువాత, మరీ అవసరం వచ్చి నేనుగాని, యింజినీరుగాని ఉండమంటేతప్ప మీరందరూ నిరభ్యంతరంగా వెళ్ళవచ్చు. మీరు వ్రాసిన కాగితము లన్నింటిని నేను చెక్ చేసిం తరువాతనేగదా పంపిస్తున్నాను. అవసరమైతే నేనుంటానులే! అర్జంటు కాగితాలు యింజినీరు గారింటికి పంపుతే వారు తీరికగా చూచుకొని సంతకాలు పెడ్తారు. వారికీ బాధవుండదు. మనకూ యిబ్బంది కలుగదు. యిప్పుడే చెప్తున్నాను. జ్ఞాపకముంచుకోండి. అయిదింటివరకూ శ్రద్ధగా పనిచేయటం, అయిదు గంటలు కొట్టేసరికి యింటికి బయలుదేరటం.

ఆరోజు యింజినీరుగారు క్యాంపుకువెళ్ళే ప్రయత్నంలో ఆఫీసునుండి నాలుగు గంటలకు వెళ్ళారు కాబట్టి తనుగూడా అందరితోపాటు బయలుదేరాడు. మిగిలిన గుమాస్తా లందరికీ సెలవుకాని రోజులలో సూర్యాస్తమయం చూచుకొనే భాగ్యం కలిగింది ఆనాడే.

మెల్లగా అందరూ కాంపౌండు దాటింతరువాత క్రొత్త హెడ్ గుమాస్తాగారి సెలవు పుచ్చుకొని తమతమ యిండ్లకు బయలుదేరారు బ్రహ్మానంద శర్మగారికి సదుపాయములన్నీ వున్నవో లేవో కనుక్కొనవలసిన బాధ్యత తనయందున్నట్లు భావించసాగాడు గోపాలరావు త్వరపడి తనగదికి వెళ్ళవలసిన పనిగూడా ఏమీలేదు. అంచేత "మరి మీరిపుడు ఎక్కడ ఉంటున్నారు. యిల్లు దొరికిందా?" అడిగాడు గోపాలరావు.

"అప్పుడేనా! నేను ఈరోజే ఉదయం ఆరు గంటల బండికి దిగాను. హోటల్‌లో రూము తీసికొని స్నానం అదీ చేసి ఆఫీసుకు వచ్చాను. యింకమీదట యిల్లు వెతకటం ప్రారంభించాలి"

"అయితే నా రూముకు దగ్గర్లోనే ఒక మంచి యిల్లు వున్నదండీ! లైటు, కుళాయి అన్నీ వున్నయ్. కానీ ముప్పైఎనిమిది రూపాయలు చెప్తున్నారు.

"పోనీయవోయ్! ముప్ఫైఎనిమిది గాకపోతే నలభై రూపాయలు తీసికోనివ్వు! యిల్లు వసతిగా వుంటే చాలు. యిల్లు గనుక వసతిగా లేకపోతే గయ్యాళి పెళ్ళాంతోపడే బాధ పడాలి. అయితే యిప్పుడే వెళ్ళి స్థిరపరుచుకొందాం. శుభస్యశీఘ్రం.

* * *

గుంటూరు వచ్చిన వారంరోజులలోపలనే గోపాలరావు సహాయంతో బ్రహ్మానందంగారు యిల్లు కుదుర్చుకోవటము, భార్య పార్వతమ్మగారిని, ముగ్గురు పిల్లలను (కృష్ణారావు, గోవిందరావు, సుబ్బారావు) తీసుకురావటం, కాపురపుబండి గాడిలో పడటం అన్నీ జరిగినయ్.

ఆరోజు ఆదివారం. బ్రహ్మానందశర్మగారి పుణ్యమా అని ఆదివారానికి మిగిలిన ఆరురోజులకు భేదం ఏర్పడింది. గోపాలరావు, ఆఫీసులోని మరిద్దరు గుమాస్తాలు కలసి బ్రహ్మానందశర్మగారింటికి వచ్చారు. ఈ వారంరోజులలోనే శర్మగారు మిగిలిన గుమాస్తాలలో ఒకడైనాడు. మిగిలినవాళ్ళు కూడా మొదటి రెండు మూడు రోజులు ఈయన హెడ్ గుమాస్తాకదా ఆయనతోటి మనకెందుకులే, దూరంగానేవుంటే మంచిదనుకొని తప్పుకు తిరిగారు. కాని 3, 4 రోజులలో ఆయన కలుపుకోలుతనాన్నిబట్టి వాళ్ళుగూడా చనువుగా మెలగటం మొదలుపెట్టారు.

గోపాలరావు వాళ్ళు వచ్చేటప్పటికి బ్రహ్మానందంగారు వాకిట్లో పంచలో పడకకుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటున్నారు.

"నమస్కారమండీ" అంటూ ఆవచ్చిన ముగ్గురూ వాకిలి మెట్లెక్కుతున్నారు.

"రండి! రండి! ఏం దారితప్పిరాలేదుగదా! ఒరేయ్ కృష్ణా! ఆ కుర్చీలు యిక్కడవేసి వెళ్ళరా!" కేకవేశారు బ్రహ్మానందశర్మగారు.

# బ్రహ్మానందశర్మ

కృష్ణారావు కుర్చీలు పంచలో వేస్తుండగా "వీడేనండి. మాపెద్దవాడు కృష్ణారావు. థర్డ్ఫారం ప్యాసయినాడు. యీ ఏడు యిక్కడేదైనా మంచి స్కూలు చూసి చేర్పించాలి"

నలుగురూ కలసి పదకుండు గంటలవరకూ లోకాభిరామాయణపారాయణం సాగించారు. మధ్యలో ఒక పర్యాయం నలుగురికి యింట్లోనుండి బ్రహ్మానందశర్మగారు కాఫీ తెప్పించారు. వచ్చిన ముగ్గురూ యిండ్లకు తిరిగివెళ్ళే ప్రయత్నంలో లేచి "వెళ్ళొస్తామండీ" అన్నారు.

"పదకొండుగంటలు దాటిందిగదా! లక్షణంగా భోంచేసి, కొంచెముసేపు విశ్రాంతి తీసికొని చల్లపడిన తరువాత వెళ్ళవచ్చుగా! ఉండండి! యిప్పుడే వస్తాను" అంటూ యింటిలోపలికి వెళ్ళబోయినారు.

"అరెరె! యిప్పుడు భోజనాలు ప్రమేయం పెట్టకండి! యింట్లో ఆడవాళ్ళు భోజనం చెయ్యకుండా కూర్చుంటారు."

"ఆ విషయం నాకు తెలియదు బాబూ. (నవ్వుతూ) మిమ్ముల్ని భోజనాలకు ఉంచకపోతే మా ఆవిడ చీపురుకట్ట తీసికొని పూజ చేస్తుంది. మీరు వెళ్ళాలంటే ఆవిడ పర్మిషను తీసికొనవలసిందే!" యింటి లోపలివైపు తిరిగి "ఏమేవ్" అని కేక వేశారు. కృష్ణారావు వచ్చి "ఏమిటి నాన్నా! ఏం కావాలి" అని అడిగాడు.

"ఒరే కృష్ణా! మీ అమ్మను ఒకసారి పిలు"

పార్వతమ్మగారు రావటాన్ని చూచి "ఏమేవ్! ఆయన వెంకటేశ్వరరావుగారు. ఈయన ముకుందరావుగారు సరే గోపాలరావు తెలిసినవాడేగదా! మేమందరం పి. డబ్ల్యు. డి. కుటుంబానికి చెందినవాళ్ళమే!" అని పరిచయంచేశారు.

"నమస్కారమండీ" అంటూ వెంకటేశ్వర్లు, ముకుందం చేతులెత్తి పార్వతమ్మగారికి నమస్కరించారు.

"ఏం! బాబూ! మేం వచ్చి పదిరోజులైంది గదా! యిప్పటివరకూ ఒక్కసారైనా రాలేదేం" వెంకటేశ్వర్లనుచూసి "నాయనా, పెండ్లయిందా నీకు"

"అయిందండీ"

"నీకు బాబు" ముకుందరావును చూసి అడిగారు పార్వతమ్మ.

"నాకూ అయిందండీ"

"అబ్బాయిలూ! యిప్పుడే చెప్తున్నాను. తర్వాత అనుకొంటే లాభంలేదు. మీరు అమ్మాయిలను పిల్లలతోసహా వచ్చే ఆదివారంలోపల తీసికొచ్చి భోంచేసివెళ్ళేసరేసరి. లేకపోతే ఏం జరుగుతుందో చూచుకోండి. ఈ పార్వతమ్మసంగతి తెలియదు కాబోలు. అంతంతమాత్రంతో వదలిపెట్టదు" అందరూ ఆమె కలుపుగోలుమాటలకు నవ్వుకున్నారు

మొత్తంమీద ఎలాగైతేనేం ముకుందం, వెంకటేశ్వర్లు ఆరోజు భోజనం చేయకనే వెళ్ళుటకు పార్వతమ్మగారివద్ద పర్మిషను పొందగలిగారు. ముకుందం, వెంకటేశ్వర్లతో గోపాలరావుకూడా బయలుదేరాడు.

"నువ్వెక్కడికి గోపాలం" గట్టిగా మందలించే స్వరంతో అన్నది పార్వతమ్మ.

"యింటికండి"

"నీకొరకు అక్కడ ఎవ్వరు కాచుకుని ఉండరుగాని భోంచేసివెళ్ళు. వాళ్ళంటే, వాళ్ళకొరకు ఎదురు చూస్తుండే వాళ్ళున్నారు. లేకపోతే వాళ్ళను మాత్రం కదలనిస్తానా."

"ఎందుకండీ! హోటలు దగ్గరేగా! మరెప్పుడైనా భోంచేస్తాలెండి"

"అదేం కుదరదు (వెంకటేశ్వర్లు, ముకుందాన్ని చూసి) అబ్బాయిలూ మీరైనా చెప్పగూడదూ హొటళ్ళలో ఆ చప్పిడి కూడు తిని అర్ధాకలితో వుండి ఆరోగ్యం చెడగొట్టుకోకపోతే లక్షణంగా మా పిల్లలతోటిపాటే మేంతినే పచ్చడి మెతుకులే తినకూడదూ!"

"కొంపతీసి మకాం యిక్కడికే మార్చమనేరు !"

"మారుస్తే ఏం! మాకు ఏ యిబ్బంది లేదు. మాతోనే వుందువుగాని. నువ్వు భయపడవలసిన పనిలేదు. మాకు ఆడపిల్లలు ఎవరూ లేరులే! కట్నంలేకుండా పెళ్ళిచెయ్యవచ్చుగదా అని మంచి చేసుకుంటున్నామని అనుకొంటావేమో! ఉన్న ముగ్గురూ మగపిల్లలే" అంటూ పార్వతమ్మ 'ఆర్డరును' బ్రహ్మానందశర్మగారు అప్రూవ్చేసి కన్ఫరమ్ చేశారు.

"ఒరే! గోపాలం! వారు అంతగా చెప్తున్నప్పుడు పోయి భోంచెయ్యరా! మేం యిద్దరం వున్నాంగా. వెళ్తాం" అని ముకుందం చెప్పి వెంకటేశ్వర్లు తనూ కలసి తమ యిండ్లకు బయలుదేరారు.

గోపాలరావు నెలరోజులకుపైగా వారింట్లోనే భోజనంచేస్తున్నాడు. ఆరోజు జీతం వచ్చింది. తను బ్రహ్మానందంగారింట్లోనే వారి వూరిలో ఉన్నంతకాలం తినకతప్పదు. ఎంతో మర్యాదగా, ఆప్యాయంగా పార్వతమ్మగారు భోజనం పెట్తున్నది. ఒకపూట ఒక ముద్ద తక్కువతింటే ఊరుకోదు. ఇప్పుడు తన ఆరోగ్యంకూడా మునుపటికంటే చాలా బాగున్నదికూడాను. తను డబ్బుగాగాని, వస్తురూపేణగాని వారికి ముట్టచెప్పకపోతే మర్యాదగా ఉండదు. ముప్ఫైఅయిదు రూపాయలే యిస్తే యిదేం పూటకూళ్ళయిల్లా అని అనుకొంటారేమో! నిజంగా నలభై రూపాయలు యిచ్చినా దండుగలేదు అని అనుకొని ఆ రాత్రి భోంచేసిన తర్వాత పార్వతమ్మగారు వద్దని చెప్తున్నా వినకుండా నాలుగు పదిరూపాయల నోట్లు బల్లపైపెట్టి వచ్చాడు.

* * *

ఒకరోజు మధ్యాహ్నం కంట్రాక్టరు వెంకటరత్నం అరవైవేల రూపాయల క్రొత్త కంట్రాక్టు తనకు యిప్పించే ఏర్పాటు చేయమని బ్రహ్మానందంగారిని కోరాడు.

"చూడండి వెంకటరత్నంగారు! నిజం చెప్తున్నాను. నేను మిమ్ముల్నుగురించిన పాత రికార్డంతా చదివాను. మీరే ఈ కంట్రాక్టుకు అర్హులనే నిశ్చయానికి వచ్చాను. అందుచేతనే నా శక్తి వంచన లేకుండా యిది మీకే వచ్చేటట్లు ప్రయత్నించిచూస్తానని చెప్పాను. తరువాత భగవంతుని

యి. మీ అదృష్టం" చెప్పారు బ్రహ్మానందం గారు.

"మీరు నా కీ సహాయంచేస్తే మీ మేలు జన్మలో మర్చిపోలేను" అని చెప్పి, ఆఫీసు హాలంతా ఒకసారి చూశాడు వెంకటరత్నం. లంచ్ టైము కావటం వలన గుమాస్తాలందరూ సమావేశంలో వున్నారు. ఎవరూ చూడటములేదన్న విషయం గ్రహించి, కంట్రాక్టరు వెంకటరత్నం అంతకుముందే లెక్కపెట్టిఉంచిన పది పదిరూపాయలనోట్ల బొత్తిని జేబులోనుంచితీసి బ్రహ్మానందంగారికి యిస్తూ, "ప్రస్తుతం యిది అట్టేపెట్టండి. మరల రెండు మూడు రోజులలో మీ యింటికివచ్చి కన్పించుతాను"

బ్రహ్మానందంగారిలో ఎటువంటి చలనము కలుగలేదు. తీసికొనే ప్రయత్నంలో ఏ మాత్రము లేదు

"వెంకటరత్నంగారూ! మీరు నావిషయంలో పొరపాటుపడ్డారు. నేను మీకు నా చేతనయినంత సహాయ్యం చేస్తానన్నది మీ వద్దనుండి ప్రతిఫలం ఆశించిగాదు. మీరు నాకు ఈవిధంగా డబ్బివ్వటానికి ప్రయత్నించటం మీ తప్పని నేను చెప్పను. బహుశా మీ అనుభవంలో డబ్బివ్వనిదే మీ పనులు ఎవరూ చేసిఉండకపోవచ్చు. క్షమించు మీడబ్బు మీవద్దనే దాచండి" అని మామూలు ధోరణిలోనే చెప్పుకుపోయినాడు. వెంకటరత్నం ముఖంలో ఆశ్చర్యము, పనిచేయకుండా పోతాడేమోనన్న ఆందోళన స్పష్టంగా కన్పిస్తున్నయ్.

ఇంతలో గుమాస్తాలు ఒక్కరొక్కరేవచ్చి తమ సీట్లవద్దకు వెళ్తున్నారు. బ్రహ్మానందం గారు తన గొంతుస్థాయి ఏ మాత్రం తగ్గించకుండానే చిరునవ్వుతో "వెంకటరత్నంగారూ! యిప్పుడు మీరు చేసిన పనికి శిక్ష అనుభవించక తప్పదు" అన్నాడు.

వెంకటరత్నం ముఖంలో కత్తివేటు వేసినా నెత్తురుచుక్క రానట్లున్నది. గుమ్మడికాయల దొంగ భుజములు తడుముకున్నట్లు కొంపదీసి లంచం యివ్వబోతున్నానని పోలీసు రిపోర్టు యివ్వడుగదా! కంట్రాక్టువస్తే వస్తుంది. పోతే పోతుంది. కోర్టుచుట్టూ ప్లీడర్లకాళ్ళు పట్టుకొని తిరుగకుండా వుంటేచాలు అనుకొంటూ ఏమిటి అన్నట్లు బ్రహ్మానందంగారివైపు చూశాడు.

"మీరు యీరోజు రాత్రి భోజనానికి ఎన్ని పనులున్నా మా యింటికి వచ్చితీరాలి. తప్పు చేసిన దానికి శిక్ష అనుభవించాలిగా మరి!" ఈ మాటలు వినేసరికి వెంకటరత్నానికి పెద్ద బరువు తలమీద నుండి దింపినట్లయింది. గుమాస్తాలకు మాత్రం బ్రహ్మానందంగారు యిలాంటి పనులు చేయటం వాళ్ళకు బాగా తెలిసిన విషయమే! వారి దృష్టిలో ఆయనయందు గౌరవం ఇంకొక డిగ్రీ పెరిగింది గాని తరగలేదు.

"మీ రిచ్చిన శిక్ష ఆనందంతో అనుభవిస్తాను. అయితే రాత్రి 7—30 గంటలకు మీయింటికి వస్తానండి" అని బ్రహ్మానందంగారివద్ద సెలవు తీసుకొని వెళ్ళాడు కంట్రాక్టరు వెంకటరత్నం.

* * *

వెంకటరత్నం, బ్రహ్మానందశర్మగారు భోజనాలకు కూర్చున్నారు. విస్తళ్ళలో కూరలు, పచ్చళ్ళు, వేసి అన్నం వడ్డించుతూ "అన్నయ్యగారు ముఖమాటపడి అర్థాకలిగా లేంచేస్తే ఆ పాపం నాకు చుట్టుకుంటుంది. ఆడదానికి అనవసరంగా ఆపత్తు తెచ్చినందుకు మీకూ పాపం వస్తుంది. కాబట్టి కావలసినవి అడిగి వేయించుకు తినండి" ఎంతో కలుపుగోలు తనంగానూ, ఎన్నాళ్ళనుండో స్నేహితులుగాను మాట్లాడుతున్నది పార్వతమ్మ మజ్జిగ అన్నం తినటానికి వచ్చేలోపల వెంకటరత్నం కుటుంబ విషయములన్నీ అడిగి తెలిసికొన్నది పార్వతమ్మ మజ్జిగపోసివచ్చి గోడకు ఆనుకుని నిలబడి "అన్నయ్యగారూ! మీరు ధాన్యం ఎవరికైనా అమ్మవలసిందేగా! అందరికీ యిచ్చిన ధరకే మాకూ యివ్వండి. ఒకేపర్యాయం ధాన్యం కొనుక్కొంటే ఫర్వాలేదు గాని, రోజు రోజూ డబ్బిచ్చి బియ్యం కొనాలంటే చాలా కష్టంగా వుంటుంది. చేతిలో డబ్బు వున్న వేళా ఉంటుంది. లేనివేళా ఉంటుంది. అప్పుడు యిబ్బందేగా మరి" అని పార్వతమ్మ మనస్సులో ఉన్నది బయటపెట్టింది.

"డబ్బుసంగతి తర్వాత చూసుకోవచ్చును లేమ్మా. యింతకూ మీకెన్ని బస్తాలు కావలసి వస్తయ్"

"ఎన్నో ఎందుకు అన్నయ్యా! మాకు పది బస్తాలుంటే యీ ఏడాది దిగులు లేకుండా గడుస్తుంది. ఇంతకూ ధర ఎలా వున్నది"

"ధరలసంగతి తర్వాత ఆలోచిద్దాం అని చెప్పాను గదమ్మా. రేపు సాయంకాలానికి యింటికి వెళ్తాను. ఎల్లుండి సాయంకాలానికి మా పాలేరు చేత పదిబస్తాల ధాన్యం బండిమీద వేయించి పంపుతాను"

"అన్నయ్యగారూ! మీరు డబ్బు తీసికోనంటే మాత్రం మాకు ఒక్క వడ్లగింజగూడా అక్కర్లేదు. మా తిప్పలు మేం పడతాం."

బ్రహ్మానందంగారు, యీ విషయం హోం డిపార్టుమెంటుకు సంబంధించింది గాబట్టి హోం మినిస్ట్రీకి వదలి మౌనం వహించారు.

వెంకటరత్నం మాటిచ్చినప్రకారం మూడో నాటికి పదిబస్తాల ధాన్యం పాలేరుచేత పంపించాడు బ్రహ్మానందంగారితో తనకు పని వున్నదిగా మరి. బస్తా ముప్ఫై రూపాయల చొప్పున పది బస్తాలు మూడు వందల రూపాయలు అవుతయ్. తను ఎలాగూ రెండు వందలఏభై రూపాయలు యివ్వదలచుకున్నాడాయెను. కాకపోతే యింకొక ఏభై రూపాయలు ఎక్కువ యివ్వవలసి వచ్చింది. పోనీలే ఈ ఏభై రూపాయలకు ముఖమాటమనేది ఉండకుండా పోదుగదా! అని వెంకటరత్నం వ్యాపార రీతిలో ఊహించి తృప్తిపడ్డాడు.

మరో పదిరోజులలోగానే వెంకటరత్నానికి ఆ కంట్రాక్టు వచ్చేటట్లు చేశారు బ్రహ్మానందం గారు. ఎప్పటిలాగునే ఆప్యాయతతో మాట్లాడుతున్నారు. కాని ధాన్యపుడబ్బు విషయం బ్రహ్మానందంగారు హెచ్చరించనూలేదు. ఈయన అడగనూలేదు.

గోపాలరావును మొట్టమొదటలో ఏదో సందేహం వచ్చిందని పిల్లలు తమ సందేహాలను గోపాలరావుకు రెఫర్ చేశారు. రానురాను గోపాలరావు బ్రహ్మానందంగారి పిల్లలకు పాఠములు చెప్పటం రోజూ కార్యక్రమాలలో ఒకటైంది. గోపాలరావు గాని, మరెవ్వరైనా చూచినవాళ్ళుగాని అలా పాఠం




మీరు అదృష్టవంతులుసార్! యివ్వాళ కాఫీలో చీమలుపడ్డాయ్!...నిన్న బొద్దింకలే పడేవుంటే!...?

చిత్రం: ఎగ్గోని శ్యామసుందర్ (గుత్తి)

చెప్పటం ప్రైవేటుచెప్తున్నట్లుగా భావించలేక పోతున్నారుగాని, బ్రహ్మానందంగారి పిల్లలకు మాత్రం ప్రైవేటుమాష్టరు అవసరంలేకుండా పోయింది.

బ్రహ్మానందంగారు గుంటూరు వచ్చిన కొద్ది రోజులలోనే శనివారంనాటి రాత్రులందు పది గంటలవరకు ఆంజనేయస్వామి భజనలు తన యింటి వద్దనే ప్రారంభించారు. ఆనాడు తన ఖర్చుమీదనే వడపప్పు పానకం చేయించి దేవునికి నైవేద్యము పెట్టేవాడు. వచ్చినవారు అచ్చట స్తంభమునకు కట్టిన "ఉండీ"లో తలకొక కానీయో, అర్ధ ణాయో వేసేవారు. ఎంత తక్కువ వచ్చినా కనీసము అయిదారు రూపాయలు అయినా ప్రోగయ్యేవి.

ఆయన దైవభక్తి, మంచితనము ఆఫీసులోనే గాక, తనుంటున్న వీధిలోనూ, క్రమేణ ఆ పేట అంతా ప్రాకింది. ఎవరిని అడిగినా బ్రహ్మానందం గారుగానీ, పార్వతమ్మగారుగానీ ఎంత మంచివారమ్మా అంటూ కనీసం అయిదు నిముషాలన్నా పొగిడేవారు.

ఇంతలో శ్రీరామనవమిరోజు దగ్గరకు వస్తున్నది. ఇంకా పదిహేను రోజులుండగానే తన యింటిముందు పెద్ద పందిరివేసి శ్రీరామనవమి ఆర్భాటంగా చేయాలని నిశ్చయించుకొన్నానని ఒకరోజురాత్రి భోజనాలవద్ద గోపాలరావుతో చెప్పారు బ్రహ్మానందంగారు. గోపాలరావు ఈవిషయం మరునాడు మిగతా గుమాస్తాలతో చెప్పాడు. వారంతా బ్రహ్మానందంగారు పూనుకొనినపని జయప్రదంగా చేయుటంకొరకు, బ్రహ్మానందం గారుంటున్న పేటలో చందాలు వసూలుచేసి ఆ రోజున బీదలకు అన్నదానంగూడా చేయా లనుకొన్నారు. ఈ విషయం బ్రహ్మానందంగారితో ముందుగానే చెప్తే వద్దంటారేమోనని వారికి తెలియనీయకుండగనే ఒక ఆదివారంనాడు యిద్దరిద్దరు చొప్పున పేటలోవున్న వీధులన్నీ తిరిగి వచ్చారు. సాయంకాలమయ్యేసరికి అందరూ తెచ్చి నవి ప్రోగు జేయగా పాతిక బస్తాల బియ్యమూ, నాలుగు వందల రూపాయల రొఖ్ఖమూ తేలింది.

# బ్రహ్మానందశర్మ

వీటన్నిటిని తీసికొచ్చి బ్రహ్మానందంగారికి యివ్వ బోగా వారికి కోపమువచ్చి.

"గోపాలరావు! యిదంతా నీ ప్రోద్బలమను కొంటాను. ఇవన్నీ లేకపోతే మనం శ్రీరామనవమి చేసికోలేమా! లేకపోతే దేవుడు ఊరుకోడా!" అన్నాడు. గోపాలరావు చిన్నబుచ్చుకొన్న ముఖంచూసి "నేనంటున్నానని బాధపడకు. నీవు యింకా కుర్ర వాడివి! లోకంసంగతి నీకు తెలియదు. ఒక్క విషయం మాత్రం జ్ఞాపకముంచుకో. పదిమంది సొమ్ము కలిపివాడేటప్పుడు మనం ఎంత సదుద్దేశ్యంతో మంచిగా, న్యాయంగా, ఖర్చుపెట్టినా ఎవరో ఒకరు తప్పుమాట అంటూరు. అది లోక సహజం. కాబట్టి మనం మనకు వీలైన దానితోనే చేయాలిగాని యితరులవద్దనుండి ఆశించగూడదు. తీసికోరాదు" అని గ్రుక్క త్రిప్పకుండ చెప్పారు. గోపాలరావు ఏమీ మాట్లాడలేకపోయినాడు. ఇది గమనించి ముకుందరావు కలుగజేసికొని "యిందులో గోపాలరావు తప్పేమీలేదండి. మేమందరం కలసి మాట్లాడుకునే ఈ పని చేశాం. అయినా మీలో ఎవరు తప్పులు పడ్తారండీ" అన్నాడు.

"అలా అనకు ముకుందరావు. నాకు మంచిది, అవసరం అని తోచింది నేను చేశాననుకో. అది నీకు అనవసరం అని తోస్తే నేను ప్రజలసొమ్ము పాడు చేస్తున్నానని అనుకోవచ్చుగా నువ్వు. అందుకనే ఈ గొడవలన్నీ పెట్టుకోగూడదంటాను."

"మీరు చెప్పినమాట నిజమేననుకోండి. అయినా ఈ దేవునికార్యంలో మీయందు ఎవ్వరూ తప్పు పట్టించుకోరు" అని హామీ యిచ్చాడు ముకుందరావు. మిగిలినవారుగూడా ముకుందం చెప్పినదానిని సమర్థిస్తూ ఎలాగైతేనేం బ్రహ్మానందంగారిచేత ఆ బియ్యము, పైకము తీసికునేందుకు ఒప్పించారు.

శ్రీరామనవమిరోజు వచ్చింది. భగవంతుని పెళ్ళికి అందరూ పెద్దలే. గుమాస్తాలందరూ మనిషికొకపని చక్కపెడ్తున్నారు. పార్వతమ్మ విషయం చెప్పనే అఖ్ఖరలేదు. ఒక్క నిముషంపాటుగూడా ఆమె నోరుగాని, కాళ్ళుగాని ఊరికెనే ఉండడంలేదు. తన యింట్లో పెళ్ళికంటె ఎక్కువ జాగ్రత్తతో పనులన్నీ చూసుకొంటోంది. ఆరోజు పెళ్ళిపీటల మీద బ్రహ్మానందంగారు, పార్వతమ్మగారు కూర్చున్నారు. ఆ పేటలోనివారంతా బ్రహ్మానందం గారింట్లో పెళ్ళిలాగునే అందరు చదివింపులప్పుడు తలా ఒక రూపాయి, రెండు రూపాయలు చదివించటం మొదలుపెట్టారు. అందులో కొంతమంది ఒక చీరె, రవికగుడ్డగానీ, లేకపోతే బ్రహ్మానందం గారికి ధోవతులుగాని తీసుకుని వచ్చారు. పెళ్ళి పీటలమీదనుంచి లేచి కొంచెం విశ్రాంతిగా వున్నప్పుడు వచ్చినవారిలో ముఖ్యులనుకొన్నవారందరికీ నాలుగురోజుల క్రితం వచ్చిన మద్రాసులో ఆడిటర్‌గా వుంటున్న, తన బావమరది మోహనరావును అందరికీ పరిచయంచేస్తూ, యింక మీదట మోహనరావు గుంటూరులోనే ఆడిటర్‌గా ప్రాక్టీస్ చేయబోతున్నాడని పరిచయంచేశాడు.

ఆరోజు శ్రీరామనవమి కార్యక్రమమంతా ముగిసేసరికి రాత్రి రెండుగంటలు దాటింది. వచ్చిన వాళ్ళందరూ వెళ్ళిపోయినారు. పార్వతమ్మగారు చదివింపుసమయంలో వచ్చిన గుడ్డలు పెట్టెలో జాగ్రత్తపరుస్తూ, ఎన్ని వచ్చినవో లెఖ్ఖపెట్టింది. మొత్తముమీద 16 చీరెలు, 22 రవికగుడ్డలు, 14 ధోవతులు, 7 ఉత్తరీయములు, 394 రూపాయల రొఖ్ఖం వచ్చింది. ఈ ఏడాదికి తనకుగాని, తన భర్తకుగాని గుడ్డలు కొనవలసిన అవసరం లేదుగదా అని సంతోషపడినది.

బ్రహ్మానందంగారు గుంటూరు వచ్చిన రెండు మూడు నెలలలోనే పరిచయస్తులందరికీ నిజంగా ఏ ఆస్తిపాస్తులు లేకపోయినా, కాస్తో కూస్తో ఆస్తిపరుడుగా కన్పించాడు. లేకపోతే వచ్చే మూటడభై రూపాయల జీతంలో ఎటువంటి ఒడుదుడుకులు లేకుండా నిత్యకళ్యాణం పచ్చతోరణంగా సంసారం నడుపగలుగుతాడు? ★

---

"ఏమోనండి. అంతా అగమ్యగోచరంగావుంది. పోనీ ఏ మద్రాసో తీసుకువెళ్ళమంటారా ?" చాలా అమాయకంగానూ, ఆదుర్దాతోనూ ప్రశ్నించాడు కృష్ణారావుగారు.

"మీకు ముందరే చెప్పాను కదండీ. మీరేమీ కంగారు పడనక్కర్లేదు. అంతాసరిగానే అవుతుంది లెండి......"

"అయితే మూర్తిని ఇక్కడే వదిలెయ్యమంటారా?

మీకు అనవసరమయిన శ్రమ అవుతుందేమో?

పోనీ వాళ్ళ అమ్మను ఈ ఊరు రప్పించమంటారా?

"మరేం పరవాలేదులెండి—అనవసరంగా ఆవిడని కంగారు పెట్టకండి. నౌకర్లు వాళ్ళు వుండనే వున్నారు.....భోజనం వాట్నిగురించి కూడా మీరాళ్ళే బాధ పడకండి....అన్నీ నేను ఏర్పాటు చేయిస్తాను అతని బట్టలూ ఇంకేమైనా కావలసినవి వుంటే పంపించండి......"

# అందమైన కావేడి

(18-వ పేజీ తరువాయి)

మూర్తిని అక్కడే వదిలేసి శాస్త్రి—కృష్ణారావుగారు తిరిగి ఇంటికి వచ్చేస్తున్నారు.

"మీరు రోజూ ఓసారివచ్చి నన్ను కలసుకోండి.. రెండు మూడు రోజులవరకూ అతనిని మాత్రం అసలు కలసుకోవద్దు" అని హెచ్చరించాడు డాక్టరు.

ఇంటికి వచ్చేస్తుంటే మూర్తి అలా అవుతాడని కలలో కూడా అనుకోలేదని ఎంతో బాధ వెలిబుచ్చారు.

రోజూ కృష్ణారావుగారూ, శాస్త్రీ వెళ్ళి డాక్టరు గారిని కలసుకుని మూర్తి యోగక్షేమాలు తెలుసుకుంటూ వుండేవారు. మూడు, నాగులు రోజులు గడచిపోయాయి.

ఆరోజు డాక్టర్ శేఖర్ "మీరు మూర్తిని ఇవేళ కలుసుకోవచ్చులెండి అయితే అతన్ని అట్టే మాట్లాడించకండి"

శాస్త్రి, కృష్ణారావుగారూ మూర్తి గదిలోకి వెళ్ళారు.

మూర్తి వాళ్ళని చూడగానే లేచి కూర్చోబోయాడు. "పడుకోరా మూర్తి—అనవసరంగా లేవకు" వారించారు శాస్త్రి ఆయనా కూడాను.

మూర్తి మళ్ళీ పక్కమీద పడుకున్నాడు.

"ఎలావుందిరా మూర్తీ?"

"బాగానేవుంది నాన్నా. ఇక మన రూమ్‌కి వెళ్ళి పోదామా?"

"లేదు ఇంకొక్కవారం రోజులు ఇక్కడేవుంటే మంచిది, మీ ఆఫీసుకి కావాలంటే మెడికల్ సర్టిఫికేట్ పంపుదాం" అన్నాడు డాక్టర్ శేఖర్.

మూర్తిని విశ్రాంతి తీసుకోమని వాళ్ళు ఆ గదిలోనుంచి బయటకు వచ్చేశారు.

"మీ వాడికి జబ్బేమీ లేదండీ. తాత్కాలికంగా కొంచెం మతి చలించింది. ఇప్పుడు మళ్ళీ మామూలుగానే వున్నాడు.....మరో విషయం అతనికి ఇష్టం

లేని పని ఏమీ చెయ్యకండి ముఖ్యంగా వివాహ విషయంలో.....

వివాహం విషయంలో అతనికి అసలు ఎదురు చెప్పకండి. అతనికి నచ్చిన అమ్మాయినే చెయ్యండి.. ఒంటరివాడుగా మాత్రం ఆట్టేకాలం వుండనీయ కండి....మీరు మళ్ళీ ఓ రెండు రోజులవరకు మూర్తి నికలుసుకోవద్దు......"

"అదేమిటండీ డాక్టరుగారూ—ఒక్కగా నొక్క కొడుకు. వాడి ఇష్టానికి అడ్డు పెడతామా...." కృష్ణారావు కొడుకుమీద తనకివున్న వాత్సల్యం అంతా మాటల్లో తెలిసేలా అన్నారు డాక్టర్ శేఖర్‌తోటి. ఇంటికి వచ్చేస్తుంటే "కుర్రాడయినా చాలా తెలివైనవాడిలా ఉన్నాడోయ్ డాక్టరు శేఖర్" అన్నాడు శాస్త్రితో.

*   *   *

మరో రెండు మూడు రోజులు గడచిపోయాయి.

"కూర్చో శారదా....."

"ముందర కాఫీ తీసుకోండి"

"ఎవరీ శారద' అనుకుంటూ మూర్తి గదిలోకి అడుగుపెట్టారు శాస్త్రితోసహా కృష్ణారావుగారు.

తండ్రిని చూడగానే లేచి కూర్చున్నాడు మూర్తి. వెంటనే "శారదా ఆయన మా నాన్నగారు..... వాకు మారూమ్‌మేట్ శాస్త్రి, అని శారదకి తండ్రినీ, శాస్త్రినీ పరిచయంచేసి శారద—డాక్టర్ శేఖర్‌గారి చెల్లెలు—బియ్యే పాసయ్యింది అని వాళ్ళకి శారదని పరిచయం చేశాడు.....

"అప్పుడే ఎంత మార్పు వచ్చింది' మూర్తిలో అనుకున్నాడు కృష్ణారావుగారు వెంటనే శారద వాళ్ళిద్దరికీ నమస్కారంపెట్టి లోపలికివెళ్ళి మరో రెండు కప్పుల కాఫీతో ప్రత్యక్షమయింది.

"మీరు కూడా కూర్చోండి శారదా....ఎంతసేపు నిల్చుంటారు....." అన్నాడు మూర్తి.

శారద కూడా కూర్చుంది.

"నాన్నా నిజంగా డాక్టర్ శేఖర్‌గారితోపాటు, సమానంగా చూసింది ఈవిడ.....పాపం ఎంత శ్రమపడిందో!"

శారదవైపు కృతజ్ఞతా పూర్వకంగా చూశాడు కృష్ణారావుగారు.

ఆ చూపులోనే కృష్ణారావుగారికి శారదలో ఏదో విశిష్టత కనిపించింది......ఎందుకో ఆమె తన కోడ లైతే ఎంత బావుంటుంది అనిపించింది! అయితే పిచ్చివచ్చి కుదిరిన మూర్తిని ఆమె చేసుకుంటుందా అన్న అనుమానం వచ్చింది.

"శారదా.....' లోపల్నించి పిలుపు వినిపించింది.

"వస్తానండీ—మా వదిన పిలుస్తోంది" అంటూ లోపలికి వెళ్ళిపోయింది శారద

"నాన్నా......"

"ఉం......ఏం కావాలి నాయనా......"

"శారదని గురించి మీ అభిప్రాయం ఏమిటి..."

"బాగానే వుంటుంది. చదువుకున్నా వినయ విధేయతలు ఉన్నాయి....."

"ఆ అమ్మాయిని అయితే చేసుకుంటూను' అన్నట్టుగా చూచాయగా చెప్పాడు మూర్తి మాటల సందర్భంలో.

మరొక్కప్పుడైతే "ఏడవలేకపోయావ్" అని వుండేవాడే. కాని డాక్టరుగారు చెప్పిన మాటలు జ్ఞాపకానికివచ్చాయి కృష్ణారావుగారికి.

"అలాగే.....ఆ విషయం డాక్టరుగారితోనే మాట్లాడుతా!" అనేశాడు ఆయన కొడుక్కి ఎదురు చెప్పలేక

అంతలో డాక్టర్ శేఖర్ తిరిగి వచ్చాడు. కాస్సేపు మూర్తి గదిలో కూర్చుని బయటకు వచ్చేసారు ఆ ముగ్గురూనూ.

"డాక్టరుగారూ.....మావాడు ఓ అమ్మాయి పేరుచెప్పి ఆ అమ్మాయినయితే చేసుకుంటానంటు న్నాడు.. ..ఆ అమ్మాయిని ఇచ్చి చెయ్యవలసిందేనా."

"మీకు ముందరే చెప్పాను. అతని ఇష్టప్రకారం జరగడమే చాలా మంచిది. లేకపోతే మళ్ళీ ఏమైనా జరుగవచ్చు. ఒకవేళ పిచ్చివచ్చి కుదిరిన వాడికి మేం పిల్లని ఇవ్వమని వాళ్ళంటే . .కట్నాలూ కాను కలు అడగడం మానెయ్యండి. అప్పుడు ఒప్పు కుంటారేమో ?"



మొగుడు మీద అలిగి భార్య పుట్టింటికి వచ్చేసింది. విచారంగా అరుగు మీద కూర్చుని వున్న తండ్రి, కూతురు రాకకు విస్తుపోయి "ఏదేమిటమ్మా ఉత్తరం అయినా రాయకుండా ఇలా వచ్చేసేవు" అన్నాడు.

కూతురు:- "మా ఆయన నన్ను తిట్టినందుకు కోప మొచ్చి, ఇక్కడ కొన్నాళ్ళుంటే ఆయనకు బుద్ధొస్తుందని వచ్చాను. అది సరే గాని అమ్మేది నాన్నా."

తండ్రి:- నిన్న నేనేదో చిన్నమాట అన్నానని అలిగి పుట్టింటికి వెళ్ళిపోయింది.

ఫిరదౌసి (భీమవరం)



"కట్నాలూ కానుకలు ఎవరికి కావాలండీ?.... డాక్టరుగారూ.... ఇది కూడ మీమీదే ఆధారపడి వుంటుంది......మీచెల్లెలు శారదని చేసుకుంటా నంటున్నాడు..." మీరు ఒప్పుకోకపోతే మావాడి గతి ఏమిటి అన్నట్టు మొహంపెట్టి.

ఏమిటి! మీ పిచ్చి కొడుక్కి నా చెల్లెల్ని ఇస్తానా?" అన్నట్టుగా చూశాడు డాక్టర్ శేఖర్.

"డాక్టరుగారూ...మీరే చెప్పారుకదూ మూర్తికి పెద్ద జబ్బేమీ లేదని......నాకు ఏదో కాస్తో కూస్తో ఆస్తివుంది. మూర్తి చదువుకున్నాడు—ఉద్యోగం చేస్తున్నాడు....."

డాక్టర్ శేఖర్ ఇంకా అలాగే చూస్తున్నాడు.

"డాక్టరుగారూ—మీ మాటమీద మీకే నమ్మకంలేదూ? మూర్తికి పిచ్చికాదు కదూ...." గుడ్ల నిండా నీళ్ళు నింపుకున్నాడు కృష్ణారావుగారు.

"నా మాటమీద నాకు పూర్తిగా నమ్మకం వుంది .. .శారదకి ఇష్టమైతే నాకు అభ్యంతరం ఏమీలేదు... శారదని మీరే అడిగి చూడండి" అంటూ శారదని—పిలిచాడు శేఖర్

"వస్తున్నా—అన్నాయ్" అంటూ బయటకి వచ్చింది శారద.

"చూడు చెల్లాయ్. మూర్తి నీకు గత ఏడు ఎనిమిది రోజులుగా తెలుసు. అతనిది పిచ్చికాదనీ, కేవలం తాత్కాలికమైన మతి చలనం అని కూడా నీకు తెలుసు..... ఆ విషయం మళ్ళీ నేను హామీ ఇస్తాను .... వాళ్ళ నాన్నగారికి నిన్ను మూర్తికి చేసు కుందామని వుందిట ...దీంట్లో బలవంతం ఏమీ లేదు. నీకు ఇష్టమేనా?"

"నా శ్రేయస్సు కోరేవాడివి.... నీకు ఇష్ట మైతే నాకూ ఇష్టమే" అంటూ లోపలికి వెళ్ళి పోయింది శారద.

'నిజంగా మమ్మల్ని కాపాడావమ్మా' అనుకున్నాడు కృష్ణారావుగారు.

*   *   *

మూర్తి శారద వివాహం జరిగిపోయింది. కోడ లిని చూసి మూర్తి తల్లి తండ్రి మురిసిపోయారు. వివాహం అనంతరం ఓనెల్లాళ్ళు సెలవుపెట్టి తల్లి దండ్రుల దగ్గరవుండి విశాఖపట్నం తిరిగి వెళ్ళిపోయాడు శారదతో సహా మూర్తి.

ఆరోజు మూర్తి గది సర్దిస్తున్నారు కృష్ణా రావుగారు దగ్గరుండి. డ్రాయర్లో శాస్త్రి చిరు నామాతో ఓ కవరు కనిపించింది ఆయనికి.

'హుఁ' వీడికి అసలు డబ్బు విలువ తెలియ కుండా పోయింది' అనుకుంటూ ఆ కవరుపైకి తీశారు

ఆ కవరు అతికించడం కూడా మర్చిపోయాడు మూర్తి—దాంతో లోపల ఉత్తరం తీశాడు కృష్ణా రావుగారు. అవసరం లేనిది అయితే చింపెయ్యొచ్చు నని

ఉత్తరం చదవడం మొదలుపెట్టారు.

ప్రియమైన మిత్రుడు శాస్త్రికి,

నిజంగా నీలాటి మిత్రులు వేలల్లో ఒక్క డైనా వుండటం కష్టం. నేను శారదను వివాహం చేసుకోవడంకోసం ఆడిన నాటకంలో నువ్వు, డాక్టరు శేఖర్ మీ మీ పాత్రలని బ్రహ్మాండంగా పోషించారు. మా నాన్నగారు మన నాటకానికి ఆడ్డుఎక్కడా తగల్లేదు.

నిజంగా నువ్వు చేసిన సహాయానికి నీకు ఎంతో ఋణపడివున్నాను....నీలాటి మిత్రుడికి బదిలీ అయి పోయిందంటే ఎంతో విచారంగా వుంది....

నేనూ—శారదా రేపు విశాఖపట్నం వెడుతున్నాం. నువ్వు మా యింటికి మొదటి అతిథిగా రావాలని కోరుతున్నాం మేం ఇద్దరం... ..ఉత్తరాలు వ్రాస్తూ వుండు.

నీ ప్రియమిత్రుడు

మూర్తి.....

ఈ ఉత్తరం చదివిన కృష్ణారావుగారికి కథ అంతా అర్థమయ్యింది.

'మంచి నాటకం ఆడేరు కుర్రకారు' అనిపించిందేకాని మూర్తిమీద కోపం రాలేదు ఆయనకి. ఆ ఉత్తరం చివర "మిమ్మల్ని అందర్నీ అభినందించవలసిందే" అని ఒక్క వాక్యంవ్రాసి సంతకం చేసి—ఆ ఉత్తరం స్వహస్తాలతో పోస్టుచేశారు—కృష్ణారావుగారు. 

చాలాకాలం క్రిందట స్వర్ణపురి అనే దేశాన్ని అమరసింహుడనే రాజు పరిపాలించేవాడు.

అమరసింహుని పట్టమహిషి స్వర్ణలత. ఆమె ఎంతో గుణవంతురాలు. కొంతకాలానికి భగవంతుని దయవల్ల ఆ దంపతులకు ఒక అందాల కుమారుడు కలిగాడు. ఆనాడు స్వర్ణపురివాసులంతా అనేక వేడుకలు సంబరాలు జరుపుకున్నారు. తనకు కుమారుడు కలిగాడని తెలీగానే రాజుగారికి ఆనందానికి అంతులేదు. ఆ వేళ స్వర్ణపురి అంతా అంతులేని సంతోష సముద్రంలో ఓలలాడింది.

మహారాజుగారు వెంటనే తన కుమారుడికి జాతక కర్మాదులు చేయించాడు. జ్యోతిష్కులు, "రాజా! నీ పుత్రుడు గొప్ప శుభలగ్నమున ఉదయించాడు. ఇతడు ముమ్ముందు గొప్ప ధైర్యశౌర్య పరాక్రమవంతుడౌతాడు." అన్నారు. రాజు వారిని గొప్పగా గౌరవించి పంపించారు. తర్వాత తన కుమారుడికి 'విజయసింహు' డని నామకరణం చేశారు.

విజయసింహుడు దినదినప్రవర్ధమానుడై పెరిగి పదహారేళ్లవాడయ్యాడు. అతని అందచందాలు చూచి తల్లిదండ్రులు మురిసిపోయేవారు—అమరసింహుడు తన పుత్రునకు సమస్త రాచవిద్యలు తనే స్వయంగా నేర్పించాడు.

అమరసింహమహారాజుకు వేట అంటే భలే ప్రీతి. అందుచేత అప్పుడప్పుడు దగ్గరనేఉన్న అడవికి వెళ్తూ ఉండేవాడు.

ఒకరోజున విజయసింహునికి వేటకు వెళ్ళాలని బుద్ధిపుట్టి "నాన్నగారూ! నేను కూడ వస్తాను" అన్నాడు. రమ్మన్నాడు మహారాజు.

తండ్రీ కొడుకు లిద్దరూ అడవికి బయలుదేరారు. కొంత సేపటికి చేరుకున్నారు. స్వేచ్ఛగా అప్పటివరకు తిరుగుతున్న మృగాలన్నీ వీళ్ళను చూడగానే బెంబేలెత్తిపోయి చెట్టుకొకటి పుట్టకొకటి పారిపోయాయి— వాటిని చెండాడుటకు తండ్రికొడుకు లిద్దరూ విడిపోయారు.

విజయసింహుడు అలా మృగాలను చెండాడుతూ ముందుకు సాగిపోతున్నాడు. ఇంతలో ఒక బ్రహ్మాండమైన అరుపు వినపడింది. "ఏమిటి చెప్మా!" అని యువరాజు అనుకొన్నాడు. ఇంతలో ఒక పెద్ద రాక్షసుడు పెద్ద పెద్ద అడుగులు వేస్తూ, విజయసింహుని పైకి



రాసాగాడు. వెంటనే విజయసింహుని గుఱ్ఱం భయపడి పరుగు లంకించుకొన్నది. యువరాజు గుఱ్ఱం మీద నుంచి క్రిందికిదూకి, చరాలున తన ఖడ్గాన్ని ఒరలోనుంచి తీసి సాహసంతో ఆ రాక్షసుడిమీద పడ్డాడు. ఏనుగెక్కడ? ఎలుకెక్కడ?—పాపం! యువరాజు దానిచేతిలో చిక్కుకున్నాడు. విడిపించుకోలేకపోయాడు.

అప్పుడు ఆ రాక్షసుడు, "హ్హా హ్హా హ్హా...ఓరీ! నరుడా! నువ్వు ఇంక తప్పించుకోలేవు. నిన్ను రేపు నా కడుపులో వుండేటట్లు చేస్తాను! భయపడకు!!" అన్నాడు. కాని ఆ మాటలకు విజయసింహుడు ఆవగింజంతైనా భయపడలేదు!- "ఓరీ! నీచ రాక్షసా! నువ్వు పెద్ద ఆకారివైనందువల్ల నన్ను పట్టుకోగలిగావ్! మగవాడివైతే నాఅంత ఆకారం దాల్చి నాతో కత్తి యుద్ధానికి... కాదు ... దేనికైనా సరే...రా!" అన్నాడు. ఆరాక్షసుడు గట్టిగానవ్వి, "ఎంత సాహసం! ... ఇదిగో నేను నీఅంత ఆకారం దాల్చుతున్నాను... ఏమో వాగావ్! చూపించు యిప్పుడు!" అంటూ ఆకారం మార్చాడు.

ఇద్దరూ కత్తులుకలిపారు! వాళ్ళిద్దరికి ప్రళయకాలభయంకరమైన యుద్ధం జరిగింది. విజయసింహుడు అతినేర్పుతో యుద్ధంచేసి ఆ రాక్షసుని శిరస్సును ఒక్కవేటున నరికేసాడు!

విచిత్రం! వెంటనే ఆ రాక్షసుని కళేబరం మాయమై ఒక అందాల యువకుడు ప్రత్యక్షమయ్యాడు. అతను విజయసింహుణ్ని దీవించి,- "నాయనా! నేనొక గంధర్వుణ్ని. పేరు అపురూపుడు. నేనొక చిన్నతప్పు చేయుటవలన ఈ శిక్ష అనుభవించాను. నేటికి నేని భయంకరశిక్ష నుండి నీవల్ల విముక్తుణ్ని అయ్యాను. నీవుచేసిన ఉపకారానికి నేను తప్పక ప్రత్యుపకారం చెయ్యవలసి ఉంది- ఇదిగో, ఈఉంగరం తీసుకో బాబూ! ఇది నీ చెంత నున్నంతవరకూ నిన్నెవ్వరూ ఓడింపలేరు!" అంటూ ఒక ఉంగరాన్ని తీసియిచ్చాడు. తర్వాత సెలవు తీసుకొని అంతర్ధానమయ్యాడు.

విజయసింహుడు ఎలాగో తండ్రిని కలుసుకొని జరిగిన సంగతంతా పూసగుచ్చినట్లుచెప్పి, తను సంపాదించిన అద్భుత ఉంగరాన్ని చూపించాడు. జరిగినదంతా విన్న మహారాజుగారికి ఆశ్చర్యం, సంతోషం, భయం—ఒకేసారి కలిగాయ్.

వెంటనే వాళ్ళిద్దరు తిరిగి రాజమందిరాన్ని చేరుకొని, జరిగిన సంగతంతా రాజోద్యోగులకు చెప్పారు. ఒక్క నిముషంలో ఈసంఘటన ఊరంతా తెలిసిపోయింది. అందరూ యువరాజు ధైర్యశౌర్య పరాక్రమాలను మెచ్చుకొన్నారు.

మెట్లమీదనుంచి దొర్లించిన బంతిలా కాలం దొర్లిపోతుంది-ఆరు నెలలు గడిచిపోయింది.

* * *

ఒకనాడు విజయసింహుడు తన శయన మందిరంలో గాఢంగా నిద్రపోతున్నాడు. అతడు కళ్ళు తెరిచేసరికి హంసతూలికా తల్పంమీద వుండవలసిందిపోయి-కటిక నేలమీద కాళ్లూచేతులు త్రాళ్లతో కట్టి పడేయబడివున్నాడు. కలా నిజమా అనే సందేహము ఏర్పడింది.ఆఖరికి నిజం అని తెలిసింది-చుట్టూ కలయ చూశాడు. తనలాగే తొంభైతొమ్మిది మంది కట్టి పడేయబడివున్నాగ. వాళ్ళంతా బోరున ఏడుస్తున్నారు.

అప్పుడు విజయసింహుడు వాళ్ళనుద్దేశించి,- "ఎవరుమీరు? ఎందుకు ఏడుస్తున్నారు? నేనెందుకు కట్టివేయబడ్డాను?..." ప్రశ్నించాడు. "మేము ధర్మపురి మహారాజు కుమారులం. ఒక దుష్ట మాంత్రికుడు మమ్మల్ని ఇలా కట్టిపడేసి వెళ్ళిపోయాడు... నిన్ను కూడా వాడే కట్టేసి ఇక్కడికి తీసుకువచ్చాడు. మనల్ని కాళీమాతకు బలివేస్తాడట! అందుకే మేమంతా ఇలా ఏడుస్తున్నాం ..." అని వారిలో ఒకడు చెప్పాడు. మళ్ళీ వాళ్ళు ఏడ్వటం మొదలెట్టారు. కాని విజయసింహుడు కంట నీళ్ళు పెట్టలేదు. కట్లనుంచి తప్పించుకో చూశాడు. కాని లాభం లేకపోయింది.

ఇంతలో మాంత్రికుడు అక్కడికి వచ్చాడు. వాడు చూట్టానికి యముడిలా వున్నాడు. వాడ్ని చూడగానే విజయసింహుడు వాడ్ని నమిలి మ్రింగివేయాలనుకున్నాడు. కళ్లెర్రచేసి వాడివేపు చూసాడు.

మాంత్రికుడు బోరున ఏడుస్తున్న వాళ్ళలో ఒకడ్ని తీసుకుపోయాడు. మరికొంత సేపటికి మళ్లీ తిరిగివచ్చి మరొకడ్ని తీసుకుపోయాడు? వాడెందుకలా తీసుకుపోతున్నాడు? వెళ్ళినవాడే మయ్యాడు? ఎవరికీ తెలీదు. మాంత్రికుడు అలా తొంభైతొమ్మిదిమందిని తీసుకుపోయాడు.

తర్వాతవాడు విజయసింహుణ్ని



తీసుకుపోడానికి వచ్చాడు. "ఎవడవురా నువ్వు" అని అడిగాడు కోపావేశంతో విజయసింహుడు. "ఎవడినో తెలుస్తుందిలే!" అంటూ వాడు అతన్ని ఈడ్చుకుపోయాడు. పాపం! అతడు ఆసీచుడ్ని ఏమీ చేయలేక పోయాడు.

చివరికి వాడు విజయసింహుణ్ని ఒక కాళీదేవి ప్రతిమదగ్గరికి తీసుకువచ్చాడు. "నువ్వు కాళీమాతచుట్టు మూడుసార్లు ప్రదక్షిణంచేసి, దేవి కాళ్లమీద పడ్డావంటే నిన్నువిడిచేస్తాను..."అన్నాడు ఆమాంత్రికుడు. అక్కడ రక్తం మరకలున్నాయ్. కాని తొంభైతొమ్మిదిమంది అక్కడ కనిపించలేదు.

అప్పుడు విజయసింహుడు, "నాకు ప్రదక్షిణం తెలీదు! అసలు ప్రదక్షిణం అంటే ఏమిటి?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"ఆ! ప్రదక్షిణం అంటే తెలీదా?......" అని ఆశ్చర్యపడ్డాడు ఆ మాంత్రికుడు. తెలీదన్నట్లు తల ఊపాడు విజయసింహుడు. అయితే, నేను చేసి చూపిస్తాను. నువ్వు అలాగే చెయ్యి...మాంత్రికుడు దేవిచుట్టూ ప్రదక్షిణం చేశాడు.విజయసింహుడు కూడా అలాగే చేశాడు.

అప్పుడు మాంత్రికుడు, "దేవికి సాష్టాంగ దండ ప్రణామం చెయ్యి" మన్నాడు. అదికూడ తనకు తెలీదన్నాడు విజయసింహుడు. అప్పుడు మాంత్రికుడు దేవికి సాష్టాంగ దండ ప్రణామంచేసి, ఏదో చెప్పబోతుండగా, విజయసింహుడు చాటున దాయబడిన గొడ్డలిని చేతబుచ్చుకొని వానిశిరస్సును ఒక్కవేటుతో నరికేశాడు. పాపం! ఆమాంత్రికుడు రక్తంలో పొరలుతూ,గిలగిల తన్నుకొని చచ్చిపోయాడు.

వెంటనే దేవి ప్రత్యక్షమై, "నాయనా! విజయసింహా! నీ ధైర్యసాహసాలు- తెలివితేటలు కొనియాడదగినవి. నీవంటి ధైర్యసాహసాలుగల వాడు ఈజగతిలోనేలేడు. తొంభైతొమ్మిది రాజపుత్రులను ఈహంతకుడు ఎప్పుడోనాకు అర్పించాడు. ఈదుష్టుణ్ని చంపావు! - నీవు నాకొరకై చేసిన వ్రతఫలితం నీకే దక్కింది. ఇదిగో! ఈ అమృతం కోసమే వీడు ఈ వ్రతంపట్టాడు. ఆ అదృష్టం నీకే దక్కింది. తీసుకో బాబూ! ఇది త్రాగినవాడు వెయ్యిసంవత్సరాలు అష్టైశ్వర్యాలతోనూ-ఆరోగ్యంతోను జీవిస్తాడు. అంటూ ఓ బంగారుపాత్ర విజయసింహునికి అందించింది. విజయ

సింహుడు దేవికి సాష్టాంగ దండ ప్రణామం చేసి, భక్తితో ఆ పాత్ర నందుకొని, అందలి అమృతమును త్రాగాడు.

తరువాత దేవి, విజయసింహా! నీకు ఒకవరం ఇవ్వదలిచాను! కోరుకో! అన్నది. అప్పుడు విజయ సింహుడు చేతులు జోడించి, "లోక మాతా! నీవు నాకు చేసినమేలు నా జీవితంలో మరువరానిది. తల్లీ! నీ దర్శనము సామాన్యులకు లభింపదు. అయినప్పటికీ ఈ సామాన్యునికి నీ దర్శనము దొరికింది. అదే నాకు పదివేలు. అయినా లోకమాతవైన నీవు నన్ను కోరుకోమని అడిగావు. కాబట్టి అడుగుతున్నాను. తల్లీ! ఈ దుర్మార్గునివల్ల హరింపబడిన తొంభై తొమ్మిది మందిని మళ్లీ పునర్జీవులను చేయు తల్లీ! అని కోరాడు. దేవి అతని కోరికకు ఆనందపడి, 'తథాస్తు!" అంటూ మాయమయింది.

దేవి మాయమైన వెంటనే చచ్చిన రాజకుమారులు మళ్లీ బ్రతికారు. వాళ్లు జరిగినదంతా విజయసింహునివల్ల తెలుసుకొని అతనివద్ద శలవుపొంది తమ దేశానికి వెళ్ళిపోయారు. విజయసింహుడు కాలి నడకన తన దేశానికి బయలుదేరాడు. అతడలా బయలుదేరి అనేక కొండలు—గుట్టలు—పల్లెలు—నదులు దాటి ఆఖరికి ఓ పెద్ద అడవిని చేరుకొన్నాడు.

విజయసింహుడికి ఏదో ఒక చక్కని మృదుమధురమైన పాటవినిపించింది. ఆపాట వినగానే అతనికి భలే ఆశ్చర్యం వేసింది. ఈ మహారణ్యంలో ఏమిటీ కిన్నెరరాగంతో కూడుకొన్న పాట వినిపించడం?—ఆశ్చర్యచకితుడయ్యాడు. ఆ పాట అతన్ని ఆకర్షించింది. ఆపళంగా అతగాడు పాట వినుపించుతున్న దిక్కుగా నడిచాడు. అతడలా కొంత దూరం నడిచేసరికి ఒక సుందరమైన భవంతి కన్పించింది. విజయసింహుడు ఇంతవరకు అటువంటి భవంతిని చూడలేదు. రకరకముల చిత్ర విచిత్ర శిల్పములు చెక్కబడి ఉన్నాయ్. ఆభవంతి ముందర ఒక అందమైన కోనేరువుంది. అందలినీరు సువాసనవేస్తోంది. నీరు బంగారు ఛాయలోఉంది. ఆకోనేరు చుట్టూ ఓ అందమైన తోటఉంది. రకరకముల పూలమొక్కలతోనూ, తీగెలతోనూ చూట్టానికి భలే బాగుంది. ఇదంతా చూస్తున్న విజయసింహునికి, ఇంత పెద్ద మహారణ్యంలో ఈ భవంతి ఏమిటి? అని



ఆశ్చర్యంకలిగింది. ఆ భవంతిలోనికి పోయి చూడాలనిపించింది — ఇంకా ఆపాట వినిపిస్తూనే ఉంది.

విజయసింహుడు మెల్లిగా ఆభవంతిలోనికి ప్రవేశించాడు. అతడు ప్రవేశించాడోలేదో ఒక పెద్ద సర్పం బుసలుకొడుతూ పైకి రాసాగింది. దాన్ని చూసి అతడు భయపడలేదు. అది అతన్ని కాటువేయబోయింది. కాని అతడు, పూర్వం కృష్ణుడు కాళింగుని చంపినట్టు, దాన్ని పట్టుకొని ఒకదెబ్బతో చంపేశాడు.

తర్వాత విజయసింహుడు మళ్లీ ముందుకుసాగాడు. ఇంతలో ఒక సింహం గాండ్రుపెట్టుతూ రాసాగింది. అతడు దాన్ని చూసి— "ఈ సుందర భవంతిలో ఈ క్రూర మృగాలేమిటి?" అని ఆశ్చర్యపడ్డాడు. వెంటనే దానిమెడనుపట్టుకొని దాని నొసటమీద ఒక గుద్దు వేశాడు. అంతే! అది గిలగిల తన్నుకొని చచ్చింది. మళ్ళీముందుకుసాగాడు.

ఒక హంసతూలికా తల్పంపై ఒక జవ్వని పడుకొని గానం చేస్తోంది. ఆమె అపరరతీదేవిలా వెలుగుతోంది. ఆమె అందాన్ని చూచి విజయసింహుడు మూర్ఛపోయినట్లు అయిపోయాడు! ఆమెను పెళ్లాడాలనుకున్నాడు.

"ఓ! సుందరీమణీ! ఎవరు నువ్వు?" అని అడిగాడు యువరాజు. ఆసుందరి అతన్ని చూసి ఆశ్చర్యచకితురాలైంది. అతని అంద చందాలను చూచి మన్మథుడనుకొన్నది. తను కాపలా పెట్టిన సింహాన్ని, సర్పాన్ని ఎలా తప్పించుకొనివచ్చాడా అని మళ్ళీ ఆశ్చర్యపడింది. మళ్లీ యువరాజు ఆమెను ప్రశ్నించాడు: "ఈ మహారణ్యంలో ఈ సుందర భవంతినందు ఒంటరిగా ఉన్న నీ వెవ్వరు?"

"నేను పాతాళలోకం పాలిస్తున్న స్వర్ణసేనుని కుమార్తెను. పేరు స్వయంప్రభ... నేను కాపలా పెట్టిన మృగాలను తప్పించుకొని ఇక్కడికి రాగల్గిన నీ వెవరు?" అన్నది ఆమె.

విజయసింహుడు తనకథను స్వయంప్రభకు చెప్పి — "పాతాళ రాజకుమార్తెనంటివి కదా! మరి ఎందుకు ఇక్కడవున్నావ్?" అని అడిగాడు.

అప్పుడు స్వయంప్రభ, "యువరాజా! మా తండ్రి నన్ను ఒక అందవిహీనుడికిచ్చి వివాహం చేయబోయాడు. నే నందులకు నిరాకరించగా నన్ను దేశంనుంచి బహిష్కరించాడు..." అని తన కథను చెప్పింది.

ప్రభ ఏల అన్నదానిక అంతా నవ్వారు.

అయినా కళ్ళజోడబ్బాయి చలించలేదు కనీసం తలైనా తిప్పకుండా పుస్తకపఠనంలో నిమగ్నుడై పోయాడు. ఈ తరహా అరుంధతికి బొత్తిగా నచ్చలేదు.

"చూస్తూన్నా ఎప్పటికప్పుడు పోనీలేమన్నట్టు వూరుకుంటూన్నా. ఇంకా లాభంలేదు. తగిన బుద్ధి చెపితేనేగాని నా మనసూరుకోదు మనిషి జన్మమెత్తిం తర్వాత అమ్మాయి వెనకపడటానికి సిగ్గుండక్కర్లే" అరుంధతి ఈ ఘాటు మాటలు సైతం అతన్ని కించిత్తుకూడా చలింపచేయలేదు. అమ్మాయిలందరికీ ఓడిపోతున్నామేమో నన్న బెంగట్టుకుంది. అనుకున్నట్లు జరగకపోయే సరికి అరుంధతికి ఏడుపొచ్చినంతపనయింది. "పైకి ఏం తెలియనట్టు నటన. వుత్త మేడిపండు" ఛీత్కరించుకున్నా వృధా కంఠశోషగా వుండిపోయిందిగాని లాభం శూన్యం ఛి ఛి... ఏం మనిషి?

సరిగ్గా అదేసమయంలో కళ్ళజోడబ్బాయి నేస్తం రావటం చూచిన అరుంధతి, కళ్ళతో తన బృందానికి సైగచేసింది. అందరూ అరుంధతిని అనుసరించి కొంచెం దూరంలో పుస్తకాలు చదువుతూ నుంచున్నారు.

ఆ అబ్బాయి అందర్నీ చూచుకుంటూ తిన్నగా వచ్చి కళ్ళజోడబ్బాయిపక్కన కూర్చున్నాడు. రెండు నిమిషాలు చుట్టూ పరికించి మొదలెట్టాడు.

"గోడపక్కన నిలబడి మేఘఘర్జనలు విన్నాను మిత్రమా! కనీసం చలించనైనా లేదంటే నిన్ను అభినందించక తప్పదు"

కళ్ళజోడబ్బాయికి ఈ వరస అర్థం కాలేదు.

"ఇంత అమాయకుడివి కాబట్టే అందరూ ఇష్టం వొచ్చినట్టు ఆడించేస్తున్నారు" ఈ మాట వనితాబృందానికి వినపడేలా అన్నాడు.

"ఏవిటోయ్ నువ్వనేది" ప్రశ్నించాడు కళ్ళజోడబ్బాయి.

# అరుంధతి కోపం

(34-వ పేజీ తరువాయి)

"ఇంతసేపట్నుంచి మేఘఘర్జనలు వినపళ్ళేదా? వినపడినా లక్ష్యంచెయ్యలేదా?"

"నాకేం అర్థంకావటల్లా!"

"అర్థంకాకపోతేనే మంచిది మనసు కులాసాగా వుంటుంది" చివర్ని ముసి ముసిగా నవ్వాడు.

"చెప్పేదేదో డొంక తిరుగుడుమాని సూటి చెప్పు"

"ఇక్కడ కుదర్దు. అలా కాంటీన్‌కి వెడదాం పద"

ఇద్దరూ కాంటీన్‌వైపు నడిచారు అమ్మాయిలందరికీ అతని నేస్తమ్మీద బోల్డంత కోపం వచ్చింది వాడెవడో గడుగ్గాయిలా వున్నాడు. ఒకవిధాన అతను రావటమే మంచి దౌతుంది. కళ్ళజోడబ్బాయిని తామెలా అవమానించారో తూ.చ. తప్పకుండా అంతా చెప్పేస్తాడు. అప్పటికైనా తెలుసుకుంటాడు అసలు విషయం.

ఆరోజు కార్యక్రమం అలా ముగిసింది. ఇలా రోజూ విలుచూచుకుని నాలుగైదుమాటలంటిస్తూంటె చాలు. కనీసం అరుంధతి ముఖాన్నైనా చూడనోచుకోడు. ఇదె తగిన మందు. వాడకమ్మీద గాని రాణింపుకు రాదు.

—ఇప్పటికి నాల్రోజుల్నుంచి కళ్ళజోడబ్బాయి ఛాయామాత్రంగానైనా కనిపించటం లేదు క్లాసులోమాత్రం తలొంచుకుని బుద్ధిమంతుడిలా కూర్చుంటున్నాడు అరుంధతి ఆనందం వర్ణనాతీతం.

ఆరోజు అరుంధతి తనబృందంతో సినిమా కెళ్ళింది. న్యూస్ రీలు జరుగుతూండగా ఆమె పక్కసీట్లో ఎవరో కూర్చున్నారు ఆచివర్నున్న విమల అతనెవరో ఇట్టే పసిగట్టేసి ఆ వార్త ఈ చివర్నున్న అరుంధతికి అందజేసింది.

అతను కళ్ళజోడబ్బాయి!

అరుంధతి సినిమా చూట్టం మానుకుంది వంటినిండా తేళ్ళు, జర్రులూ, పాములూ, పందికొక్కులూ, ఎలకలూ, చీమలూ యావత్తు జంతుసంతానం పాకుతున్నట్టు ఫీలయింది.

అంతా సవ్యంగా నడుస్తుందనుకుంటె ఈ పీడ తిరిగి మొదలెట్టిందేవిటి? ఈ అబ్బాయికి సిగ్గసల్లేదా? ఎంత చెప్పినా పద్ధతి మార్చుకోపోతె ఎల్లా? ఏం చెయ్యాలి. అంత హాల్లో పబ్లిగ్గా గట్టిగా ఏడవాలనిపించింది అరుంధతికి—తను ఆడపిల్ల కాబట్టేగా అతనికింత అలుసు?

వీల్లేదు. ఇక ఈ విషయం అన్నయ్యకి చెప్పవలసిందే ఏదైనాసరే— ఇంక ఉపేక్షించి కూర్చుంటే లాభంలేదు.

ఇంటర్వెల్లవటంగూడా గమనించలేదు అరుంధతి. కాని ఆమె పక్కన కూర్చున్న కళ్ళజోడబ్బాయి ఆమెను చూడంగానే ఖంగారుపడి తృళ్ళిపడ్డాడు. ఏదో తప్పిదంచేసినట్టు భయపడ్డాడు. చటాలున సీటునుంచి లేచాడు. "సారీ— అనుకోకుండా ఇక్కడ కూర్చోటమయింది. పొరపాటైతే క్షమించండి" అని నెమ్మదిగా గొణిగేసి గేటునుంచి బయటకెళ్ళిపోయాడు.

అరుంధతి ఇంత గాలిపీల్చుకుంది. జయించినట్టు తనబృందంవంక గర్వంగా చూచింది. అందరూ కళ్ళతో అభినందించారు. మళ్ళీ సినిమా మొదలెట్టినా ఆ అబ్బాయి జాడలేదు ఒకవేళ ఇంటికెళ్ళిపోయాడేమో.

అరుంధతి మనసు చివుక్కుమనటం ఇదె మొదటిసారి. అతని స్వేచ్ఛకి తను ప్రతిబంధకమా? తనగురించి సినిమాకూడా మానుకున్నాడు. అలా జరగాల్సిందే. అసలతని గురించి జాలి తలవటంగాని కనీసం ఆలోచించటంగాని కూడదు.

అరుంధతి ఆరోజు సినిమా బాగా చూళ్ళేకపోయింది!

ఏది ఎలాగైనా మందుమాత్రం బాగా పని

---

"స్వయంప్రభా! నాకు నిన్ను పెళ్లాడాలని ఉంది. నీకిష్టమైతే నిన్నిప్పుడే పెళ్ళాడుతాను"అన్నాడు విజయసింహుడు. అందుకు సిగ్గుపడింది స్వయంప్రభ. పెళ్లికి ఒప్పుకొన్నది. వెంటనే విజయసింహుడు స్వయంప్రభను గాంధర్వ వివాహం చేసుకున్నాడు.

తర్వాత ఆ వధూవరు లిద్దరూ అక్కడ్నుంచి స్వర్ణపురికి బయలుదేరారు. అలా బయలుదేరి చివరికి స్వర్ణపురి చేరుకున్నారు.

తనకుమారుడు మాయమయిన దగ్గరనుంచి దుఃఖసాగరంలో అల్లాడుతున్న స్వర్ణలతా అమరసింహులు – కుమారుణ్ని చూడగానే ఆనందపరవశులై కౌగలించుకున్నారు. అప్పుడు విజయసింహుడు

# విజయసింహుడు

తను మాయమైనది మొదలు జరిగిన కథను వాళ్ళకుచెప్పి, స్వయంప్రభను గూర్చి చెప్పాడు — తలిదండ్రులు మరీ ఆనందపడ్డారు.

ఒక శుభ ముహూర్తమున మళ్ళీ వాళ్ళకు పెళ్ళి జరిపించారు. ఆ పెళ్ళి సంగతి విన్న స్వర్ణసేనుడు స్వర్ణపురికి ఏతెంచి తనకుమార్తెను కౌగలించుకొని, తనను మన్నించమన్నాడు తరువాత అల్లుని కౌగలించుకొని, – కట్నకానుకలను సమర్పించాడు.

తర్వాత అమరసింహుడు తన కుమారుడైన విజయసింహునికి పట్టాభిషేకముచేసి — విశ్రాంతి తీసుకొన్నాడు.

విజయసింహుడు జగత్కీర్తితోనూ – స్వయంప్రభతోనూ చాలాకాలం సుఖంగా పాలించాడు. ★

చేసింది. ఇందుకు సహాయపడిన మిత్రురాండ్రనం దర్నీ అభినందించింది అరుంధతి. వాళ్ళు చేసిన ఈ సహాయం జన్మలో మరచిపోనని హామీ కూడా ఇచ్చింది.

కళ్ళజోడు అబ్బాయి మళ్ళీ ఆనాటినుంచి (అమ కునిగాని—అనుకోకుండాగాని) వెంబడించటంలేదు గాని, అతని నేస్తం మాత్రం సూటిపోటి మాటలు అప్పుడప్పుడు ఉపయోగిస్తున్నాడు. ఒక సమస్య తీరి పోయిందంటే యిదొక రగడ ప్రారంభమయినం దుకు అంతా లోలోన విచారించేరు.

ఒకనాటి సాయంకాలం!— అరుంధతి డాబామీద ఎక్కి చదువుకుంటూంది. హఠాత్తుగా కళ్ళజో డబ్బాయి కనుపించేసరికి ఆశ్చర్యపోయింది. అతను డాబాముందు ఖాళీ స్థలంలో కూర్చోబోతూ, అరుంధతిని చూచి ఆ కార్యాన్ని ఆపుకొన్నాడు. అర్ధం టుగా లేచి బజారువైపు నడక సాగించాడు.

అరుంధతి నవ్వుకుంది. అంతలోనే విచారిం చింది, పాపం! అక్కడ చల్లగాలికోసం కూచోటం అతనికి అలవాటు. ఆ అలవాటునిప్పుడు అరుం ధతికోసం వదులుకొన్నాడు. చూడగా చూడగా కళ్ళజోడబ్బాయి బొత్తిగా అమాయకుడల్లే వున్నాడు. ఇలా అతన్ని బాధపెట్టడం తనకి భావ్యం కాదేమో. అంతలోనే అతనిమీద జాలి కలిగింది అరుంధతికి.

రోజులు గడిచేకొద్దీ అరుంధతికి ఏదో వెలితి అనిపించింది. ఇదివరకు రోజూ అతను ఆమెవెంట వనిమాలా తిరిగేవాడు. అది అతనికి హాబీలా వుండేది. ఒకవిధంగా అరుంధతికూడా ఈ తంతు అలవాటైపోయింది. అల్లాంటిది ఆ వాడుక తగ్గేకొద్దీ ఆమె మనసు వెలితితో భర్తీ అయి పోయింది

రెండు మూడుసార్లు విమలావాళ్ళు అడిగారు 'ఏమే! మీ బాడీగార్డు కులాసాయేనా' అని. 'మనం చేసింది తప్పేమో' నని అనేసింది అరుంధతి. దాంతో తన బృందమంతా ముక్కులమీద వేళ్ళు వేసుకున్నారు. ఔరా అని బోల్డంత ఆశ్చర్యం పడ్డారు. కొంపతీసి ప్రేమించేసేవా ఏమిటి గొడ వని అడిగారు. ఆ విషయం అరుంధతికి తెలిస్తే గదూ చెప్పటానికి.

—బోటనీ విద్యార్థినీవిద్యార్థులంతా లెక్చ రర్లతో సముద్ర విహారం వెళ్ళారు. మొక్కలూ గట్రా సేకరించిన తదుపరి తిరుగుముఖం పట్టారు. దార్లో కులాసాగా కబుర్లాడుకుంటూ వస్తున్నారు. అరుంధతి కళ్ళు కళ్ళజోడబ్బాయి కోసం వెతికాయి. ఆ గుంపులో ఎక్కడున్నాడోగాని కనుపించనేలేదు అందరూ వచ్చి బస్సు ఎక్కారు.

బస్సు కదిలింది. కదిలిన వెంటనే విద్యార్థు లంతా కేకలు పెట్టారు. బస్సాపండని ఎలుగెత్తి కేకపెట్టారు. కారణమిది : బస్సు కదుల్తూండగా కళ్ళజోడబ్బాయి బస్సెక్కపోయి కాలుజారి కింద పడిపోయాడుట.

కారు ఆగిపోయింది. స్టూడెంట్సుంతా ఆంద ళనతో అతని చుట్టూ చేరారు.

కుసుమవాళ్ళ మొహాల్లో దరహాసం మెరిసింది. తగినశాస్తి జరిగిందని ఓ మిడిసిపడిపోతూన్నారు. అరుంధతిమనసు చివుక్కుమంది. ఓ పక్క తమ సహపాఠికి ప్రమాదమైన దెబ్బలు తగిలి బాధ పడ్తూంటె వీళ్ళకు నవ్వుగా వుంటుందా? వీళ్ళూ మనుషులేనా?—వాళ్ళందరిమీద తన అసహ్యాన్ని బహిరంగంగా ప్రకటించి కళ్ళజోడబ్బాయిని చూట్టా నికి వెళ్ళింది. తన బృందమంతా గుటకలు మింగారు.

అతని రెండు కాళ్ళకీ బాగా దెబ్బలు తగిలాయి. మోచేతులూ, ముఖమూ గీరుకుపోయింది. కళ్ళ జోడు కిందపడి పగిలిపోయింది. చావు వెంట్రుక వాసిలో తప్పిపోయింది అతని అదృష్టం బావుండి. అతన్ని చూచిన అరుంధతి కళ్ళు నీళ్ళతో నిండాయి. ఎవరూ చూడకుండా తుడుచుకొంది

లెక్చరర్లు అతనికి ప్రథమిక చికిత్స చేశారు. కొద్దిగా తెప్పరిల్లాడు. సోడా తాగించారు. కాస్త ఆగిన తర్వాత కాఫీ ఇచ్చారు ఒక అరగంట అతను రెస్టు తీసుకున్నతర్వాత తిరిగి బయల్దేరారు.

ఆ తర్వాత రోజు అతను కాలేజికి రాలేదు. బాగా

---

ప్లే బేక్:- అదిగో ద్వారక
ఏక్టరు:- అదిగో ద్వారక
ప్లే బేక్ :- ఆలమందలవిగో
ఏక్టరు:- ఆలమందలవిగో
ప్లే బేక్: అల్లదే కోట
ఏక్టరు:- అల్లదే కోట
ప్లే బేక్:- ఎంతని చెప్పే
దిరా వెధవ?
ఏక్టరు :- ఎంతని చెప్పే
దిరా వెధవా......

యస్. సాంబమూర్తి (సబ్బవరం)

---

దెబ్బలు తగలటంమూలంగా జ్వరం వచ్చిందని తెలిసింది

ఒకరోజు సాయంత్రం కాలేజి అయింతర్వాత అరుంధతి కళ్ళజోడబ్బాయి రూమ్కిదుగా వెళ్ళింది. రూంలో అతని మూలుగు స్పష్టంగా వినిపించింది. ఆమె మనసు ద్రవించింది. సమయానికి ఆ యింటి వాళ్ళు కూడా ఊళ్ళో లేకపోటం అతని దురదృష్టమే మరి.

అతని మూలుగు ఇంకాస్త ఎక్కువయ్యింది. అరుంధతికాళ్ళాడలేదు. రూంలోకివెళ్ళి అతన్నొకసారి చూచిరావాలనుకుంది అలా వెడుతూండగా ఎవ రైనా చూస్తే ఏమనుకుంటారు? ఏడిచారు! ఏమనుకుంటే తనకే. చదువుకున్నవాళ్ళు ఇలా సాటివ్యక్తి బాధపడ్తూంటే చూస్తూ ఊరు కోటం సభ్యతా? స్థిర నిశ్చయంతో రూంలోకి అడుగుపెట్టింది అరుంధతి.

మంచంపైన అతుక్కుపోయినట్టు కనుపించా డతను. తల అటువైపుపెట్టి బాధగా మూలుగు తున్నాడు. మంచంపక్క టీపాయ్‌మీద మందుసీసా లున్నాయి. గదంతా చిందర వందరగావుంది. అరుం ధతి గుమ్మం దగ్గరే నిలబడింది. అతని స్థితికి [illegible] చింది లోలోన.

“లోపలకు రావచ్చునాండి” అరుంధతి అడి గింది.

“ఎవరూ—” అతను తల గుమ్మంవైపు తిప్పాడు. “మీరా” అరుంధతినిచూచి ఆశ్చర్య పోయి లేవబోయాడు.

“ఫర్వాలేదు. లేవకండి” అంటూ ఆమె లోపలి కొచ్చింది.

అతను మరీ ఆశ్చర్యపోయాడు.

“ఎలాగుందండీ!” పరామర్శించింది.

అతనేం జవాబివ్వాలో తోచలేదు. కుర్చీ చూపించి కూర్చోండని చెప్పాడు. ఆమె కుర్చీని మంచం దగ్గరకు లాక్కుని కూర్చొంది.

“డాక్టరు మందులిస్తున్నారా?”

“ఇస్తున్నారండి!—చిన్నప్పట్నుంచీ నాదో తరహా! ఏ చిన్న జ్వరాన్నిగూడా దాచుకోలేను. అందికే నే నిలా వున్నాను” అతను నిజం చెప్పాడనుకుంది అరుంధతి.

“మీరిలా వచ్చారంటే—” ఆగిపోయాడు కళ్ళజోడు (ఇప్పుడులేని) అబ్బాయి.

“మిమ్మల్ని చూడాలనుకున్నాను. మంచి దెబ్బలే తగిలాయి”

“ఇందాకే చెప్పాను ఏకొద్ది దెబ్బలు కూడా ఓర్చ లేనని. అంతేనండి. అసలు తగిలినవి చిన్న దెబ్బలే—”

“పరీక్ష ముందురోజుల్లో మీకిలా జరగడం”

“నా దురదృష్టం. ఏం చెయ్యను చెప్పండి. ప్రతివిషయంలో నాకిలా జరుగుతూనే వుంటు న్నాయి.”

అరుంధతిముఖంలో మార్పు స్పష్టంగా కను పించింది.

“క్షమించండి. స్వంతవిషయాలు” ఎక్కు వగా మాటాడుతున్నా గామాలు. 'అతను సంజా యిషి చెప్పుకున్నాడు.

“క్షమించాల్సింది నన్ను. అనవసరంగా మీ మన స్సును క్షోభపెట్టాను.” అప్రస్తుతాన్ని అవసర మనుకుని చెప్పింది. అరుంధతి. ఆ గీత్వా తన అబల త్వాన్ని నిరూపించుకుంది.

“నాకేం బాధలేదండి. అపార్థం చేసుకున్నంత మాత్రాన మనుషులైన మనం కృంగిపోడం కూడదు. రామం అన్నీ చెప్పాడు. మీరు నన్ను బాడీగార్డుగా అర్థంచేసుకుంటారని నే నింతకు ముందు అనుకోలా— అసలు మిమ్మల్ని వెంబడించా లని నాకసలు లేనేలేదు కాకతాళీయంగా కలుసు కోడం మీకలా అనిపించటంలోకూడా మీ పొర పాటులేదు. ఎప్పటికప్పుడు విషయాన్ని మీకు చెపుదామనుకుంటూనాను. చెప్పింతర్వాత మీరు మళ్ళీ ఏమనుకుంటారోనని నా భయం అందుచేతనే చెప్పలేకపోయాను.” తన అవస్థ సంక్షిప్తంగా చెప్పుకున్నాడు.

“చాలా మంచి అబ్బాయి'—అరుంధతిమనసు మెచ్చుకుంది అనవసరంగా అతన్ని అవమానిం చటం తనదే పొరపాటు. పరిపరివిధాల ఆలో చిస్తూన్న అరుంధతికి అతని మాట వినిపించింది.

“నామీద దయతలచి ఇలా వచ్చినందుకే కాఫీనైనా యిచ్చుకోలేని దౌర్భాగ్యుణ్ణి.”

# అరుంధతి కోపం

"ఆ పర్వాలేదండి మీకెలావుందో చూచిపోదామని వచ్చాను అంతే" ఆమె ఇంకా ఏదో చెప్ప పోయేంతలో అతను మూలిగాడు ఏమిటని అడిగింది.

"గాయం పోటు పుడ్తొందండి. మరేంలేదు"

"పాపం" అరుంధతి అనుకుంది.

వీధిలో సైకిలు చప్పుడయింది. ఎవరాని చూచేంతలో రామం వస్తున్నాడు ఎల్లావుందిరాంటూ. రూంలో అరుంధతిని చూచి తనకళ్ళని తనే నమ్మకోటానికి భయపడి, చివరికి నమ్మకోక తప్పక ఏమిటి సంగతన్నట్టు ఇద్దరివైపు చూశాడు పరీక్షగా.

కళ్ళజోడబ్బాయి ఆమె రావటానికి కారణం చెప్పాడు రామంమనను ఇప్పుడు అయోమయంలో ఆడుకుంది. మొదట్నుంచీ ద్వేషించిన అరుంధతి—స్వయంగా క్షేమసమాచారాలు కనుక్కోటానికి వచ్చిందంటే అతని ఆశ్చర్యం యింతా అంతా కాదు. కళ్ళజోడబ్బాయి రొట్టె విరిగి నేతిలో పడిందన్నమాటె

కాసేపు ఏవోక్లాసు విషయాలు మాటాడేసి అరుంధతి ఇంటికెళ్ళిపోయింది. భోజనంచేసి పడుంవాల్చి పుస్తకం తెరిచింది చదువుకుందికి. కాని మనసుమాత్రం కళ్ళజోడబ్బాయిమీద నిలిచి పోయింది

పాపం!—మానసికంగా తను చేసిన గాయంకాకుండా ఈ గాయంకూడా తగలాలా? ఎంత బాధ పడ్తున్నాడో!

అతని రూంకెళ్ళిరావటం రామం చూశాడు. చూచి నోరు మూసుక్కూర్చుంటాడని ఆమెకు నమ్మకంలేదు. కాలేజిఅంతా చాటింపు వేస్తాడు అందరూ తనని గుచ్చిగుచ్చి అడుగుతారాయె!

తను చేసింది తప్పేమీకాదు. అడిగితే సరైన సమాధానం చెప్పగల సామర్థ్యం తనకుంది. అలాంటప్పుడు జంకాల్సిన పనేముంది? మగత నిదురలో ఆరాత్రి గడిపేసింది.

—అనుకున్నట్టుగానే తెల్లారి విమలావాళ్ళు అడిగారు.

"ఏమే—అతని రూం కెళ్ళావుటగా."

"వెళ్ళాను"

"అతని క్షేమసమాచారాలు స్వయంగా అడిగావుట" బుగ్గమీది పెన్నుని వయ్యారంగా నాట్యం చేయిస్తూ అడిగింది కుసుమ.

"అడిగాను"

"క్లాసు విషయాలు కదిపావుట" ప్రభావతికి కోపం వచ్చింది.

"కదిపాను—"

"ఏడ్వలేకపోయావ్. ఇంతా చేసింది నీ యీ నిర్వాహకంకోసమేనా. అంతమాత్రానికి మధ్య మమ్మల్నెందుకు ఇరికించావ్. మా పరువుతీశావు. ఈ నాటకం ముందునుంచీ మువ్వాక్కర్తివే ఆడకూడదూ" విమల విసుక్కుంది.

"అతనిక్షేమం కావాల్సిందానివి — మొదట్నుంచీ అతని అభిమానురాలుగా వుండకపోయావ్ మా కింత విచారం వుండేదికాదు" ప్రభావతి కూడా విసుక్కుంది.

"మొదట దూషించటమెందుకూ—తర్వాత ప్రేమించట మెందుకూ?" కుసుమ చిటపట లాడింది.

"ఏంమనుషులే మీరు? పాటివిద్యార్థికి గాయాలుతగిలి తోడెవ్వరూలేక బాధ పడ్తొంటే, ఇంటిదగ్గరదాన్నయ్ ఎలా వుందని పరామర్శిస్తే తప్పా?" అరుంధతి ప్రశ్న వేసింది

"రోజూ నన్ను వెంబడించి నా ప్రాణం తీస్తున్నాడు కాస్త సహాయంచేసి కాపాడండర్రోనని మొరపెట్టి మా కాళ్ళుపట్టుకోటం తప్పుకాదా" ప్రభావతి ఇంత ఎత్తున లేచింది.

"మీరేమైనా అనండి. నే చేసే ప్రతి పనికీ నాకు సంపూర్ణమైన విశ్వాసముంది. వుంటుంది." ఆ మాట అనేసి విసురుగా వెళ్ళిపోయింది అరుంధతి. మిత్రురాంద్రంతా గుడ్లప్పగించి బొమ్మల్లా హంపీకన్యల్లా నిలబడిపోయారు.

"నాకు మొదట్నుంచీ అనుమానంగానేవుంది—ఇది అతన్ని ప్రేమించేసిందేమోనని" అరుంధతి వెళ్ళింతర్వాత కుసుమ అంది.

"ప్రేమ లక్షణంగూడా ఇంతే. గిట్టిగా సగాయిమగాడ్ని దూషించినా, ప్రేమతో పూజించినా—పర్యవసానం అతన్ని తనవాడిగా చేసుకోటమే" ప్రభావతి పాలోచనాపూర్వకంగా అంది.

"ఏదైతే మనకెంగాని—ఇకముందు ఇది ఎంత అరిచి గీ పెట్టినా మనం సాయం చెయ్యరాదు" కమిటీలో తీర్మానంచేసింది విమల.

—అక్కడ రూంలో అరుంధతి అభిమానాన్ని సేవలరూపంగా అందుకుంటున్నాడు ఆనందు. (కళ్ళజోడబ్బాయి పేరు ఆనందమని అరుంధతి అతన్నే అడిగి తెలుసుకుంది) స్వయంగా అతని కాలికి, మో చేతికి బేండేజీలు కట్టింది. మంచం దగ్గిరగా కుర్చీలాక్కుని కూర్చుంది.

"మీకు చాలా ఋణపడివున్నాను. ఇంతవరకూ అమ్మా నాన్నా లేని లోటు అన్నా వదినలు తీర్చారు. ఇప్పుడు మీరు...." అనేమాట ఆపేసి కృతజ్ఞతా సూచకంగా (తర్వాత పదాన్ని మువ్వ పూరించు మనేభావంతో) ఆమెవైపు చూశాడు ఆనందు.

"మొత్తానికి తెలివిగలవారే" అతని తెలివి ఇప్పుడిప్పుడే అరుంధతికి బోధపడ్తొంది కాబోలు ముసిముసిగా నవ్వుకుంది.

"థాంక్స్" తనభావన అర్థంచేసుకుందని ఆనందించాడు ఆనందు.

"చాల్లే పూరుకోండి" గోముగా అంది అరుంధతి

"నే నన్నదాంట్లో తప్పేమన్నావుందా?"

"తప్పో ఒప్పో—మీకు నేను చెప్పగలదాన్నా!"

"మీకు నేనంటె ఇంత అభిమానమెందుకూ" సూటిగా అడిగాడు.

"ఏమో!....." కళ్ళు దించింది సిగ్గుగా,

"నిజం. ఎందుకో తెలియకుండానే ఒకర్నొకరం ప్రేమించుకుంటాం. ఆత్మీయుల్ని చేసుకుంటాం. ఇదే చిత్రంగాలేదూ. అల్లాగే ద్వేషాలు కూడా. మొదట్లో అకారణంగా మీరు నన్నెంతగా చీదరించుకున్నారో జ్ఞాపకం తెచ్చుకోండి"

"ఇప్పుడవన్నీ ఎందుకు చెప్పండి" గతం ఆమెకి విషం.

"ఎందుకనో మీతో ఆనాటివిషయాలే ముచ్చటించాలనిపిస్తోంది. ఆ రోజు లైబ్రరీలో నా గురించి మీరేమనుకున్నారో—అన్నీ రామం చెప్పాడు. నిజానికొస్తే వాడు చెప్పేంతవరకూ నేను మిమ్మల్ని పరోక్షంగా బాధ పెడ్తున్నానని తెలియదు అరూ—" కాస్త చనువుగూడా తీసుకున్నాడు.

"విమలావాళ్లేమన్నారో తెలుసునాండీ!"

"ఏమన్నారేవిటి" ఆత్రంగా అడిగాడు.

"మిమ్మల్నిట నేను...." సిగ్గు ముఖాన్ని కప్పేసి దాచేసింది.

"ప్రేమిస్తున్నారు. తప్పేముంది?" ఆనందు కూడా గడుగ్గాయే. లేకపోతే తను చెప్పలేని మాటని అంతకుండబద్దలుకొట్టినట్టు చెప్ప గలుగుతాడా! ఎంత చదువుకున్న అమ్మాయైనా సిగ్గుకి దాసురాలే మరి.

'నేనన్నదాంట్లో తప్పుందేమో—మీ అంతరాత్మని అడిగి చూడండి" ఆవిడ్ని మళ్ళీ మాటల్లోకి దించాలని ఆనందు ఉద్దేశ్యం.

లేదన్నట్టు తలూపింది.

"నే గ్రహించిందిది : మీరు నా గురించి పనిగట్టుకుని వస్తున్నారు. నన్ను పరామర్శించి వెడుతున్నారు. ఎవరేమనుకున్నా పర్వాలేదని మీ మనసుకి చెప్పుకున్నారు. మీకు కావాల్సింది నా ఆరోగ్యం. కదూ—"

అవునన్నట్టు తలూపింది.

"అదే ప్రేమకున్న ప్రథమ లక్షణం. దాన్నే అంటా—"

"అబ్బ వూరుకోండి బాబూ....ఇలా అంటే నే వెళ్ళిపోతాను" ఆమె లేచింది చిరుకోపంతో.

బయట రిక్షా ఆగిన చప్పుడయింది. ఎవరాని అటు చూచింది. ఆమె గుండె ఆగిపోయినంత పని జరిగింది! అన్నయ్య మరొక వ్యక్తితో రిక్షా దిగాడు. తన విషయం అన్నయ్యకు తెలిసిందా? ఆనందును ఏం చేస్తాడోగదా! ఆమె వణికిపోయింది.

"ఎవరటండీ—వచ్చిందెవరు?"

"అన్నయ్య....మంచివాడుకాదు. జాగ్రత్త. నన్నేంచేసినా ఫర్వాలేదు. మిమ్మల్ని ...మిమ్మల్ని"

"ఛ...వూరుకోండి. అనవసరంగా భయపడ్తారే—"

ఆ ఇద్దరు ఆగంతకులూ ఆనందు రూం ముందు ప్రత్యక్షమయ్యారు.

"ఇదేరా అతని రూము" అరుంధతి అన్నయ్య అన్నాడు. అరుంధతిని అక్కడ చూచి ఆశ్చర్యపోయాడు. ఆమెముఖంలో భయం స్పష్టంగా కనిపిస్తోంది.

"ఏం—ఇక్కడున్నావ్" ఆమెను అడిగాడు.

"మరె....మరె....అన్నయ్యా! వీరు ఆనందుగారని మా క్లాసుమేటు......పాపం.....బాగా కారు తగిలాయి.... దెబ్బలు మించి కిందపడ్డారు....."

ఆమె మాటలోని తడబాటు విని వచ్చిన ఇద్దరూ ఫక్కున నవ్వారు. అరుంధతి మరీ భయపడింది.

"ఏమిటమ్మా! కారు తగలటమేవిటి? దెబ్బలు మించి పడ్డమేవిటి?" కొత్తవ్యక్తి ఆమె తడబాటుని హెచ్చరించి ఆనందు వంక చూస్తూ "ఏంరా! ఎలా వుంద"ని అడిగాడు.

"పర్వాలేదన్నాయ్! అరుంధతిగారే స్వయంగా అన్నీ చూస్తున్నారు"

ఈ దఫా అరుంధతి భయపడ్డం మాని, ఆశ్చర్యపడ్డం మొదలెట్టింది. వీరు ఆనందు అన్నయ్యన్నమాట. బాగానేవుంది......

"అరూ ! వీడు కృష్ణ అని నా క్లాసుమేటు. ఆనందు అన్నయ్యేనట. హఠాత్తుగా స్టేషనుదగ్గర కనిపించి ఇతని రూం అడ్రసు అడిగాడు. చూపించాను. వీడూ నేనూ చిన్నప్పుడు ఇలే అల్లరిగా తిరిగే వాళ్ళం. ఆరోజులు మళ్ళీ తిరిగి రావు. అవునూ ఏమోయ్ ఆనందూ! ఎప్పుడూ చెప్పావుకాదె కృష్ణ మీ అన్నయ్యని. అవున్లే......నేన్నీకు తెలిచ్చావనాయ్ మరి. ఇన్నాళ్లూ ఈ అద్దె గది ఖర్మానికి నేను చాలా విచారిస్తున్నా. ఇంకెంత యిల్లు మేమూ వృథా! ఇకనుంచి అదేంకుదర్దు. వెంటనే రూం మార్చి మాయింటికొచ్చేయ్. అరుంధతికి తోడుగా వుంటావ్.

"ఏమంటావ్రా అబ్బీ" అని కృష్ణను అడిగాడు.

"నేనేమంటాను. వసపిట్టవు. వడవడా వాగేశావ్. కాదంటే వస్తాడునని కలబడి కొట్టేస్తావు గూడాను. మావాడ్ని నువ్వుకాపోయినా మీ చెల్లెలైనా కనిపెట్టిందిన్నాళ్ళు. ఆమెకి మావాడితోపాటు నేనూ ఋణపడివున్నాను."

"సర్లే....ముందు స్నానంచేద్దువుగాని రా. ఇప్పుడే వస్తాం అరూ...అంతవరకు ఆనందుబాబుని చూస్తుండు. అసలే మొహమాటం జాస్తనుకుంటాను. సరిసరి. రారా నువ్వు. వాళ్ళిద్దరూ వుండ గలర్లే. ఇప్పట్నుంచే వాళ్ళనలా వదిలెయ్యాలి" అని ఫొల్లున నవ్వుతూ కృష్ణను యింటికి తీసుకెళ్ళాడు అరుంధతి అన్నయ్య.

రెండు నిమిషాలు నిశ్శబ్దం.

"వర్షం కురిసి వెలిసింది!" ఆనందు నవ్వుతూ అన్నాడు. "మీ అన్నయ్య చెప్పిందంతా విన్నారు కదూ! జాగ్రత్త సుమా! నన్నింక వదలిపెట్టకండి క్షణమైనా. ఇకనుంచి మీరే నాకు బాడీగార్డు జీతం బత్తెంలేని బాడీగార్డు" ★



ధరణీవారి 'బాటసారి' చిత్రంలో భానుమతి



రామకృష్ణా ప్రొడక్షన్సువారి "టాక్సీరాముడు"లో గిరిజ, రేలంగి.

చిత్ర సమీక్ష :

# ఉత్తమ కథాత్మకచిత్రం "అనుమానం"

వలచి, వలపించుకుని, చిలకా గోరింకల్లాగా వుంటున్న భార్యా భర్తల మధ్య అనుమాన బీజాలు ఏర్పడితే, అందుకు దోహదంగా తుంటర్లు, ఈర్ష్యాళువులు, చేరితే ఎంత అన్యోన్యమైన సంసారమైనా, మాధవయ్య మందిరపు గోడల్లాగా బీటలు వారటం తథ్యం. విడివడ్డ మనసులు తిరిగి కలుసుకుంటాయా అనేది, చలన చిత్ర జీవితాల్లో నిత్య సత్యం, వాస్తవిక జగత్తులో "అనుమానం"

తమిళంలో 'దైవప్పిరవి' అనేవ ప్రజాపీక మన్ననలు, భారత ప్రభుత్వ పతకం పొందినది. ఈ చిత్రాన్ని కమాల్ బ్రదర్సువారు అనుమానం అన్న పేరుతో తెలుగులోకి తర్జుమా చేశారు. ఈ చిత్రాన్ని ఎ. వి. ఎం. స్టూడియోలో పత్రికా ప్రతినిధులకు చూపించారు.

కాంట్రాక్టరు రంగనాథం దగ్గర మేస్త్రీ మాధవయ్య, పనిపిల్ల గుణరత్నం రత్నాన్ని వలచి వలపించి వివాహం చేసుకుంటాడు. మాధవయ్య తమ్ముడు మనోహర్ మహా తుంటరి. అతణ్ణి ఎలాగైనా బాగు చేయాలని రత్నం ప్రయత్నిస్తుంది. రత్నం తమ్ముడు రాము విద్యా బుద్ధుల విషయం మాధవయ్య చూస్తుంటాడు.

కాలచక్రం కదలిపోతుంది. మాధవయ్య కాంట్రాక్టరై ఒక ఇల్లు కూడా ఏర్పరచుకుంటాడు. వెనక, రత్నం ఇంటి అరుగుమీద టీ అంగడి పెట్టుకున్న అయ్యరు కూడా మాధవయ్య ఇంటికి చేరుతాడు. మాధవయ్య పని మూడు పువ్వులు ఆరు కాయల్లాగా ఆనందంగా గడిచిపోతుంటుంది. మాధవయ్య తండ్రి దూర దేశంలో మరణించగా ఆయన ఉంపుడుగత్తె, ఆమె కుమార్తె నందిని, మాధవయ్యను ఆశ్రయిస్తారు. వాళ్ళు నీతిలేనివాళ్ళైనా, తన నీతిని నిలబెట్టుకునేందుకు మాధవయ్య వాళ్ళకు ఆశ్రయం ఇస్తాడు.

రత్నం వంటలయ్యరుతో చనువుగా వుండటం అనుమానించిన, నందిని మాధవయ్యకు, నందినీ మాధవయ్యల చనువును అనుమానించిన అయ్యరు రత్నానికి తమ అనుమానాలు చెప్పటంవల్ల, రత్నం. వయ్యల అన్యోన్యతకు విఘాతం కలుగుతుంది

రాము, రంగనాథంగారి అమ్మాయిని ప్రేమించగా, మనోహర్ కూడా ఆ అతివనే పెళ్ళి చేసుకోవాలని పట్టుపట్టడంతో ఇంట్లో కల్లోలం ఏర్పడుతుంది.

పరిస్థితులు దారుణంగా విషమించి రత్నం, మాధవయ్యలు తాము ఆత్మహత్య చేసుకోవాలనుకునే నిర్ణయానికి దారి తీస్తాయి.

ఆఖరికి నిజం గ్రహించిన మాధవయ్య, మనసు మార్చుకున్న మనోహర్, కళ్యాణ్యాదినీ ప్రోత్సాహింపబడటంతో వాళ్ళు ఆత్మహత్యా ప్రయత్నం విరమించుకోటం, కుటుంబంలో తిరిగి శాంతి నెలకొనటం జరుగుతాయి.

మాధవయ్యగా శివాజీ గనేశన్, రత్నంగా పద్మిని ప్రతిభావంతంగా నటించారు. యస్. యస్. రాజేంద్రన్, యం. యన్. రాజం ప్రభృతులు యథోచితంగా నటించారు. తంగవేలు బృందం సునిశితమైన హాస్యాన్ని అందించింది. ఆర్. సుదర్శనం నిర్వహించిన సంగీతం కమ్మగా వుంది. పి. బి. శ్రీనివాస్, జానకి పాడిన జాబిలికన్నా నా చెలియ నవ్వే అందం", ఘంటసాల పాడిన "అనుమానం" అన్నపాట, జమునారాణి పాడిన "కన్నెవయసు" అన్నవి తెలుగు నోళ్ళలో నాలుగునాళ్ళుండవచ్చు.

తర్జుమా చిత్రంపైన తర్జన భర్జనలు అనవసరమే ఐనా, ఒక భాషలో ఉత్తమ చిత్రంగా బహుమతి పొందింది గనుక కొంత విమర్శనాయుత పరిశీలన అవసరం. కథలో నందినిపాత్ర ప్రవేశం ఎంత కృతకంగా కన్పిస్తుందో అలాగే మనోహర్‌లో కల్గిన మార్పు కూడా కొంత కృతకంగానే వుంది. ఒక దృక్పథంలో—అది మంచా చెడా అనేదికాదు ప్రశ్న—ఎలాంటిదైనాసరే — మానవుడు నడుస్తున్నప్పుడు, అతని జీవితగమనాన్నే మార్చగల పరిణామం సాధారణంగా



రఘురాం ఫిలిమ్సువారి ''తండ్రులు—కొడుకులు''లో నూతననటి శారద.



భారతివారి ''కలసి ఉంటే కలదు సుఖం''లో సావిత్రి, రామారావు.

రెండు విధాలుగా జరుగుతుంది. మొదటిది, జీవితంలో సాధారణంగా, అనుకోని, అనుకోలేని ఎదురుదెబ్బ, చాలా భయంకరమైనది, తగిలితే సంభవిస్తుంది. దానివల్ల మానవుడు ఆకస్మికంగానైనా మారవచ్చు. ఇక రెండోది సాధారణంగా సున్నిత హృదయుల విషయంలో: ఏదైన విచిత్ర సంఘటన, అది ఎంత చిన్నదైనా, లోకం దృష్టిలో ఎంత అప్రాధాన్యమైనదైనా— జరిగినప్పుడు వారి మనస్సు ఇట్టే చివుక్కుమంటుంది. మనోహర్ పాత్రకు ఈ ఈ రెండు విషయాలు వర్తించవు. చిత్రం మొత్తంమీద, ప్రేక్షకుడికి అతనిమీద విహ్వాభావమే కలుగుతుందిగాని ఏ ఒక్క మంచి గుణం వున్నట్లు సానుభూతి కల్గదు. పైగా ''మీ వదిన వుండంగానీ కోర్కె నెరవేరకపోవటం వుండదు అన్న విషయం గుర్తులో వుంచుకుని ప్రయత్నించు (ఇది భావం మాత్రమే) అని వదినతో మనోహర్ చెప్పిన తర్వాత, అతని కత్తుల బేరంచూస్తే ఆ పాత్రమీద ఎంతైనా అపోహకల్గే అవకాశం కూడా వుంది. అలాటి వ్యక్తికి కల్గిన, కల్గగల్గిన ఎదురుదెబ్బ ఎలా వుండాలో దర్శకులు సరిగా భావించలేకపోయారు. పోనీ మనోహర్‌ది సున్నిత హృదయం అనుకుందామన్నా దానికి చిత్రంలో ఏమాత్రం తావు కల్పించలేదు. ఈ చిత్రానికి ఆయువుపట్టులాంటి పాత్ర కావటంవల్ల అతనిలో ఆ మార్పుకుతగ్గ సంఘర్షణను చూపించి వుండాల్సింది. ఇలాంటివే ఒకటిరెండు లోపాలనిపించేట్లున్నా చిత్రం మొత్తంమీద చాలా హుందాగాకన్పించింది.

అన్ని భావాలు సక్రమంగా దింపాలన్న ఆత్రుతతో శ్రీ అనిసెట్టి ప్రయత్నించి సఫలీకృతులైనా, ఒకటి రెండు చోట్ల భావాలకు తగ్గ భాష వాడలేకపోయారేమో అనిపించింది. అతి సున్నితమైన భావప్రకటన సమయాల్లో ఒకటి రెండు చోట్ల పరుషోచ్చారణం కల్పించటం కూడా జరిగింది. ఒక ఉత్తమ చిత్రాన్ని తెలుగులోకి దింపాలనే ప్రయత్నంలో చాలవరకు తగిన మాటలుపాటలు వ్రాసిన శ్రీ అనిసెట్టి నిజంగా ప్రశంసనీయులు.

ఒక భాషలోని ఉత్తమ చిత్రాలను ఇంకో భాషలోకి మార్చేబదులు, ఆ చిత్రాలను సబ్—టైటిల్స్ చేర్చి విడుదల చేస్తే మంచిది. లేకపోతే వాటిని తర్జుమా చేసేముందు నిర్మాతలు ఇంకా చాలా జాగ్రత్తలు తీసుకోవాల్సిన అవసరం ఎంతైనా కన్పిస్తోంది—ఇది ''డబ్బింగ్'' చిత్రాలన్నిటిని గూర్చి సలహా.

ఈ ''అనుమానానికి'' సంబంధించినంతవరకు—ఇది తెలుగు నాట ప్రజాభిమానం పొందుతుందనటంలో ఏం ''అనుమానం'' లేదు. మంచికథ, ఇంపైన సంగీతం, సంగీతపు గీటుల్లో వడిచిన సాహిత్యం తేటైన మాటలు—కళాభిలాష కాలక్షేపాలాగులకు ఆంధ్ర తమిళ భేదంలేదు గనక, ఆ బాలగోపాలమూ వీలైతే ఒకాపాలితో సహా (ఆనవనతమనిపించే నృత్య నాటకం వుంది గనుక) వెళ్ళి చూసి ఆనందించదగ్గ, నీతిదాయక, ఉత్తమ చిత్రం కన్నడ్ ప్రదర్శు ''అనుమానం'' కథ : కె. ఎస్. గోపాలకృష్ణన్, మాటలు, పాటలు : అనిసెట్టి, దర్శకత్వం : కృష్ణన్ పంజు.

'నాగరాజ్'



భరణీవారి "చాటసారి"లో నాగేశ్వరరావు, భానుమతి.

## త్వరలో విడుదల "కొరడా వీరుడు"

ఎం. ఎస్. ఎం. మూవీస్‌వారి "కొరడా వీరుడు" చిత్రం నిర్మాణం పూర్తయింది. ఈ చిత్రాన్ని జూలై మూడవ వారంలో విడుదల చేయాలని నిర్మాతలు ప్రయత్నిస్తున్నారు.

బాలయ్య, వీరప్ప, టి. కె. రామచంద్రన్, జానకి, తాంబరం లలిత ప్రభృతులు నటిస్తున్న ఈ(డబ్బింగు) చిత్రానికి మాటలు అనిశెట్టి, పాటలు : ములుకుట్ల, వేణుగోపాల్, సంగీతం : జి. పురుషోత్తం, నిర్మాత: ములుకుట్ల సుబ్రహ్మణ్యం.

## "స్త్రీ హృదయం"

నవ్యకళామందిర్‌వారు నిర్మిస్తున్న తొలి కానుక 'స్త్రీ హృదయం' చిత్రం జూలై మూడవ వారంలో విడుదల కాగలదని తెలుస్తోంది.

పద్మిని ప్రధానపాత్ర ధరిస్తున్న ఈ చిత్రానికి మాటలు, పాటలు: అనిసెట్టి, సంగీతం: నిత్యానందం ఛాయ : విన్సెంటు, దర్శకత్వం : శ్రీధర్ : (పెళ్లి కానుక) నిర్వహిస్తున్నారు. నిర్మాత : టి. రాజగోపాల రెడ్డి.

## శుభోదయా వారి "మమకారం"

శుభోదయా పిక్చర్సువారు నిర్మిస్తున్న 'మమకారం' చిత్రం మూడు వంతులకు పైగా పూర్తి అయింది.

# వార్తాభరణం

ఎన్. టి. రామారావు, అంజలీదేవి, రేలంగి, గిరిజ, కె. వి. ఎస్. శర్మ, బాలసరస్వతి డాక్టర్ శివరామకృష్ణయ్య, అల్లు రామలింగయ్య పేకేటి శివరాం నటిస్తున్న ఈ చిత్రానికి దర్శకుడు తాపీ చాణక్య, సంగీతం : ఘంటసాల, ఛాయ : ఎస్. ఎస్. వర్మ, కథ : అమ్మయ్యప్పన్.

నిర్మాతలు ఈ చిత్రంలో జగ్గారావు, రాజబాబు అనే యిద్దర్ని నూతనంగా పరిచయం చేయబోతున్నారు.

## సుచిత్రాఆర్ట్సు వారి "పట్టిందంతా బంగారం"

సుచిత్రా ఆర్ట్సువారి "పట్టిందంతా బంగారం" నిర్మాణం శరవేగంతో జరుగుతోంది.

"పువ్వులు ! విరికొమ్మల నవ్వులు" అన్న పాటను పి. లీలపాడగా రికార్డు చేశారు.

ఈ చిత్రంలో కథానాయకుడు శ్రీనివాస్‌గా హరినాథ్, కథానాయిక లక్ష్మిగా జమున నటిస్తున్నారు. కవి : సదాశివబ్రహ్మం, స్టూడియో వాహిని.

## 'మిస్. కమలా' కు ప్రారంభోత్సవం

విక్రం ప్రొడక్షన్స్‌వారి "మిస్ కమల" అనే సాంఘిక చిత్రం ప్రారంభోత్సవం యిటీవల జరిగింది. తెలుగు, తమిళ భాషల్లో నిర్మించబోయే ఈ చిత్రానికి దర్శకులు : బి. ఎస్. రంగా. ఈ ద్విభాషా చిత్రంలో రాజశ్రీ ప్రధాన భూమిక ధరిస్తోంది. తమిళంలో ప్రేమ్‌నజీర్, యం. ఆర్. రాధ, కుచలకుమారి, బాల సరస్వతి ప్రభృతులు. తెలుగులో గుమ్మడి, రమణారెడ్డి, బాల సరస్వతి, కుచలకుమారి సహాయ పాత్రలు ధరిస్తున్నారు. సంగీతం : విశ్వనాధన్, రామమూర్తి.

నెహ్రూ 'భారత దర్శనం' నుంచి తీసుకున్న ఒక ఘట్టం, వర్ణ నృత్య నాటకం ఈ చిత్రంలో ప్రత్యేకాకర్షణగా వుండగలదట.

## 'మోహినీ రుక్మాంగద'

భాస్కర్ ప్రొడక్షన్స్‌వారి మోహినీ రుక్మాంగద శర వేగంతో తయారవుతోంది. ఇంతవరకు 12 రీళ్ళ దాకా తయారైనట్లు వినికిడి. జమున, కృష్ణకుమారి, బాలయ్య, సూర్యకాంతం నటిస్తున్న ఈ చిత్రానికి దర్శకులు కె. యస్. ప్రకాశరావు. సంగీతం : ఘంటసాల.

ఇదికాక దర్శకుడు శ్రీ ప్రకాశరావు తమ ప్రకాష్ ప్రొడక్షన్స్ పేరిట "పురూరవ" అన్న పౌరాణిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు.

## చేతనావారి 'గుళ్లో పెళ్లి' పూర్తి

చేతనా ఫిలింస్‌వారు చాలాకాలంగా నిర్మిస్తున్న గుళ్లో పెళ్లి చిట్ట చివరకు పూర్తయింది. సెన్సారు ఆటంకాన్ని తప్పించుకుని విడుదలకు సిద్ధంగా వుంది. సంగీతం : రమేష్‌నాయుడు.



"జగదేకవీరుని కథలో" రామారావు, సరోజాదేవి.



అంజలి పిక్చర్సువారి "స్వర్ణమంజరి" ప్రారంభోత్సవంలో అంజలీదేవి, నిర్మాత ఆదినారాయణరావు.

# హిందీ చిత్రజగత్

## హమ్మత్ వాలేనౌజవాన్

శేఖర్, సంయూదాఖాన్ నటిస్తున్న రోవర్ ఫిలింస్ వారి 'హమ్మత్‌వాలే నౌజవాన్' సెన్సార్‌నుంచి బయటపడి విడుదలకు సిద్ధంగా వుంది. శ్రీ యల్. ఆర్. అస్థాన దర్శకత్వం వహించిన ఈ చిత్రంలో ఆగా, గోపాల్‌సైగల్, లిలియన్ ప్రభృతులు నటించారు. సంగీతం : చంద్రగుప్త.

## 'బొంబై కా చోర్' నిర్మాణం పూర్తి

కిశోర్‌కుమార్, మాలాసిన్హా ముఖ్య పాత్రలు ధరిస్తున్న న్యూ ఓరియంటల్‌వారి "బొంబై కా చోర్" చిత్ర నిర్మాణం పూర్తయింది. దీనికి నిర్మాత, దర్శకుడు : యస్. డి. నారంగ్.

## ఆర్. కె. వారి రాబోయే చిత్రాలు

జిస్ దేశ్‌మే గంగా బహతీహై చిత్ర నిర్మాణంతో విజయపథాన్నందుకున్న రాజకపూర్ "అజంతా" "సంగం" "మేరా నామ్ జోకర్" "సత్యం శివం సుందరం" "మై అవుర్ మేరా దోస్త్" అనే చిత్రాలు నిర్మించనున్నట్లు, వాటి చిత్రకథలు సిద్ధంగా వున్నట్లు వెల్లడించారు.

సంగం చిత్రంలో రాజకపూర్, వైజయంతీమాల, రాజేంద్రకుమార్ నటిస్తున్నారు.

## మహబూబ్ సినిమాస్కోప్ వర్ణ చిత్రం

దర్శక—నిర్మాత మహబూబ్‌ఖాన్ "సన్ ఆఫ్ ఇండియా" అనే చిత్రాన్ని సినిమా స్కోప్, వర్ణ చిత్రంగా నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలో బాల నటులు సాజిద్, కమల్‌జీత్, కుంకుం నటిస్తున్నారు. సంగీతం : నౌషద్. 'భారతి" అనే కొత్త నటిని ఈ చిత్రంలో పరిచయం చేస్తున్నారు.

## ఫిల్మాలయావారి సాంఘిక చిత్రం

ఫిల్మాలయావారు తమ ఏడవ చిత్రానికి ప్రారంభోత్సవం జరిపారు. అప్పుడే కొన్ని ఘట్టాలు చిత్రీకరించటం కూడా జరిగింది. ఫిల్మాలయా నటక శిక్షణశాలలనుంచి ముగ్గురు కొత్తవారు ఈ చిత్రంలో పరిచయం కాబోతున్నారు. జాయ్‌ముఖర్జీ మీనాచిట్నీస్, హరి, రాజేంద్రనాథ్ లు పాల్గొంటున్నారు. ఈ చిత్రానికి సంభాషణలు : కాశ్మీరి చిత్రకథ : హరీష్‌మెహ్రా, దర్శకుడు : ఆర్. కె. నయ్యార్.

## యస్. ముఖర్జీ సినిమాస్కోప్ చిత్రం

నిర్మాత శ్రీ యస్. ముఖర్జీ సినిమాస్కోపు, వర్ణచిత్రాన్ని నిర్మించేందుకు సన్నాహాలు చేస్తున్నారు. ఈ చిత్రాన్ని ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తా



"నాగిన్ సరస్ నగల్" లో జానీవాకర్, నళినీచోంకర్ వగైరా.

రట. దిలీప్‌కుమార్, వైజయంతిమాల, జయంత్, నజీర్ హుస్సేన్, హీరాలాల్, అమర్, రామ్ అవతార్, లీలామిశ్రా నటిస్తున్న ఈ చిత్రానికి దర్శకులు రామ్ ముఖర్జీ, సంగీతం నౌషద్, సంభాషణలు : వజహత్ మీర్జా, పాటలు, సహిర్ లుధియానవీ నిర్వహిస్తున్నారు.

# సంక్షిప్త వార్తలు

## శివాజీ గణేశన్ అమెరికా పర్యటన

ప్రసిద్ధ చలనచిత్ర నటుడు శ్రీ వి. సి. గణేశన్ (శివాజీ), అమెరికా ప్రభుత్వ ఆహ్వానం పై ఆ దేశంలో సుమారు రెండునెలలపాటు పర్యటించ బోతున్నారు.

శ్రీ గణేశన్ తమ పర్యటన కాలంలో అమెరికా లోని నటీనటులను కలుసుకొనటంతో పాటు, అక్కడి చలనచిత్ర నిర్మాణంలోని సాంకేతిక విషయాలు పరిశీలించి వస్తారు.

అమెరికా న మాచారశాఖ తాత్కాలిక సాంస్కృతిక విషయాధ్యోగిని మిస్. మార్తా బరన్స్ శ్రీ గణేశన్‌కు ఈ ఆహ్వానాన్ని ఇటీవల అందజేశారు.

## రాజకపూర్ భక్తుని బెదరింపు

మున్పై రెండు తడవలు "జిస్‌దేశ్‌మే గంగా బహతీహై" చిత్రం చూచిన ఒక యువకుడు, తమ వూళ్లో ఆడినంతకాలం, తనను ఆ చిత్రం ఉచితంగా చూడనివ్వకపోతే ఆత్మహత్య చేసుకుంటానని, బెదిరిస్తూ రాజకపూర్‌కు ఒక ఉత్తరం వ్రాశాడు.

దుర్గాప్రసాద్ అనే ఈ యువకుడు రాజస్థాన్ లోని గంగాపూర్ నివాసి. తాను అన్నిసార్లు చిత్రం చూచినట్లు దాఖలాగా, తన ఉత్తరంతోపాటు, స్థానిక గణేష్ థియేటరు టిక్కెట్లు ముక్కలు జతచేసి పంపాడట.

శ్రీ రాజకపూర్ ప్రస్తుతం జపాన్ పర్యటనలో ఉన్నందున, ఆయన సమాధానం వచ్చేందుకు కొంత కాలం పట్టవచ్చని, రాజకపూర్ అంతరంగిక కార్యదర్శి అన్నారు. మరి అప్పటిదాకా ఈ ఆత్మహత్యా ప్రయత్నం వాయిదా పడుతుందేమో.

## భారతదేశంలో పోలిష్ చిత్రం నిషేధం

"ఏషెస్ అండ్ డైమండ్స్" అన్న పోలిష్ చిత్రాన్ని మనదేశంలో జరగబోయే అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో ప్రదర్శించేందుకు కేంద్ర చలన చిత్ర సెన్సారు బోర్డు అనుమతి నిరాకరించింది.

ఇదే చిత్రానికి, వెనిస్‌లో జరిగిన చిత్రోత్సవంలో అంతర్జాతీయ చలనచిత్ర విమర్శక సమాఖ్య బహుమతి లభించింది.

## నాలుగు అస్సామీ చిత్రాల పూర్తి

ఈ ఏడాదిలోగా నాలుగు అస్సామీ భారీ చిత్రాలు పూర్తి కాగలవని తెలుస్తోంది. అందులో ఒకటి: శకుంతల మహాకవి కాళిదాసు నాటకం అభిజ్ఞాన శాకుంతలం ఆధారంగా డా. భూపేన్ హజారికా శకుంతల చిత్రాన్ని కలకత్తా రాధా స్టుడియోలో నిర్మిస్తున్నారు. సంగీతమయ చిత్రంగా తయారు కాగలదని తెలుస్తోంది.

## మొఘల్‌ల ప్రతిస్పర్థి లాఛిత్ బార్ ఫకన్

అస్సామీ చరిత్రలో ప్రసిద్ధి గాంచిన సైన్యాధిపతి, సారైఘాట్ యుద్ధం (క్రీ. శ. 1671) లో మొఘులులను ఎదిరించిన వాని జీవిత చరిత్ర ఆధారంగా ప్రాగ్జ్యోతి కళా మందిర్‌వారు లాఛిత్ బార్ ఫకన్ అన్న చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రం సెప్టెంబర్ 29 నాటికి విడుదల కాగలదని దని తెలుస్తోంది.

ఇని గాక "నరకాసుర" "హరిశ్చంద్ర" చిత్రాలు కూడా ఈయేడు పూర్తి కాగల చిత్రాల జాబితాలో వున్నాయి.



తేజావారి 'గుళ్ళోపెళ్లి'లో పార్వతి

## భారత్‌లో చిత్రోత్సవానికి జపానీ వర్ణ చిత్రం

భారతదేశంలో అక్టోబరు 27 నుండి నవంబరు 17 వరకు జరుగబోయే అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో "దిత్రీ ట్రెజర్సు' అనే జపాని టోహో సూపర్‌స్కోప్ వర్ణ చిత్రాన్ని ఆ దేశం తరఫున ప్రదర్శిస్తారు.

ఈ అంతర్జాతీయ చలన చిత్రోత్సవం ఢిల్లీ, బొంబాయి, కలకత్తా, మద్రాసులలో జరగబోతోంది. ఈ చిత్రోత్సవంలో జపాన్‌నుంచి పాల్గొనే ది "త్రి ట్రెజర్స్" అన్న చిత్రం సిసిల్ బి. డిమిల్లీ నిర్మించిన టెన్ కమాండ్‌మెంట్సుతో పోటీపడిందని పేరుపొందింది. ఆస్కార్ బహుమతి గ్రహీత హిరోషి ఇనగాకి ఈ చిత్రానికి దర్శకత్వం వహించారు.

## బెంగుళూర్‌లో కొత్త డిస్ట్రిబ్యూషన్ సంస్థ

బెంగుళూరులో "ప్రాణ్ ఫిలిమ్స్ డిస్ట్రిబ్యూటర్సు" అనే సంస్థ ఏర్పడింది. ప్రముఖ తమిళ నటుడు శ్రీ యం. ఆర్. రాధ ఈ సంస్థ కార్యాలయానికి ఇటీవల ప్రారంభోత్సవం జరిపారు.

సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ ఈడ్పుగంటి సురేంద్రనాథ్ సభాసదులకు స్వాగతం చెప్పారు. మైసూరు శాసన సభ్యుడు శ్రీ టి. పార్థసారధి అధ్యక్షత వహించారు.

ఈ ప్రారంభోత్సవానికి శ్రీయుతులు జగ్గయ్య, గుమ్మడి, నిర్మాతలు కె. కె. మహదేవన్, రంగారావ్, రాజేంద్రప్రసాద్ (జగపతివారు) శ్రీమతి లక్ష్మీ రాజ్యం తదితరులు పాల్గొన్నారు.

ఈ సంస్థ ప్రస్తుతం 'ఎల్లాం ఉనక్కాగ', "హలో మిస్టర్ జమీందార్" "తండ్రులు, కొడు

కులు" నాగార్జున్ అన్న చిత్రాలు డిస్ట్రిబ్యూషన్‌కు తీసుకుంది

## జకార్తాచిత్రోత్సవానికి ప్రతినిధివర్గం

జూలై 12 నుంచి 18 వరకు జకార్తాలో జరగబోయే భారతీయ చలన చిత్రోత్సవానికి ప్రతినిధి వర్గం, దక్షిణ భారత చలనచిత్ర వాణిజ్యమండలి అధ్యక్షులు శ్రీ ఎ. యల్. శ్రీనివాసన్ నాయకత్వాన వెళ్ళింది.

ఈ చిత్రోత్సవంలో చౌదవీకచాంద్, ఛోటీబహెన్, కల్పనా, నయాదౌర్, అపూర్‌సన్సార్, కాబూలీవాలా, మిస్సమ్మ, ఎడిక్కాదమేదై, మా యింటి మహలక్ష్మి చిత్రాలు ప్రదర్శిస్తారని తెలుస్తోంది.

ఇవిగాక తాజమహల్, రాధాకృష్ణ, హిమాచల్, భరతనాట్యం, అన్న వార్తా సంస్థ చిత్రాలు కూడా ప్రదర్శిస్తారని తెలుస్తోంది.

## ప్రజాసోషలిస్టు నాయకులకు శివాజీగణేశన్ విందు

సుప్రసిద్ధ తమిళ చలనచిత్రనటుడు శివాజీ గణేశన్, ప్రజాసోషలిస్టు నాయకులు మద్రాసు వచ్చినప్పుడు, వారికి బోగ్‌రోడ్డులోవున్న తమ ఇంటిలో విందు చేశారు.

ఈ విందులో శ్రీయుతులు అశోక మెహతా, గంగాచరణసిన్హా, సురేంద్రనాథ ద్వివేది, యస్. యం. జోషి, యస్. జి గోరే తదితర నాయకులు, ఎ. ఎల్. శ్రీనివాసన్, వి. సి. సుబ్రహ్మణ్యం, బి.ఆర్ పంతులు, ఎ. భీమ్‌సింగ్, టి. ఆర్. రామచంద్రన్ ప్రభృతి చలనచిత్రప్రముఖులు హాజరయ్యారు.

## చీనీ రచయిత లూసున్ జీవితంపై చలనచిత్రం

ప్రసిద్ధ చీనీ రచయిత 'లూసున్' జీవితాన్ని వర్ణచలన చిత్రంగా రూపొందించాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి.

సెప్టెంబరు నెలలో ఆ మహా రచయిత 80 వ జన్మ దిన సందర్భంలో చిత్ర నిర్మాణానికి ప్రారంభోత్సవం జరుగుతుంది.

ఈ చిత్రాన్ని షాంగ్‌హై నగరంలోని తైన్‌మా స్టూడియోలో నిర్మిస్తారు. చిత్ర కథ : చెన్ పీయ్‌చెన్ ప్రభృతులు. దర్శకత్వం : చెన్‌లిటింగ్.

## బి. యన్. రెడ్డికి పుత్రికావియోగం

ప్రఖ్యాత చలనచిత్ర దర్శక నిర్మాత శ్రీ బి. యన్. రెడ్డి కుమార్తె శ్రీమతి హెచ్. విజయలక్ష్మి తమ పితృగృహంలో జూన్ 23 వ తేదీన మరణించారు.

శ్రీమతి విజయలక్ష్మికి ముగ్గురు సంతానం భర్త శ్రీ హెచ్. జి. విజయరాఘవరెడ్డి, మైసూర్ ప్రభుత్వంలో కార్యదర్శి పదవిలో వున్నారు.

* * *

ప్రఖ్యాత నవలా రచయిత మార్క్‌స్కాట్లోతన తాజా ప్రచురణ "మిస్టర్ మోజెస్" అన్న నవలను చిత్రంగా నిర్మించేందుకని, ఒక నిర్మాతకు 1,05,000 డాలర్లకు అమ్మివేశాడని వార్త.★





# మనమూ-మన దేహస్థితి

(15-వ పేజీ తరువాయి)

జాతికి చెందినవి. మత సాంఘికాచారములు తాతల నుంచి తండ్రికీ, తండ్రినుంచి పిల్లలకీ వచ్చేవి. మాట లాడడంలో తల్లి తండ్రులను పిల్లలు తరచు అనుకరిస్తారు. ఈవిధంగా నత్తి కూడా ఒక అనుకరణ దోషమేమోనని అనుకుంటానికి కారణాలున్నవి. ఎందుకంటే ఆ పరిస్థితులనుంచి వారిని తొలగించి, మంచి శిక్షణ యిచ్చినప్పుడు, నత్తి తరుచు నివారింపబడుతున్నది.

**నత్తి జాత్యభేదము (Sex)**

పరిశోధనలవల్ల నత్తి, ఆడపిల్లలలోకంటె మొగ పిల్లలలో ఎక్కువగా వ్యాపించివుంటుందని తేలింది. వయస్సునుబట్టీ కుటుంబములనుబట్టీ శాతంగా ఆడ మొగ పిల్లలలో నత్తి వారిసంఖ్య మారుతూ వుండవచ్చును.

**నత్తి నరాళయ సంబంధమైన వ్యాధియా? లేక అది మానసిక వ్యాధియా.**

శాస్త్రజ్ఞులలో ప్రతివ్యాధిని గురించీ రెండు అభిప్రాయములు అనాదినుంచీ వుంటున్నవి. ఒకటి ప్రతివ్యాధికీ, లోపానికీ భౌతికమయిన కారణం ఉండిఉండాలనే భావన, రెండవది శారీరక లోపములు లేకపోయినా మానసిక కారణములవల్ల శరీరధర్మములు, మారి వ్యాధి ఏర్పడవచ్చుననే భావన. ఈ రెండు భావనలూ నత్తి విషయంలో కూడా పాశ్చాత్యశాస్త్రజ్ఞులలో వ్యాపించివున్నవి. కొవి అత్యధిక సంఖ్యాకులు, నత్తి శరీర లోపముల వల్ల యేర్పడేదికాదనీ, మానసిక కారణములవల్ల వ్యక్తి పరిణామము, లోపభూయిష్ఠమై యేర్పడే లోపమనీ విశ్వసిస్తున్నారు. మానసిక వ్యాధులతో బాధపడే వారితో నత్తితో బాధపడే వారిని పోల్చి చూస్తే నత్తివారు, సహజమైన మానసిక స్వభావం కలవారుగా కనుపించారుగాని, ఏ మనస్తత్వ శాస్త్రీయమయిన పరీక్షలవల్లా వారు మానసికమైన వ్యాధులతో బాధ పడుతున్నట్లు కనిపించలేదు. మానసిక వ్యాధులున్నవారిలో—అంటే తెలివి తేటలు, జ్ఞాపకశక్తి, వూహ, మాట పొందిక, భావ గాంభీర్యము—ఇటువంటి విషయాల్లో లోపములున్నవారిలో — నత్తివారున్నా, నత్తికీ, వీటికీ ఏ సంబంధమూ వున్నట్లు కనిపించలేదు. అయితే, నత్తివల్ల మాట్లాడాలనివున్నా మాట్లాడకుండా బిగించుకు కూచోడం, నలుగురిలో మెలగకుండా ఏకాంతంగా ఉండిపోయే స్వభావమూ, యిటువంటి మానసిక లక్షణములు ఏర్పడడానికి అవకాశం వుందని శాస్త్రజ్ఞులు తేల్చేరు.

(సశేషము)

నవ్వుకున్నాడు. చూపులు గగనాన్నుంచి, గుబ్బ (వెరువుగట్టు)కు మళ్లించాడు. వెరువులో గొడ్లను కచుగుతున్న గొడ్లకాపరిని అతనికళ్ళు చూశాయి. ఆ గొల్లవాడు తనలో తనే ఏవో పాటలు పాడు కుంటూ ఆనందిస్తున్నాడు. తనకేసి చూస్తున్న వాళ్లకేసికూడా చూడనంత తన్మయత్వంలో మునిగిపోయాడు. మృత్యుంజయుడు అతనికేసి అప్యాయంగా చూడసాగాడు. పాడుకుంటున్నవాడల్లా ఆ గొల్లవాడు మృత్యుంజయుడు తనకేసి చూడడం చూసి "దండాలు బాబూ" అన్నాడు. మృత్యుం జయుడు చిన్నగా నవ్వాడు. ఇంతలో ఆ గొల్లవాడు "బాబూ, పాము, తొలగండి" అని అరుస్తూ వీళ్ళల్లోంచి ఖంగారుగా ఇవతలకు పరిగెత్తాడు. మృత్యుంజయుడు చివాలున లేచాడు. కాని తాచు పాము అతని చేతిమీద కరచింది. గొల్లవాడు కెవ్వున కేకవేసి కళ్ళు మూసుకుని ఒక్క క్షణం తర్వాత తెరిచాడు. అతనికళ్ళకు మృత్యుం జయుడు నవ్వుతూ కనిపించాడు. గొల్లవాడి కళ్ళు ఆశ్చర్యంతో గిరగిరలాడాయి. "బాబుగారూ, బాబుగారూ" అంటూ అతన్ని సమీపించాడు. మృత్యుంజయుడు చిన్నగా నవ్వి "ఏం ? చచ్చి పోయి ఉంటాననుకొన్నావా ?" అన్నాడు. అంతలో అతని నవ్వు మాయమయి ముఖంనల్లబడి పోయింది. "నేను అంత తేలికగా చచ్చేటంత అదృష్టవంతుణ్ణి కాదు" అని చకచకా కారుకేసి నడక ప్రారంభించాడు.

* * *

మునసబుగారి ఇంటి అరుగుమీద ముగ్గురు కూర్చుని ఉన్నారు. వాళ్ళు మునసబుగారూ, కరణం, కొత్తగా ఆవూరు వచ్చిన వ్యక్తి. ఆ కొత్త వ్యక్తి తన వివరాలు చెప్ప ప్రారంభించాడు.

"నాపేరు రాఘవేంద్ర. నేను సైకాలజీ,అంటే మనిషితత్వం, మనోధర్మంమీది శాస్త్రాలు ఆమూ లాగ్రంగా చదివి అన్ని డిగ్రీలూ పొందాను వాటిని విడమర్చి ప్రయోగాలుచేసి చరిత్రకు, అద్భుత సంఘటనలకూ వాటి ఉనికికీ కల సంబంధాలు నిరూపించాలని నా ఊహ. అందుకనే అద్భుత సంఘటనలకోసం ప్రతీ ఊరూ తిరుగు తున్నాను. ఈ పనికోసమే వివాహాది ప్రతిబంధ కాలు మానుకున్నాను. వాటిని వదులుకున్నాను కూడ."

"అయితే మీరు కనుక్కున్న విశేషాలు ఏవి టంటారు ?" అన్నాడు కరణం. ఆ ప్రశ్నకు రాఘవేంద్ర హుషారుగా చెప్పనారంభించాడు. హోసవదనుడై ప్రారంభించాడు.

"దయ్యాలు, పిశాచాలు, వాటిని గూర్చి ఆమూ లాగ్రం చదివాను. అవి ఉన్నాయని నిరూపించాను. ఆ విషయాలు రాసి గ్రంథంగా తయారుచేశాను."

"దయ్యాలు ఉన్నాయంటారా ?" కరణం అడిగాడు.

"ఆహా ! మహారాజుల్లా ఉన్నాయి. మంచిని చేసే భగవంతునికి ఉనికి ఎంత నిర్వివాదమో, చెడును చేసే దయ్యాలు, పిశాచాలూ. వాటి ఉనికి అంతా నిర్వివాదం" అని ఆగాడు.

ఇంతలో మృత్యుంజయుని కారు అటునుంచి వెళ్లింది. ముగ్గురూ ఆ కారుకేసి చూశారు. 'ఇదీ ఇదండీ, ఈ ఊళ్లో వింత" అన్నాడు మునసబు

# క్షమాహతుడు

(9-వ పేజీ తరువాయి)

గారు కారు వెళ్లినవైపు వెయ్యి చూపిస్తూ. రాఘ వేంద్ర నవ్వి "ఇలాటివి వింతలు కావు. మీ ఊళ్లో కారు మీకు వింత అవ్వచ్చు. కానీ దేశా నికి వింతకాదు." అన్నాడు. మునసబు మీసాలు సరిచేసుకుని నవ్వాడు. "భలే తెలివిగలవాడివయ్యా! వింత 'కారు' కాదు, కారులోని మనిషి" అన్నాడు. రాఘవేంద్ర సర్దుకుని కూర్చుంటూ "ఏవిటే ! చెప్పండి ! చెప్పండి" అన్నాడు. మునసబు చుట్ట పారేసి పక్కనున్న చెంబుడు మంచినీళ్లూ త్రాగి ప్రారంభించాడు.

"ఈనాటికి ఖచ్చితంగా ఏడు సంవత్సరాల క్రితం ఈ ఊళ్లో "నారాయణ" అనే లక్షాధి కారి ఒక భవనం కట్టించుకుని పట్నంలో పోగు



పత్రికా విలేఖరులు అంతా లండన్‌లో కలిసి నప్పుడు జరిగింది ఇది. అందు ఒకరు, ఎదురుగుండా వస్తున్న మరి వకరిని ఉద్దేశించి: "అవివేకులకు నేను దారియివ్వను" అని చేతులు జాపి నడుస్తుంటే ఎదుటి విలేఖరి "కాని, నేనుమాత్రం అవివేకులకు దారియిస్తాను." అని ప్రక్కకు తప్పుకొన్నాడు.

సి. సత్యనారాయణమూర్తి
(విజయనగరం)



చేసుకున్న డబ్బంతా అందులో జారేసుకున్నాడు. నిశ్చింతగా నాలుగు సంవత్సరాలు ఉన్నాడు. తర్వాత మకాం మార్చేశాడు. ఆ భవనం మాత్రం తాళాలు వేసిఉంది. తర్వాత యివాల్టికి నికరంగా ఇరవై రోజులనాడు ఆ 'నారాయణ' ఇంకో నరుణ్ణి తీసుకొచ్చి ఆ భవనం అతనికి అమ్మేశాడు. ఆ నరుడే మృత్యుంజయుడు. అతడు కడు ధనవంతుడు..... కుర్రాడే .... పాతికే ళ్లుంటాయి .... కానీ ఎప్పుడూ దయ్యం పట్టినవాడిలా ఉంటాడు....మాట్లాడడు. మాట్లాడించినా ఎక్కువ మాట్లాడడు. ఈవూరు ప్రజ అతన్ని పిచ్చివాడన్నారు. మరికొందరు దేవుడు అన్నారు...కరణంగారూ 'దేవుడే' అంటారు... అనాటినుండి ఒక్కడే ఉంటున్నాడు. నా అన్నవా ళ్లెవ్వరూ లేరట. ఆ మేడలో చేరిననాడు నాలు గైదువేలు పెట్టి యీ ఊరు వూరంతకీ పార్టీ చేశాడు. అనాటినుండి ఎవరు అడిగితే వాళ్లకు దానం అంతో, యింతో చేస్తున్నాడు ... అంతే..."

"ఆ ! ఇంతకన్నా వింతలు నేను కళ్ళా చూశాను" అంటూ రాఘవేంద్ర తన జుట్టు గుప్పెడు దొరకబుచ్చుకున్నాడు. కరణం, మున సబులు ఒకళ్ల ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు.

"...ఒకవూళ్లో ఒక చదువుకున్నవాడు ఉన్నాడు. అతనికి భార్యకూడా ఉంది ... అతనికి ఒక జబ్బు ఉండేది...రాత్రి నిద్దరలో లేచేవాడు, నడిచేవాడు, పాడేవాడు, పరిగెత్తేవాడు .... అయితే ఈ విష యాలన్నీ నిద్రావస్థలోనే జరిగేవి. తెల్లారి ఈ విషయాలు ఎవరిద్వారానైనా వింటే అతను ఆశ్చర్యపోయేవాడు. అతను ఒకనాడు తన భార్యను —నిద్రావస్థలోనే సుమండీ—పీక నులిపి చంపేశాడు. చివరిఘట్టంలో అతనికి మెలకువ వచ్చింది. తను చేసిన ఘోరకృత్యాన్ని చూసి చకితుడై వెంటనే ఆత్మహత్య చేసుకున్నాడు."

కరణం, మునసబులు అతని కథను ఆశ్చర్యంతో విన్నారు. ఈలోగా గొల్లవాడు వచ్చి మృత్యుం జయుడికి పాము కరచిన సంగతీ, అతను చావ కుండా ఉన్న సంగతీ, ఆయాసంతోకూడిన ఆశ్చ ర్యంతో చెప్పాడు. "ఇది మరీ వింతగా ఉందే ? పాము కరచినా నాకేం అని ఉండడం...వింత" అన్నాడు కరణం ఆశ్చర్యంతో. ఆ మాటలకు రాఘ వేంద్ర ఫకాలుమని నవ్వి "మ్చా .... యింత కన్నా వింతలు సవాలక్ష ఎరుగుదును" అన్నాడు. అతని మాట ఎవరూ వినలేదు.

"ఆయన్ని చూసినట్లు ఉంటుంది. వెళ్దాం వస్తారా ?" అన్నాడు కరణం ఇద్దర్నీ ఉద్దేశించి. 'ఆహా' అన్నారు. ముగ్గురూ బయల్దేరారు.

* * *

కారు దిగి మేడ ఎక్కిన మృత్యుంజయుడు చివరికి బూట్లయినా విప్పకుండా మంచంమీద పడి ఏడుపు ప్రారంభించాడు.

"ఎందు కీవ్యర్థజీవితం ? ఎవరికోసం ఈ బ్రతుకు ? ఏ ఘనకార్యం చేయడానికి ? నేను ఎందుకు బ్రతకాలి ? ఎలా చావాలి ? పశ్చా త్తాపానికికూడా ఈ లోకంలో ప్రాయశ్చిత్తం లేదా ? ఒక్క ప్రాణి హృదయఘోష మరో ప్రాణిని ఇంత నిర్దయగా శపించగలదా ? ఇది ప్రపంచంలో చాలాచోట్ల జరుగుతుందా ?"

మృత్యుంజయుడు ఆవేశంతో తల మంచం కోడు కేసి బాదుకున్నాడు. తల పగిలి నెత్తురు కారింది. మంచంమీద కూర్చుని ఆరాటావేశాలతో రొప్పసాగాడు. ఇంతలో తలుపు చప్పుడయింది. 'ఎవరది ?' అని అరిచాడు. తలుపవతలనుంచి నౌకరు వీరాస్వామి. "నేను బాబూ — కరణంగారూ, మునసబుగారూ, ఇంకెవరో మిమ్మల్ని చూడా లని వచ్చారు" అన్నాడు. ఆ మాటలకు మృత్యుం జయుడు అదిరిపడ్డాడు. ఓ క్షణకాలం అలానే ఉండి పోయి "వస్తున్నానని చెప్పు" అన్నాడు. నుదురు మీద కారుతున్న రక్తాన్ని రుమాలుతో చకచకా తుడుచుకుని, జుట్టు వెనక్కుతోసుకుని తలుపు తీసుకుని క్రిందకు వచ్చాడు. మృత్యుంజయుణ్ణి చూసి ముగ్గురూ లేచి నించున్నారు. 'కూర్చోండి' అనేసి అతను కూర్చున్నాడు. అతని ముఖం ఎర్రగా ఉబ్బిపోయి ఉంది. కళ్ళు ఎర్రబడి ఉన్నాయి. బట్టలు నలిగిపోయాయి. జుట్టు

పోయి ఉంది. అతన్ని ఆ పరిస్థితిలో చూసే సరికి ఆ ముగ్గురికీ భయం ముంచుకు వచ్చింది. ముందుగా నిశ్శబ్దాన్ని భంగపరచే ధైర్యం ఎవ్వరికీ కలగలేదు. చిట్టచివరికి తనకున్న కొద్దిపాటి పరిచయాన్ని పురస్కరించుకొని కరణం తతిమ్మా ఇద్దర్నీ పరిచయంచేశాడు. "మునసబుగారిని ఎరుగుదును" అన్నాడు మృత్యుంజయుడు ముక్తసరిగా.

"తమకు పాము కరిచిందట! ఎలా కరిచింది?" అన్నాడు కరణం.

"ఆ చెరువుగట్టున పడుకున్నాను. కరిచింది. మరేం ప్రమాదం లేదులెండి. నాకు పాము విషం ఎక్కదు" మృత్యుంజయుడు బలవంతంమీద నవ్వు ముఖంమీద నిలుపుకున్నాడు.

"అవును... చాలామందికి పామువిషం ఎక్కదు."

మృత్యుంజయుడు ఆ మాటలు అన్న రాఘవేంద్ర కేసి చూశాడు. "మీ కెలా తెలుసు." అన్నాడు.

"నేను పూర్వ, ప్రాచీన అద్భుతవిషయాలూ, అవి జరిగిన స్థలాలూ చాలా సందర్శించాను. నాకు ఇలాటి వింతలు చాలా తెలుసు" అన్నాడు టై సవరించుకుంటూ.

"అహా! అంతవరకేనా? వాట్లకు విరుగుడు.. పాము కరచినా చావనివాళ్లను చంపే విషయాలూ, విషాలూ తెలుసా?" మృత్యుంజయుడు ఆత్రంగా అడిగాడు. రాఘవేంద్ర తనకు ఆ విషయాలు తెలియవన్నాడు. కాస్సేపు కూర్చుని ఎవరిదారిన వాళ్ళు పోయారు.

* * *

ఆ రాత్రంతా మృత్యుంజయుడు నరకయాతన పడ్డాడు... కల ... కలలో ... అవే మాటలు .... అదే నవ్వు". అతను లేచి కూర్చున్నాడు. గది తనను చూసి ఫకాలుమని నవ్వినట్లు బాధపడ్డాడు. "ఏమిటే విధి నియమం? నేను చావాలి. చచ్చి తీరాలి... "నేను చావాలి" అంటూ గావుకేకలు వేశాడు. ఆ కేకకు వీరాస్వామి తలుపు తోసుకుని వచ్చాడు. మృత్యుంజయుడు వీరాస్వామిని చూస్తూనే అతని రెండుబబ్బలూ పట్టుకుని "నేను చావాలి. నన్ను చంపగలవా? నీకు నా ఆస్తంతా ఇస్తాను" అంటూ అరవసాగాడు. ఆ మాటలు విని వీరాస్వామి విలవిల్లాడిపోయాడు. అతనికి మృత్యుంజయుని వైఖరి అంతుపట్టలేదు... మృత్యుంజయుడు అతని కాళ్ళుపట్టుకుని వెర్రివాడిలా ఏడుస్తూనే ఉన్నాడు. వీరాస్వామి మృత్యుంజయుని ప్రక్కన కూర్చుని అతని భుజంమీద చెయ్యి వేస్తూ "బాబుగారూ, దేవుడు మన్ని పుట్టించింది చావడానికి గాదు. బ్రతకడానికే! మనిషి జన్మే మంచిది. అన్ని జన్మలకన్నా, ఈ జన్మలోనే మనం ఆనందం అనుభవిస్తాం... అలా ఎందుకు ఇదౌతారు... మీకేం? లేనివారా? ఉన్న మారాజులు. వయస్సున్నవారు.. వివాహం చేసుకోండి... నామాట వినండి" అన్నాడు.

"వివాహమా? నాకా? పిల్లేదు... నేను చావాలి. చావాలి. పెళ్లి చేసుకుంటే చస్తానా?" అని అరిచాడు. వీరాస్వామి మారు మాట్లాడలేదు. మృత్యుంజయుడు ఒక్క ఊపులో లేచి ఇనప్పెట్టె తాళాలుతీసి కొన్ని కట్టలు ప్యాంటు

# క్షమాహంతుడు

జేబులో కుక్కుకుని ఒక కట్ట వీరాస్వామిమీదికి విసురుస్తూ "వీరాస్వామీ! నేను అలా వెళ్తున్నాను. నే వొచ్చేదాకా ఇల్లు చూసుకో" అనేసి వెర్రివాడిలా పరిగెత్తాడు.

వీరాస్వామి తెప్పరిల్లి క్రిందికి పరిగెత్తుకుని వచ్చేసరికి కారు చీకటిని దూసుకుంటూ కను చూపు మేర దాటిపోయింది.

* * *

తెల్లవారకుండానే రాత్రి జరిగిన సంఘటన ఊరు ఊరూ పాకిపోయింది వీలైనంతవరకూ పనులు మానేసి ప్రజలు గుంపులు గుంపులుగా పోగై గుసగుసలాడడం ప్రారంభించారు. తెల్లవారుతూ తెలిసిన విషయాన్ని పుచ్చుకుని 'కరణం' మునసబింటికి బయల్దేరాడు వీధరుగుమీద కూర్చున్న మునసబు కరణాన్ని చూస్తూనే 'ఛాలెంజిమార్కు'నవ్వు నవ్వాడు. కరణం మాట్లాడకుండా అరుగుమీద కూర్చున్నాడు.

"చూశావుటయ్యా, నేను చెప్పలేదూ, అతనికి పిచ్చి అని, కాదన్నావు .... దేవుడన్నావు, అదన్నావు... ఇప్పుడు తేలిందా?... చావాలి, చావాలి అని చచ్చేదాకా అరవకపోతే ఉరిపోసుకోరాదా? మరేదైనా చెయ్యరాదా? చావడానికి చచ్చినన్ని నదుపాయాలు ఉన్నాయి..." అన్నాడు గర్వంగా.



ఇంతలో రాఘవేంద్రకూడా వచ్చి అరుగుమీద జేరాడు. "ఈ వింత విన్నారూ?" అన్నాడు మునసబు వింతలు పోగుచెయ్యడమే పనిగా పెట్టుకున్న రాఘవేంద్రతో.

"ప్చ .... ఇదేం వింత? ఇంతకన్న వింతలు, వింతింతలూ, ఇక్కడ ఎన్నో ఉన్నాయి" అంటూ నాటిగా తన బుర్రకేసి చూపించుకున్నాడు. కరణం, మునసబులు వినుగ్గా ముఖాలుపెట్టారు.

"కొందరు ఉంటారు" రాఘవేంద్ర ప్రారంభించాడు. "వాళ్ళకు ఉన్నట్లుండి జన్మాంతర జ్ఞానం కలుగుతుంది. ఇది వినండి .. ఒక వూళ్లో ... వూరు .... కాదు పట్టణం... పేరు చెప్పనులెండి .... ఆ పట్టణంలో ఒక వ్యాపారి ఉండేవాడు. అతను చాలా గడించాడు. ఆయన్ని నడిబజారులో ఒక ఆడది పుచ్చుకుని 'ఫఢేల్, ఫెడేల్' మని పాత జోడుతో తగల్నిచ్చి, నిటారుగా నించుంది. ఆ వ్యాపారి తేరపారి ఆమెకేసి చూసి "ఆ! పద్మా, నువ్వా, గ్రహించలేక పోయాను" అని ఆమె కాళ్ళు పుచ్చుకున్నాడు. ఆమె పిచ్చిదట .. ఆపిల్ల తనకన్నా మించిన ఆ పిచ్చిని చూసి హడిలిపోయింది. ఆ మర్నాడు ఆపిల్లకి తన ఆస్తిలో సగం రాసి, మిగతా సగం పెళ్లాం పిల్లలకు రాసి అతను సన్యాసుల్లో కలిసిపోయాడు. 'ఇదేం' అని అడుగుతే "ఆపిల్ల క్రితం జన్మలో నా కూతురు . దాని ఆస్తి దానికి ఇవ్వక దాన్ని అన్యాయం చేశాను. దానికని అది ఉరితీసుకుని చస్తూ "వచ్చేజన్మలోనైనా నీ దగ్గర నీ ఆస్తిలో సగం పొందుతాను" అని శాపం పెట్టింది".. అంటాడు ఈ కథ విన్నవాళ్ళు అందరూ ముక్కుమీద వేలు వేసుకుంటారు కానీ, ఆ వ్యాపారిని నేను స్వయంగా చూశాను. పలకరించాను. నిజమని తేల్చుకుని రాసుకున్నాను"-,అని ఆయాసంతో ఆగాడు. "ఆ! నిజంగానా" అన్నారు వాళ్లిద్దరూ ముక్కులమీద వేళ్ళు వేసుకుంటూ.

* * *

మృత్యుంజయుడు వెళ్లి అనాటికి మూడు రోజు లయ్యింది. ఆవేళ తెల్లవారుతూనే రాఘవేంద్ర మృత్యుంజయుడి బంగళాకు వెళ్లి "ఒక వేళ ఇదిగాని దెయ్యాలకొంపా?" అని తన పరీక్ష ప్రారంభించాడు. ఇంతలో బయట కారు ఆగింది. అతను లోకీలున ఒక సోఫాలో కూర్చుండిపోయి, మెడ తిప్పి గుమ్మంవేపు చూడసాగాడు. మృత్యుంజయుడూ, అతని వెనక ఒక అమ్మాయీ ఆ వెనక ఒక వృద్ధుడూ లోపలకు వచ్చారు .... రాఘవేంద్ర లేచి "నమస్కారమండి" అని ఆశ్చర్యాన్ని అణుచుకున్నాడు. "కూర్చోండి ఇప్పుడే వస్తాను" అని మృత్యుంజయుడు వాళ్లతో పైకి వెళ్ళాడు. రాఘవేంద్ర ఆలోచనల్లోపడ్డాడు. ఒక పావుగంట గడిచింది మృత్యుంజయుడు నవ్వుతూ వచ్చి అతని ఎదురుగా సోఫాలో కూర్చుంటూ "ఏమిటి? మా ఇంటిని పరీక్షిస్తున్నట్లున్నారు?" అన్నాడు. ఆ ప్రశ్నకు రాఘవేంద్ర గతుక్కుమని "లేదండీ, పురాతన సౌధంకదా, ఏవైనా గాలులు అవీ .... ఉంటాయేమోనని, పరీక్షించాలనీ, మీ అనుమతి పొందాలనీ వచ్చాను" అన్నాడు. మృత్యుంజయుడు కులాసాగా నవ్వాడు. "అలాంటివి ఏం లేవు మరేమైనా అడగండి" అన్నాడు.

"నేను ఇలాంటి అద్భుతాలు చాలా చూశాన్ను మీరు ఆనందంలో ఉన్నారు కాబట్టి ఒక విచిత్రాతి విచిత్రమైన సంఘటన చెప్తాను వినండి" అంటూ ప్రారంభించాడు.... "ఇప్పటికి నూట ఇరవై సంవత్సరాల క్రితం....విషయం .. . అంత క్రితం కూడా జరిగిన సంగతులు ఉన్నాయి .కాని ఇది .... ఒక వూళ్లో ఒక యువకుడు ఉండేవాడు. అతనూ మీలాగే ఒంటరిగా ఉండేవాడు. ఆ ఊళ్లోనే అతను ఒక వివాహం చేసుకున్నాడు. అతని భార్య .... ఆమె ఒకనాడు హఠాత్తుగా గుండె ఆగి చచ్చిపోయింది మరో వివాహం .... ఆమె అలాగే చచ్చిపోయింది. మూడో పెళ్లికూడా —ధనవంతుడు కాబట్టి చేసుకున్నాడు. ఆ పిల్లా అలాగే పోయింది. ఇక ఆ వూరు ప్రజలకు అతని మీద అనుమానం పుట్టింది. డాక్టర్లు ముగ్గురు భార్యలూ గుండె ఆగడంవల్లే చచ్చినట్లు చెప్పారు. పైగా వాళ్ళు ఎలాటి జబ్బుమనుష్యులూ కారట. ఏదో హఠాత్తుగా విన్న వార్తవల్ల చనిపోయారట. కానీ ఆ యువకుడు తను ఎలాటి మాటలూ చెప్పలేదని ఒట్టుపెట్టాడుట... ఆవూరి ప్రజలు అతన్ని రాక్షసుడు అన్నారు. హంతకుడు అన్నారు. ప్రాణాలను తినే దయ్యం అన్నారు. కొంతకాలం తర్వాత అతను ఎవరికీ తెలియకుండా పరారీ అయ్యాడట" .... రాఘవేంద్ర చెప్పడం మానేసి తలఎత్తి చూశాడు. సోఫాలో మృత్యుంజయుడు

ముచ్చెమటలతో మూర్ఛపడి ఉన్నాడు రాఘవేంద్ర ఖంగారుతో అటూఇటూ పరుగెత్తాడు. మేడ మీంచి ఆ వృద్ధుడూ, ఆ అమ్మాయీ దిగివచ్చి ఉపచారాలు చేశారు. కొద్ది నిముషాలకు మృత్యుంజయుడు కోలుకొని ఎదురుగా ఉన్న రాఘవేంద్రను చూసి "ఇలాటి విషయాలు చెప్పి నా మనసును పాడు చెయ్యకండి" అన్నాడు కటువుగా. "క్షమించండి" అని రాఘవేంద్ర లేచి వెళ్ళిపోయాడు. మృత్యుంజయుడు తనలో తనే ఏదో గొణుక్కుంటూ మేడమీదికి వెళ్ళిపోయాడు.

* * *

మృత్యుంజయుడు ఎవరినో పిల్లనీ మరో మునలాడినీ తెచ్చాడన్న విషయం ఆఘ మేఘాలమీద ఆ వూరంతా పాకిపోయింది. రాఘవేంద్ర తిన్నగా మునసబుయింటికి వెళ్ళాడు. మునసబు కరణాలకు "ఆ విషయం" తనవోటితో చెప్పాడు. ఆ సంగతి విన్న కరణం కొందరు కొందరు కొన్ని కొన్ని సంగతులు వినలేరు. మనస్సు చాలా సున్నితం అయివుంటే వినలేరు. ఘోరాన్ని చూడలేరు" అన్నాడు రాఘవేంద్ర. మునసబు కొనసాగాడు.

"అయితే ఆ పిల్లా, పిల్లాడూ, అదే .... ముసలాడూ ఎవరు ?" అన్నాడు రాఘవేంద్ర తల వెగరేస్తూ.

"ఏమో ! రేపిపాటికి తెలియదా ?" అన్నాడు మునసబు.

"అలాకాదు. మనం వెళ్ళి తెలుసుకుందాం. ఇందులో తప్పేంలేదు. తప్పంటే ... అతడు చేసిన వాటిల్లోనే ఉండాలి, కానీ, మనం చెయ్యబోయే వాటిల్లో ఏం ఉండదు" అన్నాడు రాఘవేంద్ర. కరణం, మునసబులు పాలోచనగా ఒకళ్ళముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు.

"సాయంత్రం వెళ్దాము. ఇప్పుడు వెళ్ళితే బాగుండదు. అనుమానించిన ట్లుంటుంది" అన్నాడు, కరణం ఆ ఇద్దర్నీ ఉద్దేశించి. వా రిద్దరూ కూడా 'ఊ' న్నారు

* * *

సాయంత్రం కన్నా పెందరాళే జయల్దేరి ముగ్గురూ మృత్యుంజయుడి ఇంటికి చేరుకున్నారు. లోపలకు వస్తూనే ఎదురుగా సోఫాలో కూర్చున్న వ్యక్తిని చూస్తూ "అరే ! జానకి రామయ్యా ! నువ్వా" అని కరణం మునసబులు ఏకకంఠంతో ప్రశ్నించారు. ఆ వ్యక్తి లేచి "రండి రండి" అన్నాడు. వాళ్ళు ముగ్గురూ కూర్చున్నారు. ఇంతలో మృత్యుంజయుడు కూడా నవ్వుతూ వచ్చి కూర్చున్నాడు. రెండు క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి.

"మీకు జానకిరామయ్యగారు తెలుసా ?" అన్నాడు కరణం నిశ్శబ్దాన్ని చలిపి చంపేస్తూ.

మృత్యుంజయుడు ముచ్చటగా నవ్వాడు. "నేను మొన్న రాత్రి కారు డ్రయివు చేసుకుంటూ వెళ్ళా నా ? వెళ్ళివెళ్ళి తిన్నగా ఈయనమీద పెట్టాను..." మృత్యుంజయుడు తను చెప్పటం మాని జానకిరామయ్య కేసి చూపు మళ్ళించాడు. జానకిరామయ్యగారు 'అవును' అంటూ కాలుకు కట్టుకున్న కట్టు చూపించాడు. మృత్యుంజయుడు మళ్ళా ప్రారంభించాడు.

"....ఆ వెంటనే ఆయన్ని కారులో ఎక్కించి ఆయన యింటికి తీసుకువెళ్ళాను. 'ఆ' ఇంటికి తీసుకుని వెళ్ళడంవల్ల—నాకు ఒక మేలు జరిగింది" అతను ఒక్క క్షణం ఆగి .... "వారి అమ్మాయిని నేను వివాహం చేసుకుంటున్నాను" అన్నాడు. జానకి రామయ్యకూడా అవును అన్నట్లు తల ఊపాడు.

"చాలా మంచిది. ఆ సలహా నేనే ఇద్దా మనుకున్నాను" అన్నాడు కరణం.

తర్వాత కాస్సేపు లోకాభిరామాయణం చెప్పుకుని ముగ్గురూ లేచి "మేం వస్తామండి" అన్నారు. రాఘవేంద్ర మృత్యుంజయుణ్ణి సమీపిస్తూ "ప్రొద్దున్న జరిగిన విషయానికి నేను చాలా విచారిస్తున్నాను" అన్నాడు. ఆ మాటలు వినేసరికి మృత్యుంజయుడిముఖంలో నవ్వు వాడు రూపాలు లేకుండా పోయింది రెండు నిముషాల పాటు తల వంచుకుని అలానే ఉండిపోయి తర్వాత "ఫరవాలేదు లెండి" అనేసి చకచకా మేడ మీదికి వెళ్ళిపోయాడు. అతని వింతప్రవృత్తికి అందరూ ఆశ్చర్యపోయారు.

* * *

వివాహం వైభవంగా జరిగింది. ఊరువూరంతా "మృత్యుంజయునివివాహం మృ త్యుం జ యు ని వివాహమే" అని పొగిడారు విచారరేఖలతో చిక్కుకున్న మృత్యుంజయునిముఖాన పులుముకున్న సంతోషరేఖలు చూసి వీరాస్వామి ఆనందించాడు



చూస్తూచూస్తూ ఉండగానే, 'చూస్కో నాకేం' అన్నట్లుగా ఓ వారం వెళ్ళిపోయింది.

* * *

ఆవేళ ఆదివారం. సాయంత్రం నాలుగు గంటలయ్యింది. మృత్యుంజయుడు మేడమీద భార్యతో కబుర్లు చెప్తున్నాడు. అతను ఏటో చూస్తున్నాడు. ఆమె అతనికేసి చూస్తోంది. చూసిచూసి "ఏవిటి? ఆలోచిస్తున్నారు ?" అంది. మృత్యుంజయుని ఆలోచనకు ఆమాట అంతరాయం కలుగజెయ్యలేకపోయింది. ఆమె మళ్ళా అవేమాటలు అంటూ భర్తముఖంమీద చెయ్యివేసింది. అదమరచి ఆలోచిస్తున్న అతను ఉలిక్కిపడి "ఏవిటి" అన్నాడు. ఆమె ఈసారి అవే మాటలు సుదీర్ఘంతో అంది. ఆ మాటలకు మృత్యుంజయుడు చిన్నగా విరునవ్వు నవ్వాడు. ఆ నవ్వు విరాగినవ్వులా ఉంది ఆమెకు. "ఏం ? ఇవాళ అదోలా ఉన్నారు ?" అంది పడవలోంచి రూములోకి వెళుతూ. మృత్యుంజయుడు మారుమాట్లాడకుండా ఆమెను అనుసరించాడు. ఆమె సోఫాలో కూర్చుని "ఏం నాతో చెప్పకూడదా ?" అంది. మృత్యుంజయుడు ఆమాటలకు నవ్వుముఖంతో "నీతో చెప్పకుండా ఎలాగ ?" అన్నాడు. అతని నవ్వు ఆమెకు సంతృప్తి నివ్వలేదు. "సరస్వతి, నా మొదటిభార్య ఇవాళ గుర్తుకు వచ్చింది. ఆమెకథను నీకు చెప్పనా ?" అంటూ లేచి నించున్నాడు. సరస్వతి కొంచెం తమాయించుకుని "చెప్పండి" అంది.

అతను తన మొదటిభార్య చనిపోయినసంగతి ఆమెతో ఇదివరలో ఒకసారి చెప్పాడు. కానీ ఆ చనిపోయిన 'కథ' విషయం ఎప్పుడూ ప్రస్తావించలేదు. ఆమె చెప్పమనగానే మృత్యుంజయుడు సోఫాలోంచి లేచి కిటికీలోంచి బయటకు చూస్తూ ప్రారంభించాడు.

"నా మొదటి .... మొట్టమొదటి భార్య సుగుణ. ఆమె చాలా అందమైనది ....."

గడియారం 'ఠంగుఠంగు'న అయిదుగంటలు కొట్టింది. మృత్యుంజయుడు గంటలు లెక్కపెట్టడం అయినతర్వాత ఆ కథను ప్రారంభించి ముగించాడు. కథ ముగించేసరికి ఠంగున అర గంట కొట్టింది మృత్యుంజయుడు ఇంకా అలాగే నీలాకాశంవంక చూస్తూ నుంచున్నాడు. కథ వింటున్న సరస్వతిమీదకు అతని దృక్కులు అతి నెమ్మదిగా మరల్చాడు ఆమె సోఫాలో తల పక్కకి వాల్చేసి ఉంది. కళ్ళు మూసుకొని ఉన్నాయి. మృత్యుంజయుడు రుమాలుతో నుదుటపట్టిన చెమటను తుడుచుకున్నాడు. ఆమెకేసి చూస్తూ అలాగే శిలాప్రతిమలా ఉండిపోయాడు. ఎరుపెక్కిన అతనికళ్ళనుండి రెండు వేడి కన్నీటి బొట్లు రాలి చంపలమీద నిలిచాయి.

"అమ్మగారు నిద్రపోయారా ! అదేవిటి ?" అంటూ వీరాస్వామి రెండు గ్లాసుల పాలతో గదిలోకి అడుగుపెట్టాడు. మృత్యుంజయుని వైఖరి చూసి అతను ఆందోళనపడుతూ గ్లాసులు టేబులుమీద పెట్టి మళ్ళా అవేమాటలు మాట్లాడాడు. మృత్యుంజయుడివైఖరిలో మార్పేమీ లేదు అత వలాగే రాతిబొమ్మలా నించున్నాడు. చూపులుమాత్రం ఆమెమీద నిలిచాయి. వీరాస్వామి ఈసారి మరింత గట్టిగా అదేప్రశ్న వేసి ఆమెకేసి తిరిగి "అమ్మగారూ, అమ్మగారూ, చిన్నమ్మగారూ" అన్నాడు. ఆమె పలుకలేదు. ఉలకలేదు. "నిద్రా ? ఇదేం నిద్ర ?" వీరాస్వామి తనలో తాను గొణుక్కున్నాడు

"అమ్మగారు....నిద్ర....కా దు .... పోయారు" ఈ మాటలు మృత్యుంజయుని నోట్లోంచి ప్రవాహం అయ్యాయి. ఆ మాటలు వింటూనే వీరాస్వామి ఒక్క దూకుతో సోఫావద్దకు వెళ్ళి ఆమెనుదుట చెయ్యిపెట్టి చూశాడు అతని చెయ్యి గడగడలాడింది. 'అమ్మా' అంటూ పసిపిల్లాడిలా ఏడువు ప్రారంభించాడు. మృత్యుంజయుడు నెమ్మదిగా అడుగులువేసుకుంటూ కిటికీ వద్దకు చేరాడు అతనిలో అంతర్గత దుఃఖం పొర్లివచ్చింది. ఆవేశంతో తల గోడకేసి బాదుకున్నాడు. వీరాస్వామి అతన్ని—బలమంతా ఉపయోగించి వెనక్కు లాగాడు. మృత్యుంజయుడు యాంత్రికంగా ఆమె ఎదురుగా ఉన్న మరో సోఫాలో కూర్చున్నాడు.

* * *

వాయువేగంతో ఈ వార్త ఊరంతా పాకిపోయింది. కరణం, మునసబు, రాఘవేంద్రలు మహావేగంతో వచ్చి వాలారు. మృత్యుంజయుడు సోఫాలో అలాగే నిర్జీవంగా కూర్చున్నాడు. రాఘవేంద్ర వీరాస్వామిని వివరాలు అడిగాడు. అతను ఏమీ చెప్పలేదు. రాఘవేంద్ర బయటకు పరిగెత్తి

# క్షమాహంతుడు

మృత్యుంజయుని కారుమీద పట్నంవెళ్లి డాక్టరును పిల్చుకొచ్చాడు. డాక్టరు పరీక్ష చేస్తూంటగా "డాక్టర్! కొందరి కొందరి గుండె శ్వాస్పవు కొట్టుకోడం మానేసి మళ్లా పనిచేస్తుంది. అది దుర్బలంవల్ల జరుగుతుంది. నేను అలాటి కేసులు చాలా నా కళ్లతో చూశాను. సరిగా .... చూడండి" అన్నాడు ఆత్రంగా. డాక్టరు చూసి చూసి పెదవి విరుస్తూ "లేదు! గుండె ఆగి చనిపోయారు. ఇంతకుమునుపు ఈవిడకు ఇలాంటి జబ్బు ఉందా ? అంటే .... గుండె దుర్బలం" అంటూ అందరికేసి చూశాడు. కరణం గొంతు సవరించుకుంటూ "లేదండీ! నేనా పిల్లను ఎరుగుదును. మంచి ఆరోగ్యవంతురాలు. ఏనాడూ ఏరోగమూ రాలేదు" అన్నాడు. డాక్టరు బుర్ర గోక్కున్నాడు. తోలుసంచిలో సరుకులు సర్దుకుంటూ "అయితే! మరేకారణంవల్లయినా గుండె ఆగిపోయి ఉండాలి" అన్నాడు. రాఘవేంద్ర ఉలిక్కిపడ్డాడు. "గుండె ఆగిపోయింది. హఠాత్తుగా ఏదో వినడంవల్ల" అతను అరిచాడు. సోఫాలో విగ్రహంలా కూర్చున్న మృత్యుంజయుడు విరుచుకు పడిపోయాడు. డాక్టరు అతనికేసి పరుగెత్తాడు. రాఘవేంద్ర పిచ్చివాడిలా తనలో తాను గొణుక్కున్నాడు, బుర్ర గోక్కున్నాడు.

* * *

తెలివి, అయిడియాలున్న రాఘవేంద్రం బుర్ర 'గోకగా గోకగా' ఒక తెలివైన అయిడియా యిచ్చింది. ఇంటికివెళ్లిన అతను బుర్ర గోక్కుంటూ కూర్చోక తను సంపాదించిన, రాసిన అద్భుత విషయగ్రంథ సంపుటాలు తిరగెయ్యడం ప్రారంభించాడు. అతను తనతో తెచ్చుకున్న వాట్లల్లో అతనికి కొన్ని అనుమానాలు దొరికాయి. విసిరిన బంతిలా మునసబు ఇంటికి పరుగెత్తాడు... మునసబు, కరణం ఇంకా ఆ సంఘటనలోంచి తేరుకోలేక—'కోవాలా వద్దా' అని ఆలోచిస్తూ 'రావాలా వద్దా' అని గుమ్మం దగ్గర నించున్న రాఘవేంద్రను చూసి కోలుకొంటూ, లోపలకు రమ్మన్నారు. రాఘవేంద్ర అన్నదే తడవుగా నట్టింట్లోకి వచ్చేసి, ఖాళీగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

"జానకిరామయ్యగారి కూతురు సరస్వతి అలా గుండె ఆగిపోయి చనిపోయిందంటే నేను నమ్మలేకుండా ఉన్నాను. రాయిలాంటి పిల్ల" అన్నాడు కరణం నిశ్శబ్దాన్ని భరించలేక. రాఘవేంద్ర తను తెచ్చిన పుస్తకంలోంచి ఒకఘట్టం చదివేవాడి ఫోజులో కూర్చున్నాడు.

"ఏవిటో ? వేదాంతిగారు చకచకా చదివేస్తున్నారేవిటి ?" అన్నాడు మునసబు వెటకారంగా. రాఘవేంద్ర ఆ వెటకారంలో భావం గ్రహించే స్థితిలో లేడు. ఒకవేళ గ్రహించినా, హింసించడం అతని పనికాదు. గ్రహించడం వరకే అతని వృత్తి. అందుకని రాఘవేంద్ర గొంతు సవరించుకొంటూ "ఇది వినండి. మీరు ఆశ్చర్యపడి అనుమానపడతారు" అన్నాడు. 'పోనీలే విందాం' అనుకున్నట్లు కరణమ్మ, మునసబులు ఒకళ్ళముఖాలు ఒకళ్ళు

చూసుకుని విచిత్ర స్థితిలో అతని ముఖంవంక చూశారు. అతను ప్రారంభించాడు.

"ఇప్పటికి అరువందల సంవత్సరాల క్రితం .... వ్వు .... వ్వు .... ఆ ఊరు పేరూ, అతని పేరూ చెప్పకులెండి" అన్నాడు తల ఎత్తుతూ.

"ఇదిమటుకూ చెప్పమని మేం అడిగామా ?" మునసబు మాట విస్పిరికొట్టాడు. అది వాతకాని కరణం తనచూపుతో కొట్టాడు. రాఘవేంద్ర ఇబ్బందిగా ముఖం పెట్టుకుని, సర్దిపుచ్చుకుని, గొంతు సవరించుకుని, ప్రారంభించాడు.

"ఇప్పటికి ఎనిమిదివందల సంవత్సరాల క్రితం ఒక ఊళ్లో ఒక జమీందారు ఉండేవారు. అతని వయస్సు ముప్పయి లోపు. ఆ ఊరు వచ్చిన కొన్నాళ్లకి అతనికి వివాహం అయ్యింది. వారం తిరగకముందే భార్య చనిపోయింది. మరో వివాహం చేసుకున్నాడు. పది రోజులు తిరక్కుండానే ఆమె పోయింది. మరో వివాహం—అదీ అంతే...అయితే ఈ చావుకు కారణం అడుగరేం ?" అతను వాళ్లని అడిగాడు.

వాళ్ళు అడగదల్చుకోకపోలేదు, కానీ అడిగే స్థితిలో లేరు. ఆ స్థితి గమనించి మళ్లా అతనే, తనకు తనే, అడుక్కుని ప్రారంభించాడు.

"అందరు భార్యలూ గుండె ఆగిపోవడంవల్లే పోయారు."

"గుండె ఆగకుండా ఎవరైనా పోతారా ?" కరణం అడ్డువచ్చాడు. రాఘవేంద్ర తల గోక్కున్నాడు.

"వినండి" అతను వినిపించడం ప్రారంభించాడు.

"ఈ అతని భార్యలందరూ ఏదో హఠాత్తుగా ఒక సంఘటనను ఎదుర్కోడంవల్ల గుండె ఆగి చనిపోయారట. అంటే గుండె ఆగిపోయేఅంత దారుణమైన విషయం విన్నారన్నమాట !" అతను ఆగాడు. ఈ కథలో మర్మం మునసబు కరణాలకి ఓ ఆవగింజంత అర్థమయ్యింది.

"మన మృత్యుంజయునిభార్య పోయినట్లే !" కరణం అంతర్గత ఆశ్చర్యాన్ని అవతలికి వదిలేశాడు.

"అవును...ఇది వినండి...మళ్లా నూట యిరవై సంవత్సరాల క్రితం యిదే వింత...అతనికీ ముగ్గురు భార్యలు గుండె ఆగి చచ్చారు. ఓపికగా ఆ ఊరు వాళ్ళు మరో మూడుచావులు కూడా చూశారు. అనాటికి అతనికి ఆరుగురు భార్యలు పోయారు. అప్పటికి జనంలో అలజడి బయల్దేరింది. 'అతడు రాక్షసుడు అన్నారు కొందరు...దయ్యం అన్నారు... పిశాచి, కాదు. ప్రాణాంతకుడు..నరాంతకుడు..దేవాంతకుడు" అని యిలా ఎన్నో రకరకాలుగా అన్నారు. అతన్ని చీదరించారు. చీత్కరించారు. క్రమేణా అతను ఆ ఊళ్లోంచి వెళ్లిపోయాడు ...." అతను ఆయాసపడుతూ ఆగాడు.

(సశేషము)

# న్యూఢిల్లీ లేఖ

(7-వ పేజీ తరువాయి)

కొద్ది ధనం వెచ్చిస్తున్నా రన్నమాట.

శ్రీ శ్రీమన్నారాయణ్ ప్రణాళికా సంఘ సభ్యుడు. "గాంధిజీ అభివృద్ధి ప్రణాళిక" అన్న గ్రంధం ప్రచురించి ఆయన ప్రప్రథమంగా వెలుగులోకి వచ్చారు. ఒకప్పుడు మద్యనిషేధ సంఘ అధ్యక్షుడు కావటంవల్ల ఆ సంఘ సూచనలను అమలుచేసేందుకని ఆయన శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు

భారీ పరిశ్రమలకు ప్రోత్సాహం ఇచ్చే మూడవ పంచవర్ష ప్రణాళికమీద, ప్రణాళికాసంఘ సభ్యుడుగా ఆయన సంతకం చెయ్యాలి. లోగడనే చెప్పినట్లుగా, ఆయనేమో గాంధేయ పథంలో తమ ప్రతిష్ఠను పెంచు కున్నారు. 1942 జూన్ 6 వ తేదీ మహాత్మా గాంధిజీ శ్రీ లూయీ ఫిషర్ల మధ్య దిగువ విధంగా సంభాషణ సాగింది.

"స్వతంత్ర భారతదేశంలో ఏం జరుగబోతోంది" అని నే నడిగాను (ఫిషర్).

"కర్షక జన బాహుళ్యాన్ని అభివృద్ధి చేసేందుకు మీరేం చెయ్యబోతున్నారు ?"

"ఏముంది ? కర్షకులు భూమి తీసుకోవచ్చు. "ఆ విషయం మేం వారికి చెప్పక్కర్లేదు. వాళ్లు తీసుకొంటే తీసుకోవచ్చు." అన్నా రాయన.

"అయితే భూస్వాములకు, తగిన ప్రతిఫలం ముట్టచెప్తారా ?"

"లేదు" అన్నారాయన చిరునవ్వుతో "ఆర్థికమైన ఇబ్బందుల దృష్ట్యా అది అసాధ్యం. చూడండి ! లక్షాధికార్లతో మైత్రి, వారిపట్ల కృతజ్ఞత, ఇలాంటి విషయాలు చెప్పేందుకు ఏమీ అడ్డురావు. ప్రతిగ్రామం స్వయంపాలక వ్యవస్థ అవుతుంది" అన్నారాయన.

"అయితే ఈ విధానం సోవియెట్ పద్ధతికి చాలా దగ్గరగా ఉందే ?"

"ఉందేమో నాకు తెలియదు." "అయినా ఫరవా లేదు." అన్నారు గాంధిజీ.

గాంధిజీ, 1941 లోను ఆ తరువాత 1945 లోను గూడా, తమ నిర్మాణాత్మక పథకం సందర్భంలో, భారతీయ పెట్టుబడిదారులను హెచ్చరిస్తూ ఇలా వ్రాశారు :

భాగ్యవంతులకు, అన్నానికి నోచుకోని వేలాది బీదా బిక్కికి మధ్య ఉన్న అంతరం మాసిపోనంత కాలం అహింసాయుత ప్రభుత్వ మనేది అసంభవం. న్యూఢిల్లీ మహాసౌధాలలో ఉండే భాగ్యవంతులకు, ఆ ప్రక్కనే మురికివాడలలో ఉండే వేలాది బీద కార్మికులకు ఉన్న అంతరం సర్వ మానవ సమానత్వం పొందబోయే స్వతంత్ర భారతదేశంలో ఒక్కరోజు కూడా ఉండదు. సర్వమానవసంక్షేమానికిగాను భాగ్యవంతులు తమ ధనాన్ని, అధికారాల్ని ఐచ్ఛికంగా వదులుకుంటే తప్ప రక్తపాతంతో కూడిన విప్లవం ఏదో ఒకరోజున తప్పదు."



# గళ్లనుడికట్టు-60



## అడ్డం

1. ఆంధ్ర రాష్ట్రం మొదటి గవర్నర్
3. —కంటె కట్టె ఏది?
5. పుస్తకంలో అయ్యో!
7. వ్రాతలో విధమా?
8. ఎక్కువే
9. తిరగబడిన, పాదుకలో చెట్టుకు సంబంధించినది.
11. సక్క ఇదే మరి!
12. అగని వానిలో ధాతువులు దొరుకుతాయా?
14. ఈ సంవత్సరం జరిగిన లెక్కలు దీనివే.
15. వారికి తగని వారిలో ఇల్లాలు
17. గీత జారుతుందనగా రాజు ఈనాముగా ఇచ్చిన భూమి
18. కరిదిమ్ముల మధ్య అనంతపూరు జిల్లాలో ఒక వూరు.
19. రాత్రి
20. వారు నవ్వినా మంచం అల్లండి!
21. మర కదలనిచోట సిక్తమైనది సూచించేదేనా?
23. స్త్రైణమూ తగిలించే అల్లుడిక్కడే
25. తలక్రిందులుగాదున్నని భూమి
26. చర్మము
27. దగ్గర పుట్టిపాత్రముందుభాగంలో ఉంటుంది.
29. గరువమే అనుకోండి, కాని రుచి ఒక విధంగా ఉంటుంది!
30. తెన్నుముందు వస్తూ ఉండేది
31. వరకు!
32. పిడవు.
33. అనపకాయ కరువు, తర్వాత ఏది?

## నిలువు

2. వేలి నడుమ కేశ విశేషము.
4. ఒకటికాక ఐదు పూర్ణానుస్వారాలు కలవాడు!
6. ఉన్నది?
7. పర్వతరాజ కుమార్తె
10. వ్యవసాయం చేసేమనిషి
11. వెలుగు చెయ్యగా కలవాడు.
13. సత్యాసత్యాలు
15. సరిగమలలో గొప్పతనం ఉంది!
16. మీగడ రూపమేనా?
20. ఈకల నడుమ నలుసు!
22. విలువగల రాళ్ళు కడుపులో కలవాడెవడు? సముద్రుడేగా!
24. వాలి తరువాత చిగురే!
28. పన్నెండు జడలను తిలకించండి
30. తీయదనములోనే, అదే!

## 59-వ గళ్లనుడికట్టుకు జవాబు



# పొట్టి కథలు

## "తండ్రినిగాదు తల్లిని"

ఒక పాత తరహా మనిషి, తనకు ఎదురుగ వింత వేషం వేసి, సిగరెట్టు కాల్చుకుంటూ వయ్యారంగా నడిచివెళ్లే ఒక అమ్మాయిని చూచి-తన ప్రక్కన నిల్చుని ఉన్న వానితో "నాగరికత అంటూ ఇప్పటివాళ్లు ఎంత పోకిరీల లాగ తయారవుతున్నారు. ఇప్పటి వేషాన్ని బట్టి ఆడో, మగో కూడ తెలుసుకోవడం కష్టం సుమా. ఆ వెళ్లేవాడు అబ్బాయా అమ్మాయా."

ప్రక్క మనిషి:-అది అమ్మాయే. ఆమె నా కుమార్తె.

పాత తరహా మనిషి:- అలాంటి అమ్మాయిలకు మీరు తండ్రి అవుతారని నేను కలలో కూడ అనుకోలేదు.

ప్రక్కమనిషి:--నేను ఆ అమ్మాయికి తండ్రినిగాదు తల్లిని.

* * *

## పెద్దబ్బాయి

ఒకానొక ఇంగ్లీష్ ఆవిడ, ఫ్రెంచి దేశపు నర్సుని యింట్లోని పనులను చూచుకొనుటకు జీతమునకు కుదుర్చుకుంది. యజమానురాలు బయటపనులు చూచుకొని యింటికి వచ్చినవెంటనే "పిల్లలందరిచేత స్నానాలు చేయించావా" అని అడిగింది. దానికా నర్సు "అందరిచేత సరిగానే చేయించానుగాని, ఎర్రజుట్టు పెద్దబ్బాయి మాట్టుకు రెండు కొడితేగాని స్నానం చేయలే" దని చెప్పింది.

అప్పుడు యజమానురాలు "ఓరి భగవంతుడా! ఎర్రజుట్టు అతడు నా పెద్దబ్బాయిగాడు. అతడే నా భర్త" అని చెప్పింది.

ముద్రగడ్డ జానకీదేవి (గణపతినగరం)

## పైవారంనుంచి ప్రారంభం!

# 'ఆదర్శాలు - ఆంతర్యాలు'

### ఉగాది నవలల పోటీ బహుమతి నవల

# 26-7-61

### సంచికనుంచి మరొక నవల ప్రారంభం
### వివరాలకు పైవారంసంచిక చూడండి

## త్వరలో ప్రారంభం!

# 'బియోవుల్ఫ్'

### బాలసాహితి సీరియల్

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad,

# చెమటకాయలా?

## ఆలస్యము చేయకండి...

# జాన్సన్స్ ప్రిక్లీ హీట్ సోప్ మరియు పౌడరు

## నేడే కొనండి!

పేరుగాంచిన యీ ద్వివిధ చికిత్సతో ఎంతో
త్వరితముగా, నిశ్చయముగా చెమటకాయల వలన
కలుగు అసౌఖ్యమును పోగొట్టుకోగలరు!

మొదట, ఆరోగ్యరక్షకమైన జాన్సన్స్ ప్రిక్లీ హీట్
సబ్బు వాడండి. అది చల్లదనమును,
ఉపశమనమును యిచ్చి నవోత్సాహమును
కలిగిస్తుంది. అది చెమటకాయల వలన కలుగు
అసౌఖ్యమునకు కారణమైన సూక్ష్మ రంధ్ర
ములు మూసుకొనిపోవుటను పోగొట్టుతుంది.

తరువాత, సౌమ్యమైన, గుణముకలిగించే
జాన్సన్స్ ప్రిక్లీ హీట్ పౌడరు వాడండి. అది
తేలికైన సువాసనగలది మరియు మిమ్మల్ని
మండే ఎండగల రోజునైనా రోజంతా తాజాగా
మరియు హాయిగా ఉండేలా ఉంచుతుంది!

**జాన్సన్ & జాన్సన్**







JWT-11-2027